Murty's Popular Guides :

# Pre University Course 1961

ANDHRA UNIVERSITY

# Telugu Selections

B Y
VARANASI RAMABRAHMAM, M. A., U. B. P.
Head of the Dept. of Telugu
S. K. B. R. College, Amalapuram,
&
VEDULA SUBBA RAO
VISAKHAPATNAM.



PUBLISHERS :
M. S. R. MURTY & Co.,
VISAKHAPATNAM-2
1 9 6 0



[ Rs. 2-00

# విషయసూచిక



—*—

# బకాసుర సంహారము

## శ్రీమదాంధ్ర మహాభారతము

### ఆదిపర్వము — షష్ఠాశ్వాసము

### (నన్నయభట్టు)

కవిజీవితాదులు :—

బకవధ యను నీ పాఠ్యభాగము శ్రీమదాంధ్రమహాభారతములోని ఆదిపర్వమందలి షష్ఠాశ్వాసములోనిది. దీనిని రచించినవాఁడు నన్నయభట్టారకుఁడు.

హిందూమతమునకు శ్రుతి, స్మృతి, పురాణ, ఇతిహాసములు పరమప్రమాణములు. వీనిలో తొలి మూఁడింటివిషయములను చక్కఁగఁ గూర్చుకొని రామాయణ భారతములు ఇతిహాసములను పేరున సర్వజనాదరపాత్రములైనవి. అందుమహాభారతమును సంస్కృతమున శ్రీకృష్ణద్వైపాయనుఁడను వేదవ్యాసమహర్షి రచించెను. ఈతఁడు కౌరవ పాండవవంశములకు మూలపురుషుఁడై యెడనెడ వారికిదగిన బోధనల నుపదేశములను జెప్పుచుండెడివాఁడు. కౌరవపాండవులు భరతునివంశములోనివారు గాన వారి వృత్తాంతమును దెల్పు నీ గ్రంథము భారతమను పేరు నొందెను. గుణాతిశయమున నయ్యది వేదములకంటె బరువుగాఁ దూఁగుటచే భారతమని పేరందినదని కొందఱందురు. మహాభారతమనునది దానికిఁ బర్యాయపదము. ఆధ్యాత్మిక భావదారిద్ర్యమున నధోగతిపాలైన యార్యసంఘమునందు భారతచరిత్రమూలమున సత్యధర్మములు తిరిగి ప్రతిష్ఠించి లోకోద్ధరణము గావించు తలంపున వ్యాసుఁడా గ్రంథమున వేదవాఙ్మయసారమంతయుఁ బ్రతిపాదించెను. వేదములను జదువఁజాలనివారందఱును నీ భారతమును జదువవచ్చును. గాన దీనిని జదివినవారికి వేదపఠనాభావమున కొఱత రాకుండునట్లు వ్యాసుఁడు దీనియందు ధర్మార్థకామమోక్షములను జతుర్విధపురుషార్థములను బోధించు పెక్కు పూర్వరాజచరిత్రములను వివరించెను. ఈ కారణమున భారతము పంచమవేదమని పేరువడసినది. అయ్యది లక్షశ్లోకపరిమితంబు నష్టాదశపర్వశోభితంబునై వ్యాసుఁ డొనరించినవిధమున విశ్వజనీనమై పరఁగుచున్నది.

అట్టి మహాభారతమును నన్నయ, తిక్కన, ఎఱ్ఱన లాంధ్రీకరించిరి. నన్నయభట్టు భారతమున ఆదిసభాపర్వములను, అరణ్యపర్వమున మూఁడాశ్వాసములపై 142 పద్యములనుమాత్రము రచించి దివంగతుఁడయ్యెను. పిదప క్రీ.శ. పదుమూఁడవ శతాబ్ది పూర్వభాగమున నెల్లూరును బరిపాలించిన మనుమసిద్ధిమహీపాలుని మంత్రియు

ఆస్థానకవి యగు తిక్కన సోమయాజి విరాటపర్వమాదిగాఁ బదునేను పర్వము లనురచించి తనయిష్టదైవమగు హరిహరనాథునకంకితమిచ్చెను. అతఁడే కారణమువలనో నన్నయ విడిచిన యరణ్యపర్వశేషమును మాత్రము పూరింపలేదు. తరువాత నాశిష్ట భాగమును క్రీ. శ. పదునాల్గవ శతాబ్దిలోఁ గొండవీటిరాజ్యమేలిన అనవేమారెడ్డి యాస్థానకవియగు ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయపేరనే తెనిఁగించి రాజరాజనరేంద్రునకే యంకితముచేసెను. వీరిలోఁ బ్రస్తుత పాఠ్యభాగమును రచించినవాఁడు నన్నయభట్టు.

నన్నయ రాజరాజున కాస్థానకవి. కవియు నాతనికిఁ గులబ్రాహ్మణుఁడు (పురోహితుఁడైయుండును) ఆతఁ డాపస్తంబసూత్రుఁడు; ముద్గలగోత్రుఁడు అవిరళజపహోమతత్పరుఁడు; వేదసంహితాభ్యాసుఁడు; సద్వినుతావదాతచరితుఁడు; నిత్యసత్యవచనుఁడుఁ సుజనుఁడు; బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁడు; ఉభయభాషాకావ్య రచనాశోభితుఁడు; విపుల శబ్దశాసనుఁడు; సత్ప్రతిభాభి యోగ్యుఁడు; నుత్యమరాధిపాచార్యుఁడు. ఇట్టి సద్గుణగరిష్ఠుఁడగు నన్నయభట్టు తన ప్రభువగు రాజరాజు ప్రేరణముచేఁ దనకిష్టుఁడును సహాధ్యాయుఁడును నైననారాయణ భట్టు సాహాయ్యముగొని భారతాంధ్రీకరణము సాగించెను. కాని కాలప్రభావమున సఫలీకృతాశయుఁడు గాకుండ దివంగతుఁడయ్యెను. ఇట్లాతఁ డరణ్యపర్వములో గొంతవఱకు మాత్రము ముగింపఁగలిగెను. ఈ గ్రంథరచనమునకుఁ బూర్వమే నన్నయ భట్టు ఆంధ్రశబ్దచింతామణియను వ్యాకరణగ్రంథము నొకదానిని రచించెను. చాముండికావిలాసము, ఇంద్రవిజయము, రాఘవాభ్యుదయము నను గ్రంథములు గూడ నన్నయ రచించెనందురు. కాని భారతకవిత్వమునకును నా గ్రంథములందలి కవిత్వమునకును జాల వ్యత్యాస ముండుటంబట్టి యవి నన్నయరచితములు కావని విమర్శకులు నిశ్చయించిరి. ఆంధ్రమున సలక్షణమగు ప్రౌఢకావ్యరచనమునకు నన్నయభట్టే యాద్యుఁడు. ఈతనికిఁ బూర్వము కొంత క్రమపరిణామము చెందియుండుట నిశ్చయమే. కాని యాతనికి పూర్వమునందున్న యే గ్రంథమును దొరకకపోవుటచే తెలుఁగున నీతఁడే 'యాదికవి' యనఁబడుచున్నాఁడు. ఆంధ్రశబ్దచింతామణి రచనామూలమున భాషకు సౌష్ఠవ మొనగూర్చుటచే నీతఁడు 'వాగనుశాసనుఁడు' అను బిరుదముగూడ నందెను.

నన్నయ కవిత్వము సర్వజనాదరణపాత్రమై యెల్లవిధములఁ దరువాతి కవులకు మార్గదర్శకమై యొప్పుచున్నది. ఈతఁడు భారతబద్ధనిరూపితార్థము గైకొని తన యిచ్ఛనై చేర్పులుమార్పులు గావించి సొగసుగా గ్రంథరచనము సాగించినాఁడే కాని మూలమునకుఁ గేవలము దాసుఁడు కాలేదు. తిక్కన ఎఱ్ఱనలుకూడ నీతనిమార్గము నే యనుసరించిరి కావుననే యాంధ్రదేశమున నాంధ్రభారతము సంస్కృతభారతమును మఱపింపఁజాలినది. నానారుచిరార్థసూక్తినిధియైన యీ మహాకవి "సార

మతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో నారసి మేలు నాఁ, నితరులక్షర రమ్యత నాదరింప’’ రచింతునని తానొనర్చిన ప్రతిజ్ఞ నూటికినూరుపాళ్ళు నెరవేర్చుకొనినాఁడు. ఈయన కథాకథనరీతి యనన్యసామాన్యమై యవిచ్ఛిన్నధారావేగమై మనోహరముగా నుండును. కథాగతి, పఠితలమనస్సులను దనవెంట లాగుకొని పోవును. బకాసురకథవంటి వింకను నిదర్శనములు. ఈతని శైలి సంస్కృతపద భూయిష్ఠము, దీర్ఘసమాసబంధురమునై యుండును. అట్లయ్యునది సులభగ్రాహ్యమై నిరర్గళవాగ్వేదమై, గాంభీర్యయుతమై శ్రవణపేయముగా నుండును. కుంతికిని బ్రాహ్మణకుటుంబమునకును నడచిన సంభాషణమును భీముఁడు బకాసురు నెదుర్కొన్నరీతియు నింకను నిదర్శనములు. వర్ణ్యవస్తువు పఠితల మనోనేత్రములకుఁ బ్రత్యక్షమగునట్లు చేయుటలో నీతని ప్రజ్ఞ యసాధారణము. ఈతఁడు పాత్రచిత్రణమునఁ గృతహస్తుఁడు. భీమబకాసురులు మన కండ్లయెదుటఁ గట్టబడినట్లుండును. ఈతఁ డలంకారములఁ జమత్కారసూక్తుల కాసపడలేదు. ఎంత విపులార్థమునైనఁ జిన్న మాటలలో నిల్లడిచేయుటకై యీతని కపారముగాఁ గలదు. ‘ఇంతకయేని సాహసమున కెన్నఁడు రోయక...’ ఇట్టి పద్యము లింకను నిదర్శనములు.

నన్నయ పెట్టిన యొరవడినిబట్టియే తిక్కన కథారచనము నడిపెను గాని, తిక్కన మాటలకూర్పులో తెనుఁగుదనము మిక్కిలి హెచ్చు. నన్నయరచనము ధర్మప్రధానముగానుండ తిక్కన రచనలో లోకవ్యవహారచమత్కృతి స్ఫుటమగును. ఎఱ్ఱన తనపూర్వుల నిర్వురను ననుకరించె ననఁదగును.

కథాసందర్భము:—

పాండవులు ధృతరాష్ట్రునాదేశంబున వారణావతంబున నివసింపఁబోయిరి. దుర్యోధనుఁడది యెఱిఁగి మాయోపాయంబున వారిని మట్టుపెట్టఁదలఁచి వారికై యట నొక లక్కయిల్లు నిర్మించెను. పాండవు లందుండ దానిని దగులబెట్టుమని దుర్యోధనుఁ డొకనిని నియోగించెను. పాండవు లాద్రోహమును విదురునివలన ముందుగా నెఱిఁగి తగు జాగ్రత్త గలిగియుండిరి. లక్కయింటిని దగులఁబెట్టు నాటి రాత్రి భీముఁడు తల్లిని తోఁబుట్టువులను నాయింటినుండి రహస్యమార్గమున మోచి కొనుచుఁబోయి యొకయడవిఁ జేరెను. అట నందఱు నలసి నిద్రించుచుండ హిడింబాసురుఁడు భీమునిం దాఁకెను. అన్నలకు నిద్రాభంగమగునని యెంచి భీముఁడు హిడింబుని దవ్వుగ నీడ్చుకొనిపోయి వానినటఁ బొడిచి చంపెను. హిడింబుని సోదరియగు హిడింబి నాతఁడు తన సోదరులను దల్లియు నాజ్ఞాపింప భార్యగా గ్రహించెను. అట్టితరిని వేదవ్యాసుఁ డాయన్నదమ్ములకుఁ బ్రత్యక్షమై, శుభములు రాఁగలవని వారికి ధైర్యము చెప్పి, సమీపమందలి యేకచక్రపురమున వారు బ్రాహ్మణభావమునఁ గొంతకాలముండవలెనని నియోగించెను. హిడింబియందు భీమునికి ఘటోత్క

చూఁడను పుత్త్రుం డుదయించుననియు నాతఁడు మున్ముంగు తండ్రులనందఱ నాపదలో రక్షించుననియు జెప్పెను. ఘటోత్కచ జననమాయెను.

కథాసారాంశము: —

పాండవులు వ్యాసు నుపదేశంబున నేకచక్రపురమను నొక బ్రాహ్మణాగ్రహారము చేరిరి. అచ్చట బ్రాహ్మణ బ్రహ్మచారులవలె వారు భిక్షలు దిరుగుచు భిక్షాశనములు దెచ్చి తమతల్లికిఁ జూపి యామె పంచియిడ నా యన్నంబులు దిని కాలక్షేపము సేయుచుండిరి. తెచ్చిన యన్నములో కుంతి సగము భాగము భీమునికిఁ బెట్టెడిది. మిగిలిన సగము నామెయు మిగిలినదికొడుకులును దినుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు వారు కాపురమున్న యింట నొక పెద్దరోదన శబ్దము వినవచ్చెను. కుంతి యా రోదన కారణము గనుగొనెను. ఆ గ్రామ సమీపమున నడవిలో నొక రాక్షసుఁడుండెననియు, వానికి దినమున కాహారార్థ మొక యింటి నుండి యొకఁడు పోవలెననియు, నాఁడా యింటివారి వంతు వచ్చెను గాన రాక్షసునికి బలిగా నెవరిని బంపుదుమా యని వారు తర్కించి యేడ్చుచుండిరనియు నామె తెలిసికొని తాము కాపురమున్న యింటివారి కొక యుపకారము సేయుట మేలని నిశ్చయించెను. ఇంటివారి బిడ్డకు బదులుగాఁ దాను రాక్షసునికడకుఁ బోవుదునని భీముఁడనెను. కుంతి యా యేర్పాటునకు నింటివారి నొప్పించెను. మహాబలశాలియగు భీముఁడు తన బలాతిశయమునందలి విశ్వాసముచే రాక్షసుని ధిక్కరించి, వేళ తప్పించి వెడలి రాక్షసునికిఁ గోపము రెట్టించునట్లు నరించి, వానితోఁ బోరునకు డీకొని వానిం జంపి, రక్కసుని కళేబరము నేకచక్రపురమున కీడ్చుకొని వచ్చెను.

భీముఁడు ప్రజాపీడ తొలగించుటతో నీ యాఖ్యాన కథ యంతమగును. ఇట్టి భారత భాగమున భీమసేనుని యసమాన బలపరాక్రమములు ప్రత్యేకముగ వర్ణింపఁబడినవి. భీమునికి శత్రుజయమును, భార్యా పరిగ్రహణమును, పుత్త్రోత్పత్తియు, అన్నదమ్ములను తల్లి నేగాక, యచ్చటి గ్రామస్థులను రక్షించిన కీర్తియుఁ జేపడినవి. ఇట్టిది భీమసేన పరాక్రమ వర్ణనా కావ్యముగాఁ జిత్రింపఁబడినది.

అర్థాదులు :—

1. విషయంబులు = దేశములు.

---

పద్యము:- 1. వ్యా. వి:— (i) శాలిహోత్రు+ఒద్ద=షష్ఠీ సమాసమునందు ఉకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు. శాలిహోత్రునొద్ద, (ii) ఆ+ముని-(త్రికసంధి)-త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు ఆ+మ్ముని=దిరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘమునకు హ్రస్వంబగు. అమ్ముని, (iii) విషయంబులు+కడచి, అగ్రహారంబు+కని-(గసడదవాదేశసంధి)-ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు. విషయంబులు గడచి, అగ్రహారంబు గని.

2. పాండవులు; లలిత, జటా+అజిన, కుశ, వల్కలి, ధరులై=మనోహరమైన జడలను చర్మములను దర్భలను నారబట్టలను దాల్చినవారలై; వేదము; ఒప్పగా=చక్కఁగా (సుస్వరముగా;) చదువుచు; మనూత్రలన్=ఒప్పుగ, బ్రహ్మచారి వృత్తిని=బ్రహ్మచారుల వ్యాపారములతో, నెలయఁగన్=ప్రకాశింపఁగా, అందు=ఆ యేకచక్రపురమున, ఒక్క, విప్ర, గృహమునన్=బ్రాహ్మణుని యింటిలో, ఉండిరి.

3. ధృతిన్=ధైర్యముతో (సంతోషముతో), చదువుచున్=వేదమంత్రములు చదువుచు, భిక్షార్థము=బిచ్చముకొఱకు, ప్రతిగృహమునకున్=ఇంటింటికి తిరుగుచున్న=వెళ్ళుచున్న, భవ్యులన్=యోగ్యులును, మౌనవ్రతులన్=మాటాడకుండునట్టి నియమముగలవారు నగు పాండవులను, అందులు, గృహస్థ, సత్+ద్విజులు=ఆ యేకచక్రపురమందలి గృహస్థులైన యుత్తమ బ్రాహ్మణులు, దయన్=దయతో సతతము=ఎల్లప్పుడును, ప్రీతులన్=తృప్తి పొందువారినిగ, చేసిరి.

4. జలజప్రియ తేజులన్=పద్మములకు ప్రియుఁడైనసూర్యునియొక్క తేజసు వంటి కాంతిగలవారును, తేజ=(1) కాంతి, (2) పరాక్రమము, ధీరులన్=ధైర్యము గలవారును. ధరణీవలయ+రాజ్యశ్రీ+యోగ్యులన్=భూమండలపు రాజ్యలక్ష్మికిఁ దగినవారును (భూమినంతను నేలఁదగినవారును), అగు వీరలన్=ఈ పాండవులను, విధాతృఁడు=బ్రహ్మ, ఇట్లు=ఈ బ్రహ్మచారుల రీతిగా, ఏఁటికో=ఏ కారణముచేతనో, భిక్ష+అశులన్ (సవర్ణదీర్ఘసంధి)=భిక్షమెత్తిన యన్నము తినువారినిగా, చేసెను. అంచున్, జనుల్, శోకింపన్=దుఃఖించుచుండఁగా.

5. ఆ+ఏవురున్=ఆ యైదుగురును, నిత్యంబు=ప్రతిదినమును, పరమాన్న పాయసముతోను, భైక్ష, భిస్సా=భిక్షపు అన్నముతోను, పరిపూర్ణతరంబులు అగున=మిక్కిలి నిండియున్న, పాత్రములు=బిచ్చపు గిన్నెలు, తల్లికిన్=తమతల్లికి, కరము=మిక్కిలి భక్తితోన్, వినయమునన్, నివేదింతురు=తెలుపుదురు.

6. కడమ=మిగిలిన (ధర్మరాజు మొదలైన) కుడుచుచున్=తినుచు, ప్రచ్ఛన్నులై=ఇతరులకుఁ దెలియకుండ మాటుపడియున్నవారై, యములు=కవలలగు నకుల

---

పద్యము 5 వ్యా. వి:—(i) ఆ+ఏవురు-(యడాగమసంధి)-సంధిలేనిచోట స్వరంబు కంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. ఆ+యేవురు (త్రికసంధి-చూ. 1పద్యము వ్యా. వి.) ఆ+య్యేవురు-ఆయ్యేవురు. (ii) నివేదించుదురు-చువర్ణఁబుతోడి దుగ్ధకారంబు తకారంబగు. నివేదింతురు.

6. (i) భాగంబులు+చేసి-(గసడదవాదేశసంధి) భాగంబులు సేసి, (ii) ఉండు+అంత=ఉండంత తద్ధర్మార్థక విశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమంబగు ఉండునంత. (ii) తాము+విడిచిన కర్తృపద ప్రథమకుఁ గొన్ని యెడల షష్ఠి చూపట్టెడి. తమ విడిచిన.

సహా చేపులు. తమవిడిచిన=తాము కాపురమున్న, విప్రగృహంబున=బ్రాహ్మణుని యింట, ఒక్కపెట్ట=ఒకేమారుగ, ఆర్తధ్వని=ఏడుపు శబ్దము. ఎగసినన్=వ్యాపింపఁగా, ఎంతయు, సంతాపించి=మిక్కిలి దుఃఖించి.

7. ఇందున్=ఈ యింటియందు, ఒరులెఱుఁగకుండఁగన్=ఇతరులు తెలిసికొనకుండ, సుఖము+ఉండితిమి=సుఖముతో నుంటిమి. ఏలొకో = ఎందుచేతనో, ఇప్పుడు, ఈ విప్రునింటన్=ఈ బ్రాహ్మణుని యింటిలో, ఆర్తరవము=ఏడుపు శబ్దము, ఏతెంచెన్=వచ్చెను, దీనిన్+అరసి=ఈ యేడుపునకుఁ గారణము నడిగి, ఎఱుంగవలయును తత్+ప్రతికారంబు, చేయన్+వలయున్=దానికి ఎదురుపని చేసి నివారింపవలెను.

8. పరమ+ఉపకారి (గుణసంధి)=మిక్కిలి యుపకారము చేయు బుద్ధిగలవాఁడు, ఎద్ది+ఏనియున్=ఏదియో, దుస్తరంబు=దాటశక్యము కానిది. మనములు, మఱిఁగెడున్=మిక్కిలి బాధనొందుచున్నది. నినిన్+తలఁగి=ఈ బాధను తప్పించి మనః+ప్రియంబు=మనస్సునకు సంతోషమును.

9. కృతము+ఎఱుఁగుట=ఒకరు చేసిన మేలు నెఱిఁగియుండి కృతజ్ఞతతో నుండుట, పుణ్యము, సత్+మతిన్(అనునాసికసంధి)=మంచి బుద్ధితో, దానికి, సమము+చేఁత=సమానమైన పని చేయుట, మధ్యమము, మఱి=ఇంక, తత్+కృతమునకున్=ఇతరులు చేసిన ఆపనికి, అగ్గలముగన్=అధికముగా, సత్+కృతి+చేయుట=మంచిపని=చేయుట, కృతబుద్ధులకున్=మంచిబుద్ధిగలవారికి, ఉత్తమంబు=మిక్కిలి మంచిది.

11 భగవన్+ఏల=విచారించుచుంటివి. ఎంత కడిఁది=ఎంతటి కష్టమునది, వినను. ఇది=ఈకష్టమును, ఏను+నేను, తీర్చి=తొలఁగించి, విప్రుననున్=బ్రాహ్మణుని, ప్రియంబు=సంతోషమును, విస్తరింతున్=ఎక్కువగా చేయుదును.

12. దుఃఖపరవశులు=దుఃఖమునకు లోబడినవారు, పరిదేవనంబు=ఏడ్పు; మిన్నక+ఉన్నంతన్=అడుగలేక (కుంతి) ఊఱకొని యుండఁగా.

---

7. విప్రు+ఇంట-షష్ఠీసమాసమునందు ఉకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు. విప్రునింట.

9. (i) సత్+మతి-(అనునాసికసంధి)-పరుషములకు అనునాసికములు పరమగునపుడు సవర్ణానునాసికములు వికల్పముగా వచ్చును. సన్మతి. (ii) సమము+చేఁత-(గసడదవాదేశసంధి)-సమముసేఁత.

13. సంసారము, సలసారము=గడ్డియొక్క సారమువంటి సారము మాత్రము గలది (అనఁగా సారములేనిది-వట్టిది. సలమనఁగా, మొదలునందు కొద్దిగా పరిమళించు నొక విధమైన గడ్డి. దానిలోనుండి నిజమైన సారము పిండుటకు వీలులేదు. ఇంచుక మాత్రము పరిమళమున్నట్లగపడును), అఖిల, దుఃఖ+ఆవహము=సమస్తదుఃఖములను గలిగించునది, భయనికేతనము=భయమునకిల్లువంటిది, అతి చంచలము=మిక్కిలి నిలుకడ లేనిది, పర+అధీనము=ఇతరులకు లోఁబడియుండదగినది, ఇందులజీవనము=ఈ సంసారమందలి బ్రదుకు, తత్త్వజ్ఞుల్=నిజము తెలిసినవారు, (నిజజ్ఞాన మెఱిఁగినవారు) ఏల నమ్మెదురు, (నమ్మరని భావము).

14. దేహియగువానికి=శరీరము కలిగియున్న వానికి, ఎట్టియోగికిన్, ఐనన్=ఎంతటి ఇంద్రియ నిగ్రహముగల మునికైనను, సంయోగ+వియోగ=కూడుట విడిపోవుట, ఆది+ద్వంద్వములు=మొదలైన జంటపనులు, (శీతోష్ణములు, సుఖదుఃఖములు మొ॥) పూర్వ+ఉదయ, కర్మమునన్=పూర్వపు పుట్టుకయందలి (తొలిజన్మమందలి) కర్మము చేతను, సంపాదిల్లక తక్కవు=రాక మానవు.

15. ఏనును=నేనును, ప్రజయును=సంతానమును, ఈ ధర్మసతియున్=విధి ప్రకారము పెండ్లాడిన ఈభార్యయు, ఏ+ఉపాయంబునన్=ఏయుపాయము చేత, ఈ+బారిన్+కడవన్+కాన్+నేర్తుము=ఈ యాపదను తప్పించుకొనఁగలము? ఏ+అదికర్జము=చేయవలసిన పనియేమి? ఇందున్+ఉండన్+కాదు=ఇచ్చటనుండరాదు, ఏగుదము+ఒండుకడకున్=మఱియొకచోటికిఁబోవుదము, అని. ముందర, ఏను=నేను, ఎంత+చెప్పినన్=ఎంతగాఁజెప్పినప్పటికి ఎన్నండున్, ఇది=ఈ స్త్రీ, వినద=విననే లేదు ఇట్టి దారుణము=భయంకరమగు నిట్టియాపద, ఈ+మెయిన్ = ఈవిధముగా, చేయగాన్+ఉన్న, దైవము=చేయుదలచియున్న దైవము, ఏల, కడవంగ నిచ్చున్=ఎట్లు తప్పించుకొని పోనిచ్చును? కర్మవిపాకంబు=కర్మయొక్క ఫలము, కడవంగన్=మీఱుటకు, లావె=శక్యమగునా?

తరువోజ:— ప్రతిపాదమునకును మూఁడింద్రగణములును, ఒక్కసూర్యగణమును, మరలమూఁడింద్రగణములు నొక్కసూర్యగణమును నుండును. ప్రతి పాదమునను మూఁడు, అయిదు, ఏడవ గణము మొదటి యక్షరమున యతి. నాలుగు పాదము లందును ప్రాసముండును.

---

15. (i) ఈ+బారి, ఈ+మెయి - (త్రికసంధి)-త్రికంబుమీది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఈ+బ్బారి, ఈ+మ్మెయి, ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ఇబ్బారి. ఇమ్మెయి (ii) నేర్చుదుము - చువర్ణంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు, నేర్తుము.

16. మంత్ర, యుక్తంబుగాన్=(వివాహ సంస్కారమునకు సంబంధించిన) వేదమంత్రములతోఁ గూడియుండునట్లుగా, మత్+పరిణీతయై=నాచేఁ బెండ్లియాడఁబడినదై, ధర్మచారిణి, అగుదానిన్=కూడ ధర్మములాచరించునదియు, వినయవతిన్=వినయము గలదియు, ప్రజావతిన్=సంతానము కలదియు, అనువ్రతన్=(భర్తను) అనుసరించి వర్తించు నియమము గలదియునగు, భార్యను, ఎట్లు? అసురకు=రాక్షసునకు, భక్ష్యంబవు=ఆహారమవు, అగుము, అని, పనుపఁజేసెదన్=పంపగలను? ధర్మ+అభివృద్ధిగాన్=కర్మలు చేయుట మొదలగు ధర్మములు వృద్ధిపొందునట్లు, తగువయసునకున్=తగినట్టి పెండ్లికుమారునకు, ఈన్=ఇచ్చుటకొఱకు, బ్రహ్మచేన్, ఇల్లడ+ఇడఁగన్+పడిన=నాదగ్గఱ దాపరికముగా నుంచఁబడిన, ఈ+కన్య+అతిబాల=ఈకన్య మిక్కిలి చిన్నది, అమాయకురాలు, ఇందున్=ఈమెయందు, ఉద్భవంబగు=కలిగెడు దౌహిత్రలాభము=మనుమఁడు పుట్టులాభము, తలఁగన్+ఎట్లు+దీనిన్+పుత్తున్=పోవునట్లు ఈపుత్రిక నెట్లు పంపివేయఁగలను? మఱి=ఇంక, మదీయ, పిండ+ఉదకనిధిన్=చనిపోయిన తర్వాత నాకు పిండోదకము లిచ్చువానిని, కులము విస్తరించువానిన్=కులము తరించునట్లు చేయువానిని, పితృగణంబులని ఋణమును=పితృదేవతలకుఁ దీర్చవలసిన ఋణము, సాధు-తీర్చునట్టి, నియతవానిన్=చిన్నపిల్లవానిని, (పుత్త్రుఁడు పుట్టి, తల్లిదండ్రుల యొక్క పితృఋణమును దీర్చును. అట్టి ఉపకారము చేసిన చిఱుతవానిని) తనూజున్=పుత్త్రుని, నీచగతిని-పాపమార్గమున.

17. ఎట్లు=ఏవిధమున; చూచుచుండి, ఇది-ఇట్లు చేయుట, పాపము+అని+ఎఱక=పాపమని తలఁపక; అనయవృత్తిన్=దయలేని వ్యాపారముతో ఆ+అసురవాతన్=ఆ రాక్షసుని నోటియందు, త్రోతున్=త్రోయగలను? ఇప్పుడు, ఏన=నేనే, అరిగి=వెళ్ళి, అసురకున్=రాక్షసునకు, ఆహారము=భోజనము, అగుదును. వీరిన్=ఈభార్యాదులను, పుచ్చన్=(రాక్షసున కాహారముగా) పంపుటకు, నాకు, తగునె=తగియుండునా? (తగదని భావము).

18. ఆత్మపరిత్యాగంబునందు=తన ప్రాణముల నిచ్చివేయు విషయమున కృతనిశ్చయుండై=చేయఁబడిన నిశ్చయము గలవాఁడై.

19. మనుజులకున్=మనుష్యులకు, ఏ+విధంబునన్=ఏవిధముచేతను, అనతిక్రమణీయమైన=దాఁటరానిదగు, ఆపత్+విషయంబునన్=విపత్తుసందర్భమున, సంతా

---

16. (i) ఈ+కన్య (త్రికసంధి) ఇక్కన్య. (ii) పుచ్చుదును-పుత్తును.

17. (i) ఆ+అసుర (యడాగమ-త్రికసంధులు) అయ్యసుర. (ii) త్రోచుదును-చవర్ణంబుతోడి ధుగ్ధకారబు తకారంబగు, త్రోతును.

19. ఏ+విధము (త్రికసంధి) - ఎవ్విధము.

పింపంగా=బాధపడుట, చనదు=తగదు, అని, ఎఱింగియున్=తెలిసియు, సంతాపింపన్=దుఃఖించుట, తగునె (తగదని భావము)

20. ఆరక్కసునకు=ఆ బకాసురునకు, ఏన్=నేను, అశనంబు=ఆహారము, వగవకుండుఁడు=విచారింపకుఁడు, పడయంబడు+అపత్యంబు=పొందవలసిన సంతానమును, ఋణ, విముక్తను=ఋణమునుండి తొలఁగిన దానను, ప్రాణ, వియోగంబు=ప్రాణములు విడుట, హితంబు=మేలు.

21. పురుషుకంటెన్=మగవాని (భర్త) కంటెను, మున్న, పరలోకము+ఏగిన=మృతినందినట్టి, సతియు=స్త్రీయే, సకులలోనన్=పతివ్రతలలో, నోఁచినదియు=పుణ్యమునకు నోఁచుకొన్నదగును, పరమ పతివ్రత యున్యూన్=గొప్పపతివ్రతయైనను, పురుష, హీన, అయినన్=భర్త లేనిదగుచో. జగము చేతన్=లోకము చేత, ప్రవర్ష్యఁబడదె=నిందింపఁబడదా?

22. ఆమిషము=మాంసము, పురుషహీన=భర్త లేనిది, యువతిన్=పడుచుదానిని, అపేక్షింతురు=కోరుదురు.

తా॥ భర్తలేని స్త్రీ నేలను బడిన మా[illegible] బుద్ధిహీనులు, పడినమాంసమును పక్షులపేక్షించునట్లు, భర్తచనిపోయిన స్త్రీ నపేక్షింతురు. ఉపమాలంకారము. ఒక వాక్యభాగమున కింకొక వాక్యభాగము ఉపమింపఁబడినది.

23. సతి=భార్య, విముక్త+అయినన్=ప్రాణములు విడిచినదగుచో, పతికిన్=భర్తకు, పునః+దార, సంగ్రహంబు+చేఁత=మఱల భార్యను గ్రహించుట, శాస్త్రమతము=శాస్త్రములకు సమ్మతమైనది (ధర్మమైనదనుట), పతి, విముక్త+అయిన, సతికి=భర్తచే విడువఁబడిన స్త్రీకి, అన్యపురుష, సంగ్రహము+చేఁత=మఱియొక పురుషుని (భర్తగా) గ్రహించుట, లోక, గర్హితము=లోకులచే నిందింపఁదగినదగును.

24. భవత్+విహీనను=నీతో లేనిదానను, జీవింప నేరన్=బ్రతుకఁజాలను, నేర్చితి నేనియున్=బ్రతుకఁజాలినను, వేదశ్రుతిన్+ప్రార్థించునట్లు=వేదములవినవలెనని కోరునట్లు, కుల+ఆచార, సద్వృత్తులు=తమకులమునొక్క మర్యాదలకు సమానమైన వారు, తత్+ప్రతీకారంబు=దానికిబదులు చర్య, గుణ+ఆధారంబు+చేయను=మంచిగుణము అలవడఁ జేయుటకును, కొలంది=తరము(శక్యము), మత్+పరోక్షంబునన్=నావెనుక, పునః+దార, పరిగ్రహంబు=మఱల భార్యను గ్రహించుట, మరణవ్యవసాయంబునన్=చచ్చిపోవుటకుఁ దగుపూనికతో.

25. ఒలసి=కలసి, మీదానన్+కాన=మీదానను కానే కాఁజాలను.

---

24. ఈ+కుమారులు (త్రిక సంధి)-ఇక్కుమారులు.

33. శకటంబుఁ = బండెఁడు, అపరిమిత = మితిలేని (అధికమైన) భక్ష్య = తినుబండములును, పిశిత, మిశ్ర+అన్నంబు = మాంసముతోఁ గూడిన అన్నము.

34. మనుజభక్షకుఁడు = మనుష్యులను దినువాఁడగు నారాక్షసుఁడు, ఇదియు తనపన్, అప్పనము గాఁగ = ఒకమనుష్యుఁడు, రెండెనుపోతులు, బండెఁడు మాంసాద్యాహారములుఁ దన కర్పణముగా, ఒరులవలని భయము+పొరయకుండన్ = ఇతరులవలన భయము కలుగకుండునట్లుగా దీనిన్ = ఈపట్టణమును, కాచుచుండును, ఏనాఁటి రాజును = ఏ దేశపురాజుకూడ, అసురన్ = ఆ రాక్షసుని, ఓర్వన్, బలిమిలేమిన్ = బలము లేకపోవుటచేత, తలఁపడు = (ఆరాక్షసునిగూర్చి) ఆలోచింపఁడు.



35. పోలఁగన్ = చెప్పినట్లుగా, ధర్మశీలుఁడు+అయి = న్యాయమైన స్వభావము గలవాఁడయి, భూరి, బల+అధికుఁడు+ఐన = గొప్పబలముచే మించినవాఁడగు, ధారుణీపాలకరక్షన్ = రాజుయొక్క రక్షణమును, మనన్ = మెండుగా, పడసి = పొంది, భార్యను, పుత్త్రులన్ = కుమారులను, అర్థయుక్తితో = ధనము కలిగియుండుటతో, ఓలిన్ = వరుసగా, మేలుగా = ఎక్కువగా, పడసి = పొంది, ఊళ్ళను+ఉన్నది, ఉన్కి = గ్రామములో నివసించుటయే నివాసమనిపించుకొనును, కానినాఁడు = అట్లు కానిచో, గృహస్థవృత్తి సుఖము = గృహస్థధర్మమువలని సుఖము, ఏల ? ఏఁగి = వెళ్ళి, వనంబునఁగ = అడవిలో, ఉన్కి = నివసించుట, కష్టమే ?

తా. ధర్మాత్ముఁడై, గొప్ప బలశాలియగు రాజుయొక్క రక్షణమును మెండుగాఁ బొంది, భార్యతోను, పుత్త్రులతోను, ధనముతోను, క్రమముగ గ్రామములందుండవచ్చును. అట్లు కానిచో గృహస్థవృత్తి వలన సుఖమేమియున్నది. అట్టియెడల అడవులలో నుండుట యేమికష్టము ?

36. అరి+అని = పన్ను అను పేరుపెట్టి, క్ష్మాధర+ఈశులు = రాజులు, పోఁకయున్ = పోఁకచెక్కయు.

తా. పన్ను అని పేరుపెట్టి, రాజులెవ్వరును బ్రాహ్మణులనుండి ఒకపోఁకచెక్కయైనను పన్ను గ్రహింపలేదు. ఈ దుర్మార్గుఁడు బ్రాహ్మణులచేతఁగూడ తినుటకు మనుష్యులను పన్నుగా గ్రహించుచున్నాఁడు.

37. ఈ+చిఱుతవానిన్ = ఈ చిన్నబాలుని, భక్ష్యంబుగాన్ = ఆహారముగా, పుచ్చఁగ+ఓపన్ = పంపఁజాలను, సంతాపింపవలదు = బాధపడనక్కరలేదు, తలఁగునట్టి = పోవునట్టి, ఏను+కంటిన్ = నే నాలోచించితిని, బలి, కానిపోవఁగ = కప్పము

---

33. ఆ+ఎనుపోతు (యడాగమ-త్రికసంధులు) అయ్యెనుపోతు.

34. భయము+పొరయకుండ (గసడదవాదేశసంధి, భయమువొరయకుండ)

37. (1) ఈ+చిఱుత (త్రికసంధి) ఇచ్చిఱుత. (2) తలఁగు+అట్టి-ఉదంత తద్ధర్మార్థక విశేషణంబున కచ్చు పరమగునప్పుడు నుగాగమంబగు తలఁగునట్టి.

తీసికొని వెళ్లుటకు, అర్హుండు=తగినవాఁడు, ఏవురు=ఐదుగురు, భవదర్థంబుగాన్=నీనిమిత్తము, వినన్+ఓడి=వినుటకు జంకి.

38. అతిథి+ఐ=అభ్యాగతుఁడై (భోజనాదిప్రయోజన మాశించినవాఁడై) జీవితార్థినై=బ్రతుకును గోరుచున్నవాఁడనై, హితము గాన్=మేలు కలుగునట్లుగా, రక్కసువాతన్=రాక్షసుని నోటిలో, ఒడంబడుదున్=అంగీకరింతును, మతిన్=మనస్సునందును, అతిపాతకము=మిక్కిలి పాపపుఁబని.

తా. నాజీవితమునం దాశగలవాఁడనై అతిథిగావచ్చిన బ్రాహ్మణుని రక్కసునినోట ఎట్లు త్రోయఁగలను. బ్రాహ్మణుని మనస్సునందైనను అవమానింపరాదు అట్టియెడ బ్రాహ్మణుని మరణము తలపెట్టుట మహాపాతకము. పాపములలో బ్రహ్మహత్య పెద్దది.

ఛందస్సు: మధ్యాక్కర:—రెండింద్రగణము లొక సూర్యగణము రెండింద్రగణము లొక సూర్యగణము చొప్పున వరుసగా 6 గణము లొక్కొక్క పాదమున నుండును. 4వ గణముయొక్క మొదటియక్షరము యతిస్థానము. ప్రాస నియమము గలదు.

39. ధృతిచెడి=ధైర్యముపోయి, అభ్యాగతుని=భోజనముకొఱకు వచ్చినవానిని, శరణ+ఆగతున్=రక్షణముకోరివచ్చినవానిని, ఒడఁబడు=సమ్మతించు, దుర్మతికిన్=పాడుబుద్ధి గలవానికి, ఇహముల్=ఈలోకమున సుఖము, పరమున్=పరలోకమున సుఖమును, మదిన్=మనస్సులో, పరికింపన్=ఆలోచింపఁగా.

40. ఆత్మఘాతంబు = తన్నుఁజంపుకొనుట, ఒడంబడ నేర్చితివి+అంటేని=ఒప్పుకొనఁగలిగితివని యడిగినచో, ఒరులచేతన్=ఇతరులచేత, అనతిక్రమణీయము=మీరశక్యముగానిది.

41. ఏనును=నేనుగూడ, దీనిన=ఈబ్రాహ్మణ హింసను, తలఁచి, మహీనుత=లోకమునఁ బొగడఁదగినవాఁడా! విప్రవధ = బ్రాహ్మణునిచావు ఎదన్=హృదయమున, సహింపక=ఓర్వక, మతి=ఇంక, నాసూనున్=నాకుమారుని' సమర్పించితిన్=ఒసఁగితిని, మత్ +సూనున్=నాకుమారుని, వధింపగన్=చంపుటకు, రక్కసునకున్=రాక్షసునకు, శకంబె=శక్యమా ?

42. ఖలున్+అసురన్=దుర్మార్గుఁడగు రాక్షసుని, ఓర్వక్+ఓపెడు, బలయుతున్+కాన్=ఓడింపజాలునట్టి బలము గలవానిగా, ఎఱిఁగి=తెలిసి, కొడు

---

40. (1) నేర్చితి+ఇవి, అంటి+ఇవి-భూత-తద్ధర్మక్రియల మధ్యమపురుష వకారమునకు లోపంబు విభాషనగు. నేర్చితి, అంటి. (2) నేర్చితి+అంటి+ఏని-మధ్యమపురుష క్రియలం దికారమునకు సంధి నిత్యము. నేర్చితంటేని.

కవ్=సాధుపురుషుని, ఎవని బెదక్+కాక=పంపుచున్నను గాని, పుత్త్రులకి=సుఖముగా శతపుత్త్రులు=నూఱుగురు కుమారులు, గల, ధన్యులకైనను = పుణ్యాత్ములకైనను, అనిష్టుఁడు+అగు, తనూజుఁడు=ఇష్టముకాని కుమారుఁడు, కలఁడే=ఉండునా ?

43. పెక్కండ్రు+అసురలు=చాలమంది రాక్షసులు, నిహతులు=చంపబడిన వారు, మహాబలపరాక్రముఁడు=గొప్పబలమును పౌరుషమును గలవాఁడు, మంత్రసిద్ధుండు=మంత్రముయొక్క సిద్ధిపొందినవాఁడు, (మంత్రజపమును పూర్తిగాఁజేసి దాని ప్రభావమునఁ దాఁ దలఁచినపనిని జేయఁగల సామర్థ్యమును బొందినవాఁడు), తలఁగి=తొలఁగించి, వల్లె, అని=అట్లే చేయుదుమనని సమ్మతించి, బంధువర్గంబుతో=చుట్టముల సమూహముతో, పరమ, హర్ష పూర్ణ, హృదయుండై=మిక్కిలి సంతోషముతో నిండిమనస్సుగలవాఁడై, పవన, తనయు+ఆకారంబు=భీముని రూపమును, ఉపలక్షించి=చూచి, విస్మితులు=ఆశ్చర్యము నందినవారు. ధర్మతనయుఁడు=ధర్మరాజు.

44. నరనుతకీర్తి=మనుష్యులచేఁ గొనియాడఁబడిన కీర్తిగలవాఁడగు, ఈ+అనిల,నందనుఁడు=వాయుపుత్త్రుఁడగు ఈభీముఁడు,ఎవ్వరితోడన్+ఏని=ఎవ్వరితోనైన భీకరసమరంబు+చేయున్=భయంకరమైన యుద్ధము చేయుటకు, సమకట్టిన యట్లు=పూనుకొనియున్నట్లు, మహా+అనురాగ నిర్భరమున=గొప్పదైన కూరిమియొక్క నిండుతో, ఉన్నవాఁడు, ఇతనిభావము+చూడఁగన్=ఇప్పటి యీతనితీరుపరిశీలింప వేఱు=మఱొకవిధముగా ఉన్నది, సుస్థిరబలున్=గట్టిబలముగల, వీనిన్=ఈభీముని మీరుపంచితిరో=మీరే యేర్పఱచినారో, లేక చెచ్చెరన్=సంభ్రమముతో, తాన+ఉపక్రమించెనో=తనంత తానే పూనుకొనెనో ?

45. తమవిడిచిన, ఇంటిబ్రాహ్మణునకు=తాము వసచేసియున్న యింటి యజమానియగు బ్రాహ్మణునకు, పవనతనయున్=భీముని, బ్రాహ్మణ+అర్థంబుగాన్=బ్రాహ్మణుని పనికొఱకు, తన, సమర్పించుటయుఁ=తా నొప్పగించుటయును, ఒరుల=ఇతరులయొక్క.

---

43. బ్రాహ్మణ+ఆపద-షష్ఠీ సమాసమునందు ఉకార ఋకారముల కచ్చు పరమగు నపుడు నుగాగమంబగును. బ్రాహ్మణు నాపద.

44. (1) ఈ+అనిలనందనుఁడు (యడాగమ-త్రికసంధులు) ఇయ్యనిలనందనుఁడు (2) సమరంబు+చేయు, భావము=చూడఁగ,(గసడదవా దేశసంధి)సమరంబు చేయ భావము గూడఁగ, (3) చెర+చెర-అందఱుక ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు, చెచ్చెర.

46. ఇతని నిర్వాసము = ఈభీముని పరాక్రమము, ఆశ్రయించి యుండగాని = ఆధారముగాఁ గొనియే కదా, ఆ+ఎడన్ = వారణావతపురమునందు, నిద్రావివశ+ఆత్ములము = నిద్రచే వశముతప్పిన మనస్సుకలవారము, ఎడగలన్+కొనిపోయి = దూరముగా తీసికొనిపోయి, ఎక్కటి+చంపిన = ఒక్కఁడే చంపిన, దండితశత్రుఁడు = శత్రువులను శిక్షించినవాఁడు, ఈభీముఁడేకదా, ఇతనిబల్మిన+కాదె = ఈభీముని బలము కారణముచేత నేకదా, ఎంతయు భీతులై = మిక్కిలి భయమునందినవారై, ధృతరాష్ట్ర నందనుల్ = ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులు, ధృతియుడిఁగి = ధైర్యము తూలిపోయి, ఒండుతక్కి = ఒకటిగాలేక, బలియుఁడున్ = బలవంతుఁడైన, ఇట్టిభీమున్, బ్రాహ్మణ+అర్థంబుగాన్ = బ్రాహ్మణుని పనినిమిత్తము, అసురవాతన్ = రాక్షసుని నోటిలో, త్రోతురవ్వ = త్రోచుదురటమ్మా ?

47. దుఃఖ+అతిశయంబునన్ = ఎక్కువ దుఃఖముచే, మతి, భ్రమము = బుద్ధి పొరపాటు.

48. భ్రమ = తప్పుడుభావము. విమోహ = అజ్ఞానము. లోభ = తనలాభమును కోరినబుద్ధి, భయ = భయము నొందువానిచే, పరిభూతనై = కొట్టివేయఁబడినదాననై (బుద్ధిచెడినదాననై) కొడుకు, విడువన్ = కొడుకును విడిచిపెట్టుటకు, అంత వెడఁగ నయ్యె = అంత వెఱ్ఱిదాననటయ్యా ? ఏను = నేను, భీమునిశక్తిన్ = భీముని బలమును, ఎఱుఁగక = తెలియక, పంచినదానన్+కాను = నియమించిన దానను గాను.

49. పదియగునాఁడు = పదవరోజున. పెలుచన్+పడియెన్ = ఎక్కువగ (గట్టిగా) పడిపోయెను. ఆ+పర్వతంబునన్ = (పాండవులు పుట్టిన) శతశృంగపర్వతమందు, వడిన్+చేసి = వేగము చేత, బాలకు+ఒడలు = బాలకునియొక్క శరీరము, తాఁకి = తగిలి, అత్తఱిన్ = ఆవెంటనే, రాలెల్ల నుగ్గయ్యెన్ = రాళ్ళన్నియు పిండియయ్యెను; చూచె = సుమా.

---

46. (1) ఆ+ఎడ (యడాగమము). సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమ మగును. ఆ+వొడ (త్రికసంధి) త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబు గానగు. ఏ+య్యెడ—ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ఎయ్యెడ. (2) ఎక్కటి+చంపిన (గసడదవాదేశసంధి) ఎక్కటిసంపిన, (3) నిలుచు+ఉపాయంబు—ఈడంత తద్ధర్మార్థ విశేషణంబున కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు. నిలుచు నుపాయంబు. (4) త్రోచుదురు—చువర్ణకంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు. త్రోతుర.

50. వజ్రకాయుఁడు=వజ్రమువంటి గట్టిశరీరము గలవాఁడు, వజ్రధరున్+అయినన్=ఇంద్రుఁడైనను, ఓర్వన్+ఓపునట్టి సత్త్వంబు=ఓడింపఁ జాలునట్టి బలము గలవాఁడు, అరక్కసున్=ఆబాణాసురుని, ఆక్రమించినన్=తేలికగా, ఉడుపుదు=పోఁగొట్టును, పవనతనయున్+ఉద్దేశించి=వాయుపుత్త్రుఁడగు భీమునిఁగూర్చి, సంతాపింపవలదు=విచారింపవద్దు, సుఖనివాసంబు+చేసి=సుఖముగా నుండుట కాశ్రయ మిచ్చి, పరమ+ఉపకారి (గుణసంధి)=గొప్ప మేలు చేసినవాఁడు, ప్రతి+ఉపకారము (యణాదేశసంధి)=బదులుగాఁ జేయు నుపకారంబు, ఊలుకుమా=శాంతింపుము.

51. ఉత్తమక్షత్త్రియుండు=శ్రేష్ఠుఁడగు రాజు, ఒరుల, దుఃఖంబులు=ఇతరులకుఁగల్గు కష్టములను, ఉడుపంగన్=పోఁగొట్టుటకు, అడయక=వెనుదీయక, మృత్యుభయంబు+అయినచో=చావువలని భయము కలిగినప్పుడు; విప్రున్+కాచి=బ్రాహ్మణుని రక్షించి, ధన్యుఁడై=పుణ్యాత్ముఁడై, బుధలోకవంద్యుండగు=పండితుల సమూహముచే పొగడఁబడినవాఁడగు, వసుధాస్థితి=భూప్రజలయందున్న, సర్వ. ప్రజా+అనురంజనము=ప్రజలందఱి ప్రేమను, అనఘ=పుణ్యాత్ముఁడా! సత్+ముని+ఇంద్రుఁడు=మంచి మునిశ్రేష్ఠుఁడు, పాయక=మానకుండ, చేయంగన్+కాన్వ=చేయఁగా చూచుటయే.

తా. శ్రేష్ఠుఁడగు రాజు ఇతరుల కష్టములను దప్పించుటకు పుట్టినవాఁడు. అతఁడు మరణభయము కలుగునప్పుడు వెనుదీయక బ్రాహ్మణుని గాపాడినచోఁ బ్రహ్మలోకమును బొందును. రాజును గాపాడినచోఁ బండితులచేఁ గొనియాడఁబడిన కీర్తి నిబొందును, వైశ్యులను, శూద్రులను గాపాడినచో భూలోకమునఁ బ్రజలందఱి ప్రేమను బొందఁగలుగును. ఇది వేదవ్యాసుని వచనము. కావున బ్రాహ్మణులకుఁ బ్రియము చేయుటయే పుణ్యము.

52 జననుత=జనులచేఁ బొగడఁబడినవాఁడా! చనన్+చేసినన్=సెలవిచ్చి నట్లు చేసినచో, ప్రసాదంబునన్=అనుగ్రహముచేత, అనవరతశ్రీ=ఎడతెగని సంపద.

53. ధర్మతనయుండు=ధర్మరాజు, కారుణ్యబుద్ధికి=దయతో నిండిన బుద్ధికి, ధర్మచిత్త=ధర్మముతోఁ గూడిన మనస్సు, నియోగించెన్=ఆజ్ఞాపించెను.

54. కుడువన్+కానమిన్=తినుటకు లేకపోవుటచేత, కన్ను+పొందమి న్నన్=నిద్రపట్టకపోవుటచే, కరము+డస్సి=మిక్కిలి అలసి, ఓపుదురేని=శక్తిగలవారైనచో.

---

50. ప్రతి+ఉపకారము (యణాదేశసంధి) ఇ-ఉ-ఋ అను అసవర్ణమైన యచ్చు పరమగునపుడు క్రమముగా య్-వ్-ర్-అనున వాదేశమగును. ప్రత్యుపకారము.
54. కన్ను+పొందమిన్న, తృప్తి+చేయుఁడు (గసడదవాదేశసంధి) కన్నుఁబొందమిన్న తృప్తి సేయుఁడు.

55. పెచ్చుకలిగి=ఎక్కువగాఁబొంది, పాపిష్ఠున్=మిక్కిలి పాపముగలవాఁడగు, హర్షము=సంతోషముగా, అనవుడున్=అనిపలుకఁగా, విప్రుఁడు=బ్రాహ్మణుడు

56. పలుతెఱఁగుల=అనేకవిధములగు, గుడంబు=బెల్లము, దధిప్రపూర్ణ=పెరుగుతో నిండిన, ఘటంబులు=కుండలు, కొనివచ్చి=తీసికొనివచ్చి. ఈన్=ఈయఁగా, అలఘుసత్త్వుఁడు=గొప్ప బలముగలవాఁడగు, మారుతాత్మజుఁడు=భీముఁడు. అన్నిటన్=ఆపదార్థములన్నిటిచే, గతఖేదుఁడై=విచారముపోయినవాఁడై. అప్పుడు=పిమ్మట, బ్రాహ్మణ+అర్థము+చేయఁగాన్=బ్రాహ్మణునిపని చేయుటకు, కడంగెన్=పూనెను.

ఛందస్సు: తరలము — తరలపాదమున న-భ-ర-స-జ-జ-గ అను గణములు వరుసగా నుండవలెను. 12వ అక్షరము యతిస్థానముగును. ప్రాసనియమము గలదు.

57. ఇష్ట+అన్న+ఉపభోగంబునన్=ఇష్టమైన భోజనపదార్థముల ననుభవించుటచేత, తృప్తుఁడై=తనివిపొందినవాఁడై, భక్ష్య+అన్న+పూర్ణంబు=పిండివంటలు మొదలగు భోజనపదార్థములతో నిండినది, శకటంబు=బండి, దక్షిణా+అభిముఖుండు=దక్షిణదిక్కున కెదురుముఖముగలవాఁడై, ఆర్ద్ర=తడిసినట్టియు, శుష్క=ఎండినట్టియు, కళేబర=శవములయొక్క, దుర్గంధవిగళితంబు=దుర్వాసనచే చెడినది, బకస్థానంబు=బకాసురుఁ డున్నచోటు, డాయక=సమీపింపక, ఎడగలిగిన=దూరముగానుండి, వానివచ్చునంతకున్=వాఁడు వచ్చువఱకును. మున్నకి+ఉండన్+ఏల, అని=ఊరక నేయుండు టెందులకని, ఆచమించి=జలమును లోపలికి మూఁడుమార్లు పుచ్చుకొని, కుడుచుచుండె=తినుచుండెను.

58. ప్రొద్దు=వేళ. పెద్ద+పోయి=చాలసేపయినది. నిత్యము = ప్రతిదినము, ఇటన్, ఇచ్చటికి, బలికూడున్=కప్పమును, తెచ్చి+ఈఁగన్+ఒల్లక=తెచ్చి ఇచ్చుట కొప్పుకొనక, ఎలుఁగులిచ్చుచున్నవాఁడు = అఱచుచున్నాఁడు, ఆ+మనుజ+అధముండు=ఆ నీచమానవుఁడు, మెచ్చఁడగ్యున్=లక్ష్యపెట్టకున్నాఁడు.

59. అలిగి=కోపించి, ఔడుగఱచి=పెదవిగొఱికి, పెలుచనన్=తీవ్రతచేత, నిలువనోపక=ఆగలేక, అసుర=రాక్షసుఁడు, నింగి=ఆకాశము, భీమరూపంబుతో=భయంకరమైన యాకారముతో, ఉగ్రభంగిన్=భయంకరమైనరీతిగా.

60. ఓడక=భయపడక, దవ్వులన్=దూరమునుండి, నియమించి=నిర్ణయించి కొనవచ్చు=తీసికొనవచ్చునట్టి, కూడు=ఆహారము, ఏల, కుడిచెదు+ఈవు=నీవెందుకు

---

57. (1)వాఁడు+వచ్చునంతకు-కర్తృపద ప్రథమకుఁగొన్ని యెడల షష్ఠి చూపట్టెడి వాని వచ్చునంతకు. (2) వచ్చు+అంతకు-ఉదంత తద్ధర్మార్థక విశేషణంబున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు. వచ్చునంతకు.

60. కుడిచెదు+వు-భూత - తద్ధర్మార్థక క్రియల మధ్యమ పురుషవకారమునకు లోపంబు విభాషనగు. కుడిచెదు.

తినుచున్నావు ? కడున్ + క్రొవ్విరి = మిక్కిలి మత్తెక్కిరి. ఏను = నేను, ఎల్లిదము = లోకువ, డాయవచ్చి = దగ్గఱకువచ్చి, ఆ + అనిలనందనువీపున్ = ఆభీమునియొక్క వీఁపును, అసురవరుడు + చూడక = రాక్షసునివైపు చూడక, ఒండు + పలుకక = ఒకమాట యేని పలుకకుండ, కుడుచుచున్నన్ = తినుచుండఁగా, అలిగి = కోపగించి, వీనిబాగు = వీనివిధము, చూడన్ = ఆలోచింపఁగా, వేఱు = ఇంకొకవిధముగా ఉన్నది, డానిన, తరువున్ = దగ్గఱనున్న చెట్టును, తాఁకఁజెంచెన్ = ఎదుర్కొనెను.

61. కుడిచి = తిని, అనంతబలుండు = గొప్పబలముగలవాఁడై, అంతక + ఆకారంబున = యమునిరూపమున, మల్లు + చఱచుకొని = భుజములమీఁద చేతులతో చఱచుకొని.

62. రాక్షస + అధమా = ఓరీ నీచ రాక్షసుఁడా ! నీవు; ఇంచుక + ఎని = కొంచెమైనను, పాపమునకు ఎన్నఁడు = ఎప్పుడును, రోయక = జంకక, ఎల్లవారిన్ = ప్రజ అందఱను, బాధించి = నొప్పించి, మనుష్యమాంసంబులు = నరుల మాంసములను, తించును, క్రొవ్వితి = పొతరించితివి, వానిన్ + ఎల్లన్ = ఆ తిన్న మాంసముల నన్నిటిని క్రక్కించెదను. నీమద + అంధ్యము = నీయొక్క మదముచేఁ గన్నుగానని స్థితిని, ఉడిగించెదన్ = పోఁగొట్టెదను, ఇప్పుడ = ఇప్పుడే, కాలుప్రోలికి = యమునిపట్టణమునకు, ఏగించెదన్ = పంపించెదను, రణంబునన్ = యుద్ధమున, చక్కనై = సరియైన తీరుకలిగి, గిట్టి = ఎదుర్కొని, నిలుము.

63. సమీరణ, సుతుండు = వాయుపుత్త్రుఁడగు భీముఁడు, పాలవృక్షంబు = మద్దిచెట్టును, భగ్నంబు + చేసెన్ = ముక్కలుచేసెను, ఆసన్నమహీరుహంబులు = దగ్గఱనున్న చెట్లు, సమయుటయున్ = నాశనమగుటయు, మల్లయుద్ధసన్నద్ధులై = మల్లయుద్ధము చేయుటకు (కుస్తీపట్లు పట్టుటకు) సిద్ధపడినవారై.

64. పరువడిన్ = మిక్కిలి త్రీవతతో, ఒండు + ఒరున్ = ఒకరొకరిని, పెనఁగి = చేతులతోఁ జుట్టఁబెట్టుకొని, పట్టుచు, ఈడ్చుచు, తన్నుచును, పరస్పర, జయ, కాంక్షులైన = ఒకరినొకరుజయింపవలెననెడుకోరికగలవారైన, బక, పాండవవీరుల = వీరులైన బకాసురునియొక్కయు భీమునియొక్కయు, పాదఘట్టనన్ = కాలిదెబ్బల యొత్తిడిచే, ధరణీతలంబు = భూమి, క్రక్కదలెన్ = మిక్కిలియదరిపోయెను, తత్ + నికట (అనునాసికసంధి). ద్రుమవల్లులు = ఆసమీపమందున్న చెట్లును, తీఁగెలును, ఎల్లన్ = అన్నియు, జర్జరితములు + అయ్యెన్ = తూట్లుపడిపోయెను, ఆ + ఎడదన్ = ఆసం

---

62. క్రొవ్వితి + వి (చూ. 60 వ్యా॥ వి.) క్రొవ్వితి.

63. వృక్షంబు + పెఱికి, భగ్నంబు + చేసె (గసడదవాదేశసంధి) వృక్షంబు వెఱికి, భగ్నంబు సేసె.

64, (1)కదలు+కదలు-అందగుక ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు. గ్రక్కదలు. (2) ఆ=ఎడ (యడాగమ-త్రికసంధులు) అయ్యెడ. ర్భమున, నిష్ఠుర, విశాల, శిలల్=కఠినములును విశాలములునైన రాలు, పొడుము+అయ్యెన్=పొడియయ్యెను.

65. ఇద్దఱ, హుంకృతిధ్వనులన్=భీమ బకాసురులు చేయు 'హుం' అనెడు ధ్వనులును, ఇద్దఱ=ఆ యిద్దఱియొక్క, భూరి=గొప్ప, భుజారవంబున్=భుజములవలని చప్పుడులును, ఆ+ఇద్దఱ ముష్టిఘాత జనిత=ఆయిద్దఱియొక్క పిడికిటి దెబ్బలచేఁ బుట్టి, ఈరిత=పైకిత్రోయఁబడిన, దారుణ, నిస్వనంబున్=తీవ్రమైనధ్వనియును, ఆ+ఇద్దఱ, పాదఘట్టిత=పాదములచే నగఁద్రొక్కఁబడిన, మహీతలమున్=భూమియొక్క ధ్వనియు, విని చూపఱు+ఎల్లరున్=చూచువారందఱును, తద్దయు, భీతిన్=మిక్కిలి భయముతో, అచ్చటికిన్=ఆయుద్ధభూమికి. తారు=వారు, ఎడగలఁగన్=దూరమగునట్లు, ఒక్కఁడై=ఒక్కటిగాఁజేరి, పాఱిరి=పరుగిడిపోయిరి.

66. ఆసురంబునన్=రాక్షసత్వముతో.

67. వృకోదరుఁడు=భీముఁడు, కడఁగి=పూని, అసురన్=బకాసురుని, పడఁగ=నేలఁగూలునట్లు, వడిన్=వేగముగా, వైచి=విసిరి, వామపాదంబునన్=ఎడమకాలితో, చేడ్పడన్=బాధపడునట్లు, వానిఱొమ్ము, తాఁచెన్=తన్నెను. కడుకొని=ఉత్సహించి. అసురయును=రాక్షసుఁడును, లేచి=లేచి, కడున్=మిక్కిలి ఉద్ధతుఁడై=గర్వించినవాఁడై.

68. అనిలసుతున్=భీముని, పట్టుకొని, పెల్చనన్=ఎక్కువగా, త్రోచి, కడంగి=యత్నించి, కనకశైల=మేరు పర్వతముయొక్క, నికుంజంబును బోని=పొదరింటినిపోలిన, వానివక్షమున్=ఆ భీమునిఱొమ్మును, తన, దృఢతర, ముష్టిన్=మిక్కిలి గట్టిదైన తన పిడికిలితో, తద్దయుం, అలుకన్=మిక్కిలి కోపముతో, పొడిచెను.

69. హీనసత్త్వంగాన్=చెడిన బలముగలవానినిగా, సురహస్తి=దేవతల యేనుఁగగు ఐరావతముయొక్క, హస్త+అనుకారంబులైన=తొండములను పోలిన, సవ్య=ఎడమ, దక్షిణ=కుడి, హస్తంబులన్=చేతులతో, ఆ+మనుజకంటకు=ఆ మనుష్యులకు నీచశత్రువైనవానియొక్క, కటి=నడుమును, కంఠపు ప్రదేశంబు=మెడ భాగమును.

70 దారుణజానుదండమున=క్రూరమైన కఱ్ఱవంటి మోకాళ్ళచేత, దండధర ప్రతిముండు=యమునితో సాటియైనవాఁడును, భీకరాకారుఁడున్=భయంకరమైన రూపముగలవాఁడును నగు భీముఁడు, పిశితంబుతోన్=మాంసముతోఁ గూడి, నవ ద్వారములన్=శరీరమందలి తొమ్మిదిరంధ్రములనుండియు, మహా, రుధిర, ధారలు=గొప్పరక్తపుధారలు, బోరనన్=ఒక్కమాఱుగ, ఒల్క=ఒలికి, విపినాంతరంబునన్=

అడవిలో, మాంసపంక+అసృగ్వారి = మాంసమును బురదతోఁ గూడిన, ఎఱ్ఱపునీరు (నెత్తురు), ఘోరనదులై పఱవన్ = భయంకరమైన నదులుగాఁ బ్రవహింపఁగా, వాని వీపు విఱుగన్+పొడిచెన్ = ఆ బకాసురుని వీపు చెక్కలగునట్లు పొడిచెను.

71. నిహతుండు = కొట్టఁబడినవాఁడు, నిగత జీవుండు = పోయిన ప్రాణములుగలవాఁడు, పఱతెంచినన్ = పరుగెత్తుకొని రాఁగా.

72. రక్కసులు = రాక్షసులు, ఈ+దురాత్మ+అట్లు = పాపాత్ముఁడగు ఈ బకాసురునివలె, అడరి = చెలరేఁగి, మనుజ భక్షణము = మనుష్యులను దినుటను,

73. భీతులై = భయము నొందినవారై, భీము చేసిన సమయంబునకు = భీముఁడేర్పరిచిన కట్టుబాటునకు, ఒడంబడి = ఒప్పుకొని. నాఁటంగోలె = అది మొదలుకొని ఉపద్రవము = బాధ, జగత్+విదితంబుగా = లోకమునకు వెల్లడియగునట్లుగా, తత్+కళేబరము = ఆ బకుని మృత దేహమును, సహోదరులకు = తోఁబుట్టువులకు.

74. వీఁడు = ఈ భీముఁడు, ఒక, మంత్ర సిద్ధుఁడు = మంత్ర జపముచేఁ గార్యములను సాధింపఁగల సామర్థ్యసిద్ధి పొందినవాఁడు, అగు, విప్రుఁడు = బ్రాహ్మణుఁడు, నేఁడు = ఈ దినమున, అనిన్ = యుద్ధమునందు, అసాధ్య+బలున్ = సాధింపరాని బలముగలవాఁడగు, బకాసురున్ = చంపెన్+అట్టె = చంపివైచెనుగదా! ఇతనిన్ = (ఇంత గొప్ప వీరుఁడగు) ఈభీముని, చని = వెళ్ళి, చూతము, అంచున్ = అని పలుకుచు, చెచ్చెరన్ = వేగముగా, పోడిగ = ఒప్పిదముగా, ఏకచక్రమున భూసురులు+ఆదిగన్ = ఏకచక్ర పురమందలి బ్రాహ్మణులు మొదలుగా, ఎల్లవారలున్ = ప్రజలందఱును, వచ్చి, ఆ+వాఁడి మిగంటిమిన్+వెలుఁగువానిన్ = తీక్ష్ణమైన పరాక్రమముతో నొప్పుచున్నవాఁడగు, వృకోదరున్ = భీముని, చూచిరి.

---

72. (1) ఈ+దురాత్ముఁడు (త్రికసంధి) ఇద్దురాత్ముఁడు (2) ఇద్దురాత్మ+అట్లు-షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు. ఇద్దురాత్మునట్లు. (3) చచ్చుదురు-చువర్ణంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు. చత్తురు.

73. భీముఁడు చేసిన-కర్తృపద ప్రథమకుఁ గొన్ని యెడల షష్ఠి చూపట్టెడి భీము చేసిన.

74. (1) చూచుదము - చువర్ణంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు. చూతము. (2) చెర+చెర అందురు ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు, చెచ్చెర, (3) ఆ+వాడి(త్రికసంధి)అవ్వాడి.

## ప్రశ్నోత్తరములు.

1. పాండవులు విడిసిన విప్రగృహంబున నగసిన యార్తధ్వనులను సకారణంబుగా వివరింపుఁడు.

లక్కయింటినుండి వెల్వడిన పాండవు లేకచక్రపురంబు చేరి, యందొక్క బ్రాహ్మణునింట బ్రహ్మచారివృత్తిని గడపుచుండిరి. ఆగ్రామమున కామడ దూరపు టడవిలో బకుఁడను రాక్షసుఁ డొకఁడు వసించుచుండెను. ప్రతిదిన మాతఁ డాయూరఁ జొచ్చి క్రమముగా నొక్కొక్క యింటివారిని భక్షించుచుండెను. అచ్చటి బ్రాహ్మణులా బాధ భరింపఁజాలక, దినమున కొక యింటివారొక మనుష్యుని, రెండెనుబోతులను, బండెడు భక్ష్యములను బలిగా వానికొసగునట్లు నిర్ణయము చేసికొనిరి. బకుఁ డందులకు సమ్మతించి, నియమప్రకారము వారు పంపు నాహారము భుజించుచు, నాయగ్రహారమున కితర బాధలు కలుగకుండఁ గాపాడుచుండెను. ఇట్లుండఁ బాండవులు విడిసిన యింటి బ్రాహ్మణున కొకనాఁ డావంతు వచ్చెను. అంత నాయింటివారొక్క పెట్టున నార్తధ్వనులు సేయఁ దొడంగిరి.

తొలుత నాయింటి యజమానియగు బ్రాహ్మణుఁ డాయాపదను దలఁచుకొని బంధువులందఱు విన "సంసారము నిస్సారమైనది; సమస్తదుఃఖములకు, భయములకు నాటపట్టయినది, పరులకధీనమైనది. కావునఁ దత్త్వమెఱిఁగినవారీ సాంసారిక జీవితమును విశ్వసింపరు. మఱియుఁ బూర్వజన్మకర్మముఁబట్టి ప్రాణికి సంయోగవియోగాది ద్వంద్వములు రాక తప్పవు. ఇప్పుడీ రక్కసుబారినుండి నేను నాకుటుంబమును తప్పించుకొను నుపాయము కానరాకున్నది. రక్కసున కాహారముగా సహధర్మచారిణియు, సంతానవతియు, ననుకూలవతియు నగు భార్యను బంపుట ధర్మము కాదు. ఏవటునకో యిచ్చువఱకు బ్రహ్మచేఁ గుదువయుంచఁబడి, నాకు దౌహిత్రలాభంబు గలిగించు నీకన్య నర్పించుటయుఁ దగదు. పితృఋణముఁ దీర్చువాఁడు, కులముద్ధరించువాఁడు నాకుత్తరక్రియలు చేయువాఁడు నగు నీచిన్నకుమారు నసురనోటఁ ద్రోయఁజూచుట ఘోరపాతక మగును. కావున నేనే యసుర కాహారముగాఁ బోయెద" నని పలికి యాత్మత్యాగమునకు నిశ్చయించెను.

ఆట్లాత్మపరిత్యాగమునకు నిశ్చయించిన బ్రాహ్మణుం జూచి బ్రాహ్మణి, "మీర రాని యాపదలు పైఁబడునప్పుడు విచారించుట వివేకుల లక్షణము గాదు, భార్యయందుఁ బొందందగు సంతానమును నాయందు మీరు పొందితిరి. నేనును ఋణవిముక్తినందితిని. ప్రాణములు వీడియైన భార్య భర్తకు మేలు చేయవలయును. అంతియగాక భర్తకంటె ముందు పరలోకమేగు స్త్రీ ధన్యురాలగును. భర్త లేక

జీవించు స్త్రీ లోకులచే నిందింపఁబడుచుండును. మఱియు భార్యపోయిన మఱియొక భార్యను గ్రహించు నర్హత పురుషునకు గలదు గాని స్త్రీ కట్టి యర్హత లేదు. కావున మీరు లేని జీవిత మొక్క నిముషమేని నేను గడపఁజాలను. ఎట్లో యొక వేళ జీవింపగలిగినను నీ కూఁతునకు యోగ్యుడగు వరునకిచ్చి వివాహము చేయుటకుఁ గాని, యిక్కుమారుని గుణవంతునిగా నొనరించుటకుఁ గాని చాలను. కావున నే నా రక్కసున కాహార మయ్యెదను. పిదప మీరు మఱలఁ బెండ్లాడి యిక్కుమారు[illegible] [illegible] గావింపుఁ"డని పలికెను.

ఇట్లు చావున కనిద్ధపడుచున్న తల్లిదండ్రులు గాంచి వారి కూఁతురు "నే నిట్టింతకాలము మీతోఁ గలిసియుండినను నొరుల సొత్తునే గాని, మీ దానను గాఁజాలను. ఎప్పుడో యొకప్పు డొరులకు నన్నర్పింపక తప్పదు. కావున నిప్పుడే యసురు కర్పింపుఁడు. మఱియుఁ దండ్రి చేయు తిలోదక దానములు పరలోకమందున్న పుత్త్రిని జెందును గాని, యామె చేయు దానవిధులు లామె భర్తను దక్కఁ దల్లిదండ్రులను జెందవు. మీ రిరువురు జీవించియుండినఁ బెక్కుమంది పుత్త్రులను పౌత్త్రులను బడయఁగలరు. నావలనఁ గలుగు దౌహిత్రు లాభముకంటె, పుత్త్ర పౌత్త్రలాభము మీకుఁ గడు మేలుకూర్చును. కావున నసుర కాహారముగా నన్ను బంపుఁడు" అని పలికెను. అదివిని తల్లిదండ్రులామెను గౌఁగిలించుకొని యేడ్చుచుండిరి.

అంత నా బ్రాహ్మణుని చిన్నకుమారుఁ డొక కఱ్ఱ చేతఁబట్టుకొని "నే నా రాక్షసు ననాయాసముగాఁ జంపివత్తును. మీ రేడ్వవల"దని తొక్కుఁబలుకు లొప్పఁబల్కెను. ఆమాటలు విని యందఱు నేడ్పు మానియుండిరి.

2. బకునకు బలిగా భీముని బంపు విషయమున గుంతీ బ్రాహ్మణులకును, గుంతీ ధర్మజులకును జరిగిన సంభాషణమును వివరింపుఁడు.

పాండవులు తల్లితోఁగూడ నేకచక్రాగ్రహారమున నొక బ్రాహ్మణు నింట నివసించి బ్రహ్మచారివృత్తిని గాలము గడపుచుండిరి. ఒకనాఁ డాగృహంబునం దొక్కసారిగా నార్తధ్వని యెగసెను. కుంతి యది విని యావిప్రున కేదేని యాపద సంభవించియుండ నోపునని చింతించి, దానికి తగు ప్రతీకారము చేసి పరమోపకారి యైన యాబ్రాహ్మణునకుఁ బ్రియము సేయవలయునని భీమునితో ననెను. భీముఁ డందులకు సమ్మతించి, యావిప్రు నాపదఁ గనుఁగొని రమ్మని తల్లినిఁ బంపెను.

కుంతి బ్రాహ్మణుని యొద్ద కేగి యా యార్తధ్వనికిఁ గారణ మేమని యడిగెను. అతఁ డా గ్రామమున కామడ దూరపు టడవిలో బకుఁడను రాక్షసుఁడు వసించుచుండుననియు, వాఁ డా గ్రామమందలి ప్రజల నిల్వరుస మ్రింగుచుండ, వందలి

బ్రాహ్మణు లాలోచించి దినమున కొక యింటివారొక మనుష్యుని, రెండెనుఁబోతులను బండెడు భక్ష్యములను బలిగా వాని కర్పించునట్లు కట్టడ చేసిరనియు నిర్ణయము ననుసరించి నేఁడా రక్కసున కాహారము పంపు వంతు తమకువచ్చెననియుఁ దనకు గల యొక్క కుమారుని బాలుని జంపఁజాలక తానే రక్కసునకు బలిగాఁ బోవ నెంచితిననియుఁ జెప్పి దుఃఖించుచుండెను. అంతఁ గుంతి యాతని యాపద తొలఁగించుటకై తనకుఁ గల యేవురు పుత్త్రులలో నొక్కని రక్కసుని కడ కంపుదునని పలికి యాతనిని దుఃఖము వీడుమనెను. బ్రాహ్మణుఁ డది వినిజాలక చెవులు మూసికొని, యతిథియై వచ్చిన బ్రాహ్మణుని దననిమిత్తము రక్కసున కర్పించుటకుఁ దా నంగీకరింపఁజాలఁడనియు, బ్రహ్మహత్య మహాపాతకమనియుఁ బలికెను. మఱియు ధైర్యము నశించి వేఁడువానిని, అతిథ్యభ్యాగతులను, బిచ్చగానిని, శరణుగోరి వచ్చిన వానిని జంపినవాని కిహపరము లుండవనియు, నాత్మహత్య యన్నిటికంటె ఘోర పాతకమనియు నితరుల మూలమున నని మీఱి రానిదైనప్పు డాపాప మితరునకుఁ జెందుననియుఁ గావున నాత్మహత్యకుఁ గడంగితినని పలికెను. అప్పుడు కుంతి తాను బ్రాహ్మణవధను సహింపఁజాలక తనకుమారు నసురునకు సమర్పింప సంకల్పించెనని చెప్పి, తనకుమారుఁ డసాధ్య బలుఁడై తొల్లియెందఱో రాక్షసులను వధించెననియు బకాసురునిగూడ నతఁడు వధింపఁగలఁడను నమ్మకముతోడనే తానట్టి నిశ్చయము చేసెననియుఁ బలికి, భీమునిఁ బిలిచి యా బ్రాహ్మణు నాపద తొలఁగించి తనకు మనః ప్రియము నేయుమని కోరెను. భీముఁ డందులకు సమ్మతించెను. అంత నా బ్రాహ్మణుఁడు బంధుకోటితో సంతసమందెను.

బ్రాహ్మణుని నిమిత్తమున బకునితోఁ దనకు యుద్ధము సేయఁగలనని భీముఁడు సంతసించుచుండెను. అంతలో భిక్షాటనమునకరిగిన ధర్మరాజువచ్చి భీముని ముఖవికాసము చూచి యాశ్చర్యపడుచు "వీని తీరు చూడ నెవ్వనితోడనో యుద్ధము చేయఁబూనిన యట్లున్నది. మీ రావనికై వీనిని నియోగించితిరా? లేక తనంతఁ దానే పూనుకొనెనా?" యని తల్లినడిగెను. అంత నామె బకాసురుని వలనఁ దాము విడిచిన యింటి బ్రాహ్మణునకుఁ గలిగిన యాపదయు, దానిని దీర్చుటకై భీమునిఁ దాను నియమించుటయు ధర్మజున కెఱిఁగించెను. ధర్మజుఁ డదివిని దుఃఖించి, యితరుల కొడుకుల నిమిత్తము తమకొడుకులను విడుచు దుర్బుద్ధులు లోకమందుండరనియు, భీముఁడు లక్క యింటి నుండి వెల్వడఁజేసియు, హిడింబాసురునిఁ జంపియు, ద్రోహబుద్ధులగు దుర్యోధనాదులను జీకాకు పఱచుచును, దమ్ముఁ గాపాడు ధీరుఁడనియు, నట్టివానిని బ్రాహ్మణార్థ మసురనోటఁ ద్రోయఁబూనుటకంటెఁ దెలివితక్కువపని యుండదనియుఁ దల్లిని నిందించెను. అంతటఁ గుంతి ధర్మజునితో "భీముఁడు మిగుల బలవంతుఁడు. వీఁడు పుట్టిన పదియవనాఁడు పర్వతముపైఁ బడఁగా వాని శరీరము తాఁకున నచ్చటి రాళ్లు

నుగ్గయ్యెను. అట్టి ధృఢకాయుఁడగు నీభీముఁడా బకాసురునిజంపి యేకచక్రపురవాసులకా బాధ లేకుండఁజేయును. మనకుపకారముచేసిన యీబ్రాహ్మణునకీవిధముగాఁ బ్రత్యుపకారముచేయు నవకాశమిప్పుడు మనకుఁగల్గినది. మఱియును క్షత్రియుఁ డితరుల బాధలు తొలఁగఁబెట్టినవాఁడనియు, నతఁడు బ్రాహ్మణభక్తుఁడైన బ్రాహ్మణులను రక్షించినఁ లోకములను, క్షత్రియులను గాపాడిన సత్కీర్తియు, వైశ్యశూద్రులను గాచినఁ బ్రజానురాగమును బడయుననియు వేదవ్యాస మహర్షి చెప్పఁగా వింటిని. బ్రాహ్మణులకుఁ బ్రియముచేసిన వారి యనుగ్రహమున నీవు నీతమ్ములవు నాయురారోగ్యైశ్వర్యాదులు కలుగు" నని చెప్పెను. ధర్మజుఁడదివిని తల్లికార్య బుద్ధికి బ్రాహ్మణభక్తికి మెచ్చి తానును భీమసేను నందులకు నియోగించెను.

౩. భీమ బకాసురుల యుద్ధమును వర్ణింపుట.

భీముఁడు తల్లియాజ్ఞచే బ్రాహ్మణార్థము బకునికడకు బలిని గొనిపోవ సిద్ధపడెను. అతని కోరికపై నాయింటిబ్రాహ్మణుఁ డాతనికిఁ బలుతెఱఁగులగు పిండివంటలు పప్పుఁగూడు మొదలగునవి పెట్టఁగాఁ దిని తృప్తుఁడై రెట్టించినబలముపొందెను. పిదప నతఁడు భోజనపదార్థములతో నిండిన బండి నెక్కి బకుఁడున్నచోటునకేగెను. కాని యతఁడు రక్తమాంసాదులతో నిండి దుర్గంధపూరితమై యున్న ఒకనివాసముఁ జేరఁజాలక దానికిఁ గొంతదూరమున నాగి, బకుఁడువచ్చులోపల "ఊరక యుండ నేల" యని శకటములోని కూడు తినుచుండెను.

అంతలో నాఁకలి పెల్లున మండిపడుచు బకుఁడచ్చటికి వచ్చి "నాకని యుంచి కొనివచ్చుకూడు నీ వేల కుడిచెదవు? నేనింకఁ జులకనయితినా?" అనుచుఁ బిడికిడితో భీముని వీఁపుపై బొడిచెను. భీముఁడదిలక్ష్యపెట్టక తనపనిని సాగించుచుండెను. అంత బకుఁడు మఱింత కోపమున నాసమీపమందలి చెట్టు నొకదానిని బెఱికి భీమునిఁ దాఁకెను. అప్పటికప్పుడే భీముఁడా బండిలోని భక్ష్యములన్నిటిని దిని వైచి బకుని వైపుదిరిగి "ఓరీ, రాక్షసాధమా! పాపమని యెంచక యింతకాలము మనుష్యమాంసములను దినుచుఁ గ్రొవ్వితివి. ఇప్పుడా మాంసములన్నిటి నిగ్రక్కించి నీ మత్తణఁగించెద నుండు" మని తాను నాప్రాంతమందలి యొక మద్దిచెట్టును బెఱికి వానిపై వైచెను. తనచేతివృక్షముతో బకుఁడా చెట్టును ముక్కలుచేసెను. ఇట్లిద్దఱు - గొంతసేపు వృక్షయుద్ధము చేసి, పిదప మల్లయుద్ధమునకుఁ బూనిరి.

భీమ బకాసురుఁ లిరువురుఁ బరస్పర జయమును గోరి యొకరి నొకరు పట్టుచుఁ ద్రోయుచు నీడ్చుచుఁ బోరుచుండిరి. వారి పాదముల యొత్తిడిచే భూమి యదరఁ జొచ్చెను. అచ్చటివృక్షలతాదులు తునాతునకలయ్యెను, రాలెల్ల నుగ్గయ్యెను. కొంతవడికి భీముఁడు బకునిఁ గూలఁదన్ని యెడమ పాదముతో వాని ఱొమ్మునఁ దన్నెను.

వాఁడును గోపోద్దీపితుఁడై లేచి భీమునిఁ బడఁద్రోచి పిడికిటితో వాని వక్షమున బొడిచెను. భీముఁ డంతఁ దన రెండుచేతులతో బకుని నడుమును మెడనుబట్టి కాలి మోకాలితో వీపుపై నొక్క పోటుపొడిచెను. దానితో రక్తమాంసంబులు గ్రక్కుకొనుచు నేలఁగూలి బకాసురుఁడు ప్రాణములువిడెను. పిదప భీముఁడు తాను బకాసురుని జంపిన విషయము లోకమున వెల్లడి యగుటకై వాని కళేబరము నీడ్చికొనివచ్చి ఏకచక్రపుర ద్వార సమీపమునఁ బడవైచి, యందలి బ్రాహ్మణులకు సంతోషము గలుగఁజేసెను.

4. బకవధయందు వివిధవ్యక్తుల భావములను నన్నయ యెట్లు చిత్రించెను ?

నన్నయభట్టు తనరచనమునం దాయా పాత్రల చర్యలనుభావములను స్ఫుటముగను జీవకళా యుక్తముగను చిత్రించుటలో సిద్ధహస్తుఁడని పేర్వడసినవాఁడు. అతని యీ నేర్పునకు బకవధఘట్టము చక్కని నిదర్శనముగానున్నది. బకాసుర వృత్తాంతమున నేకచక్రపురమందలి బ్రాహ్మణకుటుంబమునఁ జెలరేగిన కల్లోలము లోకజీవిత సామాన్యచిత్రణముగానుండి కరుణనుపుట్టించును. ఈసందర్భమున కుటుంబయజమానియు నాతని భార్యయు పుత్రియు నెవరిభావములు వారు ధర్మయుక్తముగ వెలువఱచిరి. కౌమారుఁడు చిన్నవాఁడుగాన వానిమాటలు ముద్దుగొల్పును. కాని యా కరుణారస ఘట్టమునకు మఱింతతీవ్రతనిచ్చును. కుంతీ, భీమధర్మజుల మాటలుకూడ వారిహృదయగత భావములను విశదపఱచును. ఇంటగోదనము వినఁబడగానె కుంతీదేవి మనస్సు కల్లోలితమై, యింటివారి దుఃఖము దొలఁగింప నామె యోచించినది. ఇంటిలోని పరిదేవనము చూచి యామె విషయ మడుగలేక పోయెను. అంతటగృహస్థుఁడు తామిఁకొక చోటికి తరలిపోవుదమన్న భార్యపోనిచ్చినదికాదని దుఃఖించి రాక్షసునికడ కెవరిని బంపుటయా యని తర్కించి, భార్యనుగాని పుత్రినిగాని పుత్రునిగాని యర్పించుటకంటె తానే యాత్మార్పణము చేసికొనుట కర్తవ్యమనుకొనెను. అంత నిల్లాలు పత్నిధర్మముదెల్పి భర్తలేనిచో సంసారము తాను చక్కఁబెట్ట లేమిని దెల్పుకొనెను. పుత్రిక తనవాదమును దెల్పుచు తాను బ్రతికియుండినఁ గలుగు దౌహిత్ర ప్రాప్తికంటె తల్లిదండ్రులు బ్రతికియున్నచో ననేక పుత్రపౌత్ర లాభంబౌనగూడునని ధర్మవిషయములుపల్కెను. భార్యగాని పుత్రికగాని కేవలము ముఖప్రీతికిఁగాక హృదయపూర్వకముగ, దామునమ్మిన విషయములనేదెల్పిరి. కుంతీదేవి బకునివృత్తాంతమును ఇలువరుస కట్టుబాటునువిని, భీముని బలపరాక్రమములను నమ్మి రాక్షసుని కడకుఁదనపుత్రుని బంపెదనన్నప్పుడు గృహస్థుఁ డట్టి పాపకార్యమునకొడఁబడననెను. అతిథిహత్య, అందును బ్రహ్మహత్యవలనఁగలుగు పాతకమున

రాతఁడు వెలిబెట్టెను. కుంతిగర్భసమ్రాప్తిని బలసమన్వితుని యుత్పన్నము చేసితివనియు, శత్రుస్త్రీలకు గల ధన్యులకెల్ల నధికుండగు తనూజుండు గలఁడేయని వాకొనెను. కుంతి నిర్ణయమును ధర్మరాజు తలంచి భీమునంతటి వానిని గోల్పోవ తామెట్లోపఁగలమని తల్లిని నిందించెను. భీముని బలవన్నే లక్క యిల్లు కాలుచుండు, హిడింబాసురవధ, ధార్తరాష్ట్రుల నుండెదవు మొదలగునవి సంఘటిల్లెననియు నట్టివాని నెట్లువిడుతుమనియు వాపోవఁ గుంతి తాను వెఱ్ఱిగా యట్టినిశ్చయము చేయలేదని భీముని చిన్ననాటి వజ్రకాయత్వము చెప్పెను. భీముని విషయమున ధర్మజుఁడు చెప్పిన స్వార్థభావములును కుంతి చెప్పిన పరార్థవిషయములును భీముని బలపరాక్రమ కథనమును మతింత పెంపుచేసినవి. ఇట్టి ఘట్టమున బ్రాహ్మణ కుటుంబ సంభాషణమునందును, కుంతీధర్మజ సంభాషణమునందును నెవరి హృదయములను వారు వ్యక్తపఱచిరి. ఈసంభాషణములు వ్యర్థవాగాడంబరములుగాక, పెక్కు ధర్మసూక్ష్మములు వెలువఱచుటకును, భీముని ప్రాముఖ్యము నిరూపింపఁజేయుటకును నుపయోగపడినవి. ఈభావచిత్రణమునందు నన్నయ యెంతయో సహజత్వమును జూపెను. ఉత్తములైన వారి హృదయములందట్టి భావములే యుద్భవిల్లుట నైసర్గికము, ఒక్క బకాసురుఁడు దక్క మిగిలినవా రందఱును వారివారి యుత్తమభావ రూపములతో పఠితల మనోనేత్రములకు గోచరింతురు.

౬. బకవధాఘట్టమున భీమసేనుఁ డెట్టివాఁడుగ వర్ణింపఁబడినాఁడు?

భారతమునందలి వీరపురుషులలో నొక్కొక్కరియం దొక్కొక్క విశేషము లోకాతీతముగ వర్ణింపఁబడెను. భీముఁడు వాయుదేవుని వరమునఁ బుట్టినవాఁడు. ఇతఁడు మహాబలుఁడు. బలాధిక్యముచే నీతనియందు తొందరపాటు విశేషముగ నున్నట్లు కొన్ని పట్టులందు వర్ణింపఁబడెను. కాని బకవధాఘట్టమున భీముఁడు దోషరహితుఁడై బలౌదార్య మహితుఁడై వెలుగొందుచున్నాఁడు.

ఈఘట్టమున బకాసురుఁ డీతనిచేత మడిసినతీరు వర్ణింపఁబడినది. భీముఁ డొక్కఁడే సోదరులను తల్లిని లక్క యింటినుండి రక్షించెను. అలసియున్న వారిని తన భుజముల మోసెను, హిడింబాసురుని జంపెను. వ్యాసుని యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను. తాము కాపురమున్న యింటివారి యిక్కట్టుదలపోసి కుంతి విచారింపగా భీముఁడు 'తగవ చేల, ఎంతకడిఁదియైన నిదియేగ దీర్చి యావిప్రుల కునకుఁ బ్రియంబు విస్తరింతు' నని పల్కి తన యౌదార్యమును దెల్పెను.

యుద్ధమన్న భీమునికి పండుగు. అతని యుత్సాహితరూపము చూచి ధర్మరాజు తెలిగంది యాతఁ డెద్దియో యుద్ధమునకు సన్నద్ధుఁడై యుండెనని యూహించెను.

పరులకొఱకుఁ దమకొడుకులను విడుచుట లోకాచార విరుద్ధమని ధర్మరాజు తల్లిని నిందించుచుండఁ గుంతి తనపుత్రుల బలాదులను దలపోసెను. తమ్మును లక్కయింటినుండి గాచినదియు, తనను నిద్ర చెడకుండ హిడింబుని దూరముగ నీడ్చుకొనిపోయి యచట వానితోఁ బోరి వానిఁ జంపెననియు, భీముని మూలముననే ధార్తరాష్ట్రులు ధైర్యము చెడి నిబ్బరము సుఖనిద్రములేక వగచుచుండిరనియు, నాతని బలమును బరిపరి విధములఁ దలపోసెను. అంతట కుంతి భీముఁడు వజ్రకాయుఁడనియు, నాతడు పుట్టిన పదియవనాఁడు పర్వతము మీఁదఁబడఁగా నచ్చటి రాలెల్ల నుగ్గయ్యెననియు, నట్టి భీముఁడు రాక్షసుని జయించుట నిశ్చయమనియుఁ దన్మూలమునఁ బ్రాహ్మణునకుఁ బ్రత్యుపకారము నేయ నవకాశము లభించెననియుఁ జెప్పెను.

భీముఁ డర్ధరాత్రి, ఆహారపు కొఱతచే తినక నిద్రపట్టలేదనియు నందుచే డస్సియుంటిననియుఁ జెప్పి తనకుఁ జాలిన యాహారము పెట్టుడని యింటివారిని గోరెను. ఇంటివారు వెంటనే ప్రభూతాన్నాదుల నాతనికిఁ గుడువఁబెట్టిరి. బకాసురుఁడు లోకులకెల్ల [illegible] భీమునికలుసుగాఁదోఁచెను. భీముఁడు బకుని స్థానము సమీపింపక మునుపే నిర్లక్ష్యభావముతో బండిపైనెక్కి రాక్షసుని కొఱకైన యన్నము తినఁ గడఁగెను. భీముని చర్యచే రాక్షసుఁడు క్రుద్ధుఁడై, ఏకచక్రపుర వాసులు గర్వించిరని మండిపడి, వెనుకనుండివచ్చి, భీముని వీపుపైఁ బొడిచెను. ఆపోటు సరకుగొనక భీముఁడు భుజించుచునే యుండెను. రాక్షసుఁ డొకవృక్షముగొని తాకఁగా భీముఁడు యుద్ధమునకుఁ దలపడి క్రూరయుద్ధమున రాక్షసుని ప్రాణములు దీసి వాని కళేబరము నీడ్చుకొనివచ్చెను. ఇట్టి ఘట్టమున భీముని బలౌదార్యాదులు వర్ణితములు.

6. 'బకాసుర సంహారము' ననుసరించి కుంతి గుణశీలమును నిర్ణయించునది.

కుంతి పాండవులతల్లి; కారుణ్యము, బ్రాహ్మణభక్తి, ధర్మబుద్ధిగలది. ఈ గుణములచే నామె లోకకంటకుఁడగు బకాసురుని సంహరింపఁజేసి, యేకచక్ర పుర వాసులగు బ్రాహ్మణులకు నుపకారము నొనర్చి ధన్యాత్మురాలయ్యెను.

లక్కయిల్లు వెల్వడిన పిమ్మటఁ గుంతి కొడుకులుఁ దానును బ్రాహ్మణవేషంబులుదాల్చి యేకచక్రపురంబున నొక విప్రునింట విడిసియుండెను. కొడుకులు భిక్షాన్నము తెచ్చి భక్తివినయములతో సమర్పించుచుండ, మాతృధర్మమెట్టిదో నట్లామె దానిని రెండుభాగములుచేసి, యొకభాగము నాఁకలిగొట్టువాఁడగు భీమున కిడి శేషించినభాగముఁ గడమకొడుకులుఁ దానును భుజించుచుండెను. పరోపకార

బుద్ధితోఁ దమకాశ్రయము కల్పించిన బ్రాహ్మణున కామె కృతజ్ఞురాలై ప్రత్యుపకారము చేయు నవకాశ మెట్టు సిద్ధించునా యని నిరంతరము తలపోయుచుండెను.

ఇట్లుండ బకాసురుని వారివంతు నొకనాఁ డా విప్రునింట నొక్కపెట్టున రోదన ధ్వని యెగసినది. పరులకష్టముల జూచి సహింపలేని జాలిమనసుగల కుంతి యది విని మిక్కిలి సంతాపించినది; ఆ యాపదకారణ మెఱిఁగి నివారించి, యెట్టులైన నా బ్రాహ్మణునకు మనః ప్రియము సేయవలెనని నిశ్చయించినది. అక్కడనుండిన భీముని జూచి కుంతి మన మిన్నిదినము లీ బ్రాహ్మణునింట నిలిచి నిర్భయముగ సుఖముగనుంటిమి. మనకాశ్రయ మిచ్చిన మహోపకారులకు నేదో కష్టమో యేదో విపత్తో నేఁడు సంభవించినది. బుద్ధిమంతుల కితరులొనర్చిన యుపకారము మఱువ కుండుట పుణ్యము; దానికి సమముగ మేలుచేయుట మధ్యమము; అంతకంటె మించిన మేలుసేయుట యుత్తమము. కావున నిప్పు డీతని యాపదఁ దొలఁగించి మనః ప్రియంబుసేయుట మనకువిధి'' యని చెప్పి యొప్పించినది. దీనివలనఁ గుంతి యొక్క సహృదయత్వము, కారుణ్యభావము, ప్రత్యుపకార బుద్ధియు విదితమగుచున్నవి.

భీముని ప్రోత్సాహమునఁ గుంతి విషాదకారణ మెఱుఁగఁదలఁచి విప్రునికడ కేఁగినది. కాని దుర్భర విషాదమున విలపించుచున్నవారిని దత్కారణ మడిగి మఱింత విలపింపఁజేయుట యుచితముకాదని కొంతసేపట్టె నిలిచిపోయినది. ఏడ్పుడిగినంతఁ గుంతి బ్రాహ్మణునిజేరి విషాద కారణమడిగెను. అతఁ డా నాఁడు బకాసురునివలనఁ దమకుఁ గలుగనున్న యాపదఁ దెలుపఁగా, నామె యతని యాపదఁ దొలఁగించుటకై తన యేవురు పుత్త్రులలో నొక్కని రాక్షసునకు బలిగా నొసఁగెదనని చెప్పి, యతని నూఱడింపఁబోయెను. తనకొఱ కతిథియైన బ్రాహ్మణుని జంపఁబూనుట మహాపాతకము గావునఁ దానందుల కియ్యకొనననని బ్రాహ్మణుఁడు పలుకఁగాఁ, దానును బ్రాహ్మణవధకు సమ్మతింపలేకయే యతనిరక్షణకై తనపుత్త్రుని బంపఁదలచెననియు, దనకుమారు నారక్కసుఁడు గెలువఁజాలఁడనియు నది యెఱిఁగియే తానట్టిపనికిఁ బూనితిననియుఁ జెప్పి కుంతి బ్రాహ్మణు నొడంబఱచెను. పిమ్మటఁ భీమునిఁ బిలిచి యావిషయ మెఱిఁగించి, బ్రాహ్మణు నయ్యాపదనుండి తప్పించి తనకు మనఃప్రియంబుసేయు మని నియమించెను. ఇట బ్రాహ్మణార్థము కుంతిచూపిన సాహసము ధర్మబద్ధము, నౌదార్యపూరితమునై యామె బ్రాహ్మణ భక్తిని జాటుచున్నది.

భిక్షకేఁగిన ధర్మజుఁడు మరలివచ్చి బ్రాహ్మణార్థము తల్లిచేసిన నిర్ణయ మెఱిఁగి యామెను నిందించెను. భీమునివల్లనే లక్కయిల్లు వెల్వడుట, హిడింబాసురవధ మొదలగునవి జరిగెననియు, నట్టివాని నసుర కాహారమిడఁ దలఁచుట మూర్ఖత్వమనియు ధర్మజుఁ డనఁగాఁ గుంతి, భీముఁడు వజ్రకాయుఁడనియు, నతఁడు పుట్టిన

పదియవనాఁడు పర్వతముమీఁదఁ బడఁగా నచ్చటి రాలెల్ల నుగ్గయ్యెననియు, నట్టి భీముఁడు రాక్షసుని వధించుట నిశ్చయమనియుఁ, దనన్నాలమున బ్రాహ్మణునకు ప్రత్యుపకారము చేయు సదవకాశము లభించెననియుఁ జెప్పెను. మరియు నుత్తమ క్షత్రియుఁడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను గాపాడి పుణ్యముఁబొందు ననియు, బ్రాహ్మణులకుఁ బ్రియముసేయుట పుణ్యకర్మఫలమనియు, దానిచే వైశ్వర్యాదులు కలుగుననియుఁ దా మున్ను వ్యాసునివలన విన్న ధర్మము లామె ధర్మజునకుఁ జెప్పెను. ధర్మజుఁ డంత నామె కార్యబుద్ధికి, బ్రాహ్మణభక్తికి, ధర్మచిత్తమగుటకు సంతసించి తానును భీమసేను నంపుటకు సమ్మతించెను. ఇట్టి ఘట్టము నందుఁ గుంతీదేవి లోకజ్ఞత, ధర్మబుద్ధి, ప్రత్యుపకారబుద్ధి, చాకచక్యము, నైపుణ్యము-అనుగుణములచేఁ దన ధర్మనిర్ణయమున కనుకూలముగా సహకరించువారి నొడఁబఱిచి కృతార్థురాలైనట్లు చిత్రింపఁబడినది.

### 7. బకవధా వృత్తాంత మూలమున వెలువడిన ధర్మము లెవ్వి?

భారతము పంచమవేదమనఁ బరగును. వేదప్రతిపాదితధర్మములు భారతమున నానాకథల సందర్భమునఁ దెలుపఁబడును గాన వేదపఠనము చేయఁజాలని వారికి కొఱత తీరును. భారతము నందంతటను వివిధ ధర్మములు వర్ణింపబడినను సన్నగును ప్రధానముగ ధార్మికుఁ డనదగును. భీమ బకాసుర కథా సందర్భమునఁ బెక్కు ధర్మము లుద్ఘాటించుట కవకాశము లభించినది

పాండవులు లక్కయింటినుండి తప్పించుకొని, వ్యాసమహర్షి యుపదేశము నొంది బ్రాహ్మణచర్య నవలంబించి యేకచక్రపురమున నివసింపఁదొడఁగిరి. బ్రహ్మచారులు భిక్షాశనములఁ బ్రోగుచేసి తమ పెద్దలకు నివేదించి వానిని దినుట ధర్మము. కొమరులు తెచ్చిన యాహారములో భీముని శరీరలక్షణమును బట్టి కుంతి సగమువంతు అతనికిఁ బెట్టెడిది. మిగిలిన యర్ధభాగమును మిగిలినవారు తినుచుండిరి.

వారుకాపురమున్న యింటిలో రోదనము వినఁబడ దానికారణమారసి యింటివారి కుపకృతిసేయుట ధర్మమని కుంతి భీమునితోఁ బలుకుచు "కృతమెఱుఁగుట పుణ్యము. దానికి సమముసేత మధ్యము, విశేషముగ సత్కృతిసేయుట యుత్తమము" అని తెల్పెను. భీముఁడా యింటివారి కుపకృతిసేయుదు ననెను. ఏడ్చుచున్న గేస్తు పరిపరి విధముల విలపించెను. సంసారము నిస్సారమనియు, పూర్వకర్మచే ద్వంద్వములు జీవికి తప్పవనియు, రక్కసునికొఱకు నాహారముగా సంతానవతియగు భార్యను విడువ రాదనియు, ఏవటునికో యిచ్చుటకు దనయింట భగవంతునిచే నదువగా నుంపఁబడి తనకు మనుమఁడు పుట్టెడు లాభము గలిగించెడి కొమార్తెను వీడరాదనియు, దనకు పితృఋణముతీర్చి పరలోకక్రియలు చేయుపుత్త్రుని గోల్పోవుట యసంభవమనియు నాతఁడు దుఃఖించెను. గృహిణి, మీఱరాని యాపదలనుగూర్చి విలపింపరాదని తెల్పుచు, పతివ్రతా ధర్మములు, పతికంటె ముందు గతించనిపోవుటలోని మేలు, పురుష సంతానములేని పతివ్రతకొందునింద, భర్తలేని స్త్రీని తరులు చులకన చేయుట,

యుదారబుద్ధిని దెల్పుచు,నింటివారి కధికముగ మేలుచేసి వారియాపద దీర్చి పుణ్యము గట్టుకొనవలెనని ప్రబోధించినది. ఇది యొక నీతివాక్యము. భారతమున నిట్టినీతివాక్యము లెన్నియో ఆయాపట్టులందుఁ జేర్పబడుచుండును. కుంతి మాటలకుఁ దగినట్లుగానే భీముఁడును ప్రవర్తించెను.

(2) 'నలసారము సంసారము.'

ఇంటివారి రోదనకారణ మరయఁబోయి కుంతి యేడ్చుచున్నవారి నడుగలేక పోయెను. అప్పుడాయింటి బ్రాహ్మణుఁడే బాంధవులందఱును వినునట్లుగ గీతిని సంసారమునుగూర్చి విలపించెను. ........పద్యార్థము వ్రాయుము.

(3) 'కర్మవిపాకంబు గడవ గలానె.'

ఇంటిబ్రాహ్మణుఁడు విలపించుచు నన్నమాటలు. కర్మవిపాకము=పూర్వము చేసికొన్న కర్మల పరిణామము లేక ఫలము. కడవంగన్=మీఱుటకు. గలానె?=శక్యమా? రాక్షసునివలని యాపదను శంకించి బ్రాహ్మణుఁ డొండుచోటికిఁబోవలెనని యెంచెను. కాని యాతనిమాట ఇంటిలోనివారు సాగనీయలేదు. దైవమే యిట్టి దారుణము చేయఁదలఁపఁగా దానినుండి యెవ్వఁడుతప్పిపోఁగల్గును. కర్మఫలము మీఱుట కెవరికిని బలముండదు. అని విచారించెను.

(4) 'అనతిక్రమణీయమైన యాపద్విషయంబున సంతాపింపఁగాఁ జనదు.'

బ్రాహ్మణి తనభర్తకుఁ దెలిపిన మాటలివి.

(4) 'శరణాగతుఁ బాపఁగ నొడఁబడు దుర్మతి కిహముం బరముఁ గలదె పరికింపన్'

బ్రాహ్మణుఁడు కుంతితో నన్నమాటలివి

(6) 'శతపుత్రులుగల ధన్యులకైనవనివిష్టుఁడగు తనూజుఁడుగలఁడె'

కుంతి బ్రాహ్మణునితో నన్నమాటలు.

(7) 'పరమపతివ్రతయయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె'

బ్రాహ్మణి తానేరక్కసునకు కళనముగానేగుదుననుచు భర్తతో నన్నమాటలు

(మొదటి వాక్యమునకు వివరించినరీతిగా నీవాక్యముల కన్నిటికి అర్థసందర్భాదులను వివరింపవలయును.)

——*——

# భగీరథవిజయము

## భాగవతము - నవమస్కంధము

## (పోతనామాత్యుఁడు)

### కవిజీవితాదులు :—

భగీరథవిజయమను నీపాఠ్యభాగము శ్రీమదాంధ్రమహాభాగవతమందలి నవమస్కంధమునుండి గైకొనఁబడినది. దానిని రచించినవాఁడు బమ్మెర పోతనామాత్యుఁడు.

అష్టాదశ పురాణములందును ప్రజాహృదయమునకుఁ బరమసన్నిహితమును నాదరపాత్రమునునైనది మహాభాగవతము. భగవంతుఁడగు శ్రీకృష్ణుని మహిమలందు వర్ణింపబడియుండుటచే దాని కా నామము గలిగినది. అయ్యది భక్తుల పాలిటఁ గల్పవృక్షమై ద్వాదశస్కంధములు కలిగి తనరారుచున్నది. దానిని సంస్కృతంబున మహాభారతకర్తయగు వ్యాసమహర్షి రచించెను. భక్తాగ్రగణ్యుఁడగు బమ్మెర పోతనామాత్యుఁడా యుద్గ్రంథమును భారతాంధ్రీకర్తలవలె స్వేచ్ఛాప్రవృత్తమై యాంధ్రీకరించెను. ఆంధ్రదేశమున సంస్కృతభాగవతముకంటె నాంధ్రభాగవతమునకెక్కుడు ప్రజాదరణము గలదు. ఇతర కవులవలె రాజాదరణమును, లౌకికోన్నతియు, భాగ్యభోగములను నపేక్షింపక భక్తిప్రధానుఁడై కీర్తికెక్కిన పోతనయే యీగ్రంథమున కింతటి ప్రశస్తి కలిగించినాఁడు.

పోతనామాత్యుఁడు క్రీ.శ. 1400 సంవత్సర ప్రాంతమున జన్మించి సుమారు డెబ్బదిసంవత్సరములవఱకు జీవించియుండినట్లు చెప్పుదురు. ఈతఁడు తననివాసమేకశిలానగరమని చెప్పుకొనియున్నాఁడు. ఈయేకశిలానగరమనునది ఇప్పుడు నిజాము రాష్ట్రములోని 'ఓరుగల్లు' అని కొందరును, కడపమండలములోని 'ఒంటిమెట్ట' యని మఱికొందరును వాదించుచున్నారు. సత్యాన్వేషకులైన చారిత్రకులిందలి మొదటి వాదమే సమంజసమని భావించుచున్నారు. పోతన నియోగిబ్రాహ్మణ వంశమునకు జెందినవాఁడు. కౌండిన్యసగోత్రుఁడు, కేసనలక్కమాంబలకుఁ బుత్త్రుఁడు. మల్లనకవివరునకు జనకుఁడు. కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడీతనికి బావమఱిదియైనట్లొక కథ ప్రచారమునఁ గలదు గాని, యా సంబంధము విశ్వాసార్హమైనది గాదు. దీనినిబట్టి శ్రీనాథుఁడీతనికి సమకాలికుఁడని మాత్రము విదితమగుచున్నది. స్కంధాంతపద్యములందు "సహజపాండిత్య, శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర" యని తన్ను గూర్చి చెప్పుకొనియుండుటంబట్టి యీతఁడు తొలుతనుండియు స్వయంకృషివల్లనే

సంస్కృతాంధ్రభాషలయం దసాధారణ పాండిత్యము సంపాదించి యనర్గళకవితా ధారను బొందగలైనే గాని, గురుముఖమున నేవిద్యయు నభ్యసించలేదని స్పష్టపడు చున్నది. ఈతఁడు తన కవిత్వాదశలో [illegible] వెంకటగిరి సంస్థానాధీశ్వరుఁడగు రావు సింగ భూపాలుని ప్రేరణమున భోగినీదండకమును రచించి యాతనికి కృతి యొసఁగెను, అనంతర మీతఁడు [illegible] యుత్కృష్టమగు శ్రీ[illegible] గ్రంథము [illegible]పై తన్నామాంకితంబులుగా భాగవతంబును సమగ్రముగా నాంధ్రీకరించెను.

కాని పోతన మరణానంతర మాగ్రంథమునందలి కొన్ని భాగములు శిథిలములై నష్టములు కాఁగా నాతని శిష్యుఁడగు వెలిగందల నారయయు, ఏర్చూరి సింగనయు, బొప్పరాజు గంగయయను వారు భాగవతమును బూరించిరి. ఇప్పటి భాగవతమునఁ బోతన రచిత భాగములేవియో, నారయాదులు రచించిన భాగము లెవ్వియో స్పష్టముగాఁ జెప్పుటకుఁ దగిన యాధారములు కానరావు కాని ద్వితీయ దశమస్కంధములందుఁ గొంతకొంత భాగమును, ఏకాదశ ద్వాదశ స్కంధములను బూర్తిగను వెలిగందల నారయయుఁ, బంచమస్కంధమును గంగరాజును షష్ఠస్కంధము సింగన్నయు, శేషించిన భాగమంతయుఁ బోతనయు రచించినట్లు ప్రాచీనపండిత జన లిఖితపుస్తకములందుఁ గానవచ్చుచున్నది. పోతన పై రెండు గ్రంథముల నేగాక వీరభద్రవిజయము నారాయణశతకము అను గ్రంథములను గూడ రచించె నందురు. కొందఱు భాగవతము తక్కిన మిగిలిన గ్రంథము లెవ్వియుఁ బోతన రచితములు కావని వాదించుచున్నారు.

పోతన సహజ పాండిత్యుఁడని తనే చెప్పుకొన్నాఁడు. ఈతని కవితయందు దొర్లిన కొన్ని తప్పులకిదే కారణమని కొందఱు. నాతప్పులీతని కవిత్వములోనివి గాక యాతనికిఁదోడ్పడిన సింగన, గంగన, నారయాదుల రచనలలోనివని కొందఱును దెల్పుదురు. భాగవతకవిత్వము మృదుమధురముగా ద్రాక్షాపాకమునఁ బడినది. శబ్దాలంకారములందు హెచ్చుగఁ గన్పడును. అంత్యానుప్రాసము లీకవికి మిక్కిలి యిష్టము. కవనమమృత ప్రవాహమువలె నుండి కర్ణరసాయనముగ నుండును. పెక్కండ్రు భాగవత భాగములను కంఠపాఠము చేయుదురు. కొన్ని పద్యములు సమాస భూయిష్ఠములై యున్నను ప్రతి పదమును సరసము కాని వారుగూడ నీతని కవితాశయ్య కానందించి శ్రుతిమధురముగా భాగవత పద్యములను పాడుకొందురు. తెలుఁగు పలుకుబడియందును పోతన కవితయందంతట స్ఫురించుచుండును. 'కొందఱకు తెనుఁగు గుణమగు గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండున్, గొందఱకు గుణములగు నే నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్' అని పోతన చేసిన ప్రమాణము యథార్థము, పోతన భక్తిరసముగల తావులలో నావిష్టమతియై వర్ణించినట్లు దోఁచును, శృంగార[illegible]ాడ నింపుగ రచించును, ఇతరసందర్భములందు పురాణ

శైలి నీతని కవనము సరళముగాను సులభముగాను నుండును. వేదాంత ఘట్టములను బోధనవిడువక వర్ణించినాడు. ఆయా యుపాఖ్యానములందు భగవంతుని మహిమా వర్ణనములును, వేదాంతబోధమును సరసకవిత్వములో నడచును.

కథాసందర్భము:—

భగీరథ విజయమనఁగా భగీరథుఁడు గంగను భూలోకమున కవతరింపఁజేయుటలో కృతకృత్యుఁడగుట, భగీరథుఁడు సగర చక్రవర్తి వంశమువాఁడు. సగరుఁడిక్ష్వాకువంశమువాఁడు. పోతన నవమస్కంధములో అంబరీషోపాఖ్యానము ముగించి ఇక్ష్వాకు వంశమందలి రాజులచరిత్ర వ్రాయఁదొడఁగును. ఆవంశమున హరిశ్చంద్రుడను రాజు మిక్కిలి ప్రసిద్ధి బడసినవాఁడు. అతని కుమారుఁడు రోహితుఁడు. అతని కొడుకు హరితుఁడు. వాని కొడుకు చంపా మహారాజు. వాని కుమారుఁడు సుదేవుఁడు, సుదేవుని కుమారుఁడు విజయుఁడు వానికి రురుకుఁడు, వానికి వృకుఁడు, వానికి బాహుకుఁడును బుట్టిరి. బాహుకుని పుత్త్రుఁడు సగరుఁడు. అతనికిఁ దొలి భార్యయం దసమంజసుఁడనువాఁడును, రెండవభార్యయం దఱువదివేల మంది పుత్త్రులుఁ గలిగిరి. ఆ యసమంజసునకు అంశుమంతుఁడు, వానికి దిలీపుఁడు జన్మించిరి. దిలీపుని కుమారుఁడు భగీరథుఁడు అతఁడే తనపితరుల నుత్తమలోకమునందించుట కాకాశగంగను భువి కవతరింపఁజేసిన ఘనుఁడు. ఆ భగీరథుని ప్రయత్న విజయమే ప్రస్తుత పాఠ్యభాగమునందు వివరింపఁబడినది (కథాసారాంశము ప్రశ్నోత్తరములలో నీయఁబడినది.)

అర్థాదులు :—

2. పగవారు=శత్రువులు, దండించి=శిక్షించి, అంగనలు=భార్యలు, అనుగమింపన్+కదియుచోన్=సహగమనము చేయుటకు సమీపింపఁగా, ఔర్వముని+ఈశ్వరుఁడు (స॥ దీ॥సంధి)=ఔర్వుఁడను మునిశ్రేష్ఠుఁడు; ఆత్మన్=మనస్సునందు, వారించెన్=అడ్డగించెను, అ+వనజ+అక్షి, సవతులు=పద్మములవంటి నేత్రములుగల యా స్త్రీ యొక్క సవతులు, మాలు+నిండారినన్=(గర్భము) నెలలునిండఁగాఁ అరిన్=ఆసక్తితో, విరిసిపడక=చెడిపోక, గరముతోన్=విషముతో, ఘనుఁడు=గొప్పవాఁడు, వరయశః+పూర్తితోన్=శ్రేష్ఠమైన కీర్తియొక్క ప్రకాశముతో.

తా. శత్రువులు బాహుకుని శిక్షించి యాతని రాజ్యమాక్రమించిరి. బాహుకుఁడంత భార్యతో నడవికేగి ముసలితనము రాఁగా నచ్చటనే మరణించెను. గర్భవతియగు

2. వ్యా॥ వి:-పద్యము:- (1) అతఁడు+వచ్చిన, సవతులు+మాలు, అన్నంబు+పడుచు, విషము+పెట్టి, ఘనుఁడు+పుట్టి - (గసడదవాదేశసంధులు) - ప్రథమ

నతని భార్య సహగమనమునకు సిద్ధపడెను, ఔర్వుఁడను ముని యది యెఱిఁగి యామెను వారించెను. ఆమెసవతు లామె గర్భము దాల్చుటను జూచి సహింపఁజాలక, యన్నములో విషము కలిపి యామెకుఁ బెట్టిరి. కాని దైవవశమున గర్భము చెడలేదు. పిదప వావిషముతోఁగూడి యొక మగశిశువు జనించెను. గరము (విషము)తోఁ గూడఁ బుట్టినవాఁడనుటచే నా బాలునకు సగరుఁడను పేరు పెట్టఁబడెను. అతఁడు గొప్ప కీర్తితోఁ జక్రవర్తి యయ్యెను.

విశే:— ఔర్వుఁడు=చ్యవనుని పుత్త్రుఁడు. గర్భవతియై యున్న చ్యవనుని భార్యను జంపుటకు శత్రువులు తఱుముకొని రాఁగా నామె తనగర్భమును ఊరుప్రదేశమున (తొడలో) దాచెను. ఆ ఊరువునుండి పుట్టినవాఁడు గాను ఔర్వుఁడనఁ బరగెను. పుట్టినబాలుని జూడఁగనే తల్లిని తఱుముకొని వచ్చిన శత్రువు లంధులైరి. ఔర్వుఁడు గొప్పతపస్వియయ్యెను. ఔర్వుఁడు బాహుకుని భార్యను సహగమనము నుండి వారించెను.

3. అతండు=ఆసగరుఁడు, తండ్రిపగకై = తండ్రి సంబంధమైన శత్రుత్వకారణముచే, సంగ్రామరంగంబులన్=యుద్ధభూములందు, హైహయ, బర్బర+ఆదులన్=హైహయుఁడు బర్బరుఁడు మొదలగువారిని, చెండెన్ = చంపెను. తాళజంఘ+ఆదులన్=కార్తవీర్యుని పుత్త్రుఁడు మొదలగువారిని, వధించెన్=చంపెను, నిజ+అరులన్=తన శత్రువులను ముండీభూతులు గాన్=తలలు గొఱుఁగఁబడినవారిని గాను, నిరంబరులు గాన్=బట్టలులేనివారు గాను, మూర్తుల్=రూపములు, సబీభత్సలై+ఉండన్=వికృతముగా నుండునట్లు, చేసెన్–సగర నామ+ఉర్వీ+ఈశుండు=సగరుఁడను పేరుగల యారాజు, అల్పుండే=తక్కువవాఁడా?

4. సగరచక్రవర్తి: ఖగ+రాజ+రుచులు = సూర్యచంద్రుల కాంతులుగల (ఆకాంతులు వ్యాపించినంత మేర) ఇలన్=భూమియందు, పగరాజులన్=శత్రురాజులను, అడఁచి=అణచివేసి, బాహాశక్తిన్=భుజబలముతో, ఏలెన్, నగరాజధీరున్=మేరువువంటి ధైర్యముగలవాఁడును, శూరున్ = పౌరుషము గలవాఁడును, హత+విమత+నగరున్=కొట్టివేయఁబడిన శత్రువుల పట్టణములు గలవాఁడునగు, సగరున్=సగరచక్రవర్తిని, నినుతింపన్+చనున్=పొగడఁదగును.

---

మీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగును– అతఁడు సచ్చిన, సవతులు నూలు, అన్నంబు గుడుచు. విషము వెట్టి, ఘనుఁడు వుట్టి. (2) ఆ+వనజాక్షి – (త్రికసంధి) త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకుద్విత్వంబు బహుళంబుగానగు. ఆ+వ్వనజాక్షి – ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగును అవ్వనజాక్షి.

5. ఔర్వుండు+చెప్పంగన్=ఔర్వమహాముని బోధింపఁగా, అటులన్=ఒప్పునట్లు, వేదాత్మకున్=వేదమయుఁడును, ఈశున్=ప్రభువును, అమృతున్=మరణము లేనివాఁడును. అనంతున్ = అంతములేనివాఁడు నగు, హరిన్ = విష్ణువును, గూర్చి=గురించి, వసుధా+ఈశ్వరుఁడు=సగరుఁడు, వాజిమేధంబులు = అశ్వమేధయాగములు, చేసెన్. అందు=ఆయశ్వమేధములలో, ఒక్కమఖమున = ఒకయజ్ఞమున, హయమున్=గుఱ్ఱమును, విడువన్, నగభేది=దేవేంద్రుఁడు, కొనిపోయి, నాగలోకమున=పాతాళలోకమున, కపిలుని చేరువన్=కపిల మహాముని చెంతను, కట్టితొలఁగన్=కట్టివేసి వెడలిపోయెను, అంతన్=పిమ్మట, ఆరాజు=ఆసగరుఁడు, గుఱ్ఱముకై. కానక, పుత్త్రనివహంబున్=పుత్త్రుల సమూహమును, దిశలకున్=అన్ని వైపులకును, వెదకంగన్=వెదకుటకు, పంపన్=పంపఁగా, వారున్, ఇల+ఏడు+దీవులన్=భూమిమీఁదఁగల జంబూప్లక్షాది సప్తద్వీపము లందును. వరుసన్=క్రమముగా, వెదకి, మఖతురంగంబు=యజ్ఞపుగుఱ్ఱము, లేకున్నన్=లేకపోఁగా, మగిడిరాక=తిరిగిరాక, ప్రాభవంబునన్=గొప్పతనముతో, దోర్దండబలము మెఱసి=(కఱ్ఱలవంటి) భుజముల బలము ప్రకాశింపఁగా ధరలము+ఎల్లన్ = భూప్రదేశము అంతయును, త్రొచ్చి=పొడిచి, పోరాడి=చిమ్మి, త్రవ్విరి.

6. సుమతి=సగరుని యిరువురి భార్యలలోఁ జిన్నదాని పేరు సుమతి. ఆమెకు అరువదివేలమంది పుత్త్రులు కలిగిరి. తూర్పు ముట్టియున్న యుత్తరభాగంబులన్=ఈశాన్యపు దిక్కున, తురంగంబున్=గుఱ్ఱమును,

7. అద్దిరయ్య=ఔర, ఎఱిఁగితిమి=తెలిసికొంటిమి, తడవు+ఏటికి=ఆలస్యమెందులకు ? గుఱ్ఱపుదొంగ, వీఁడె=ఈమునియే, ఈ, జరభునిన్=ఈనీచుని, పట్టి చంపుఁడు. అతిసాధుముని+ఇంద్రుడు+పోలెన్=మంచి మునీశ్వరునివలె, నేత్రముల్=కన్నులు, తెఱవక, వాకినోరు మెదలింపక=తెఱచిననోరు కదలింపక, బెసుకవట్టెన్=నియమము పూనినాఁడు, అంచున్, ఆ+అఱువది వేవురున్=అఱువదివేల మందియును నిజ+కర+ఆయుధముల్=తమచేతిలోని ఖడ్గాదులను, జళిపించి=కదలించి, డాయుచోన్=మునిని సమీపింపఁగా.

8. కపిలుఁడు. నేత్రముల్+తెఱవఁగా=కన్నులు విప్పఁగా, తమ మేనులన్=వారి దేహములందు, మంటపుట్టి=అగ్గిమంట లెగసి, వారు=సగరునికొడుకులు అఱువది వేలును, అపగతధైర్యులైపడి=ధైర్యము తొలఁగిపోయినవారైపడి. అహంకరణంబునన్=గర్వముచేత, మూఢచిత్తులై=తెలివి తక్కువమనస్సుగలవారై, అక్షణమంద=ఆవెంటనే, నృపసుతులు=రాజకుమారులు, అందఱున్, ధరణిన్=భూమిపై, నీఱు+అయిరి=బూడిద అయిపోయిరి, సాధులన్=మంచివారిని, తపసులన్=మునులను,

---

5. ఔర్వుఁడు+చెప్పంగ, వసుధేశ్వరుండు + చేసె (గసడదవాదేశసంధులు)
ఔర్వుఁడు సెప్పంగ, వసుధేశ్వరుండు సేసె,

గాసిన్+పెట్టెడి = బాధించెడి, మదస్ఫురితాత్ములు = గర్విష్టులు, నిల్వ నేర్తురే = బ్రతుకఁ గలరా.

అలంకారము : అర్థాంతరన్యాసము; సగరపుత్రులందఱును బూడిదయైరను నొక విశేషవిషయమును జెప్పి, దానిని, మదముచే విఱ్ఱవీగినవారు బ్రతుకలేరు. అను సామాన్యధర్మము చేసమర్థించిరి. సామాన్యధర్మమును విశేషధర్మముచేఁగాని, విశేషమును సామాన్యముచేఁగాని సమర్థించుట అర్థాంతరన్యాసము.

9. సగరకుమారులు, కపిలుని కోపానలముచే=కపిలమహర్షి యొక్క కోపమనెడు (కోపమునుండిపుట్టిన)అగ్గిచే, మ్రందిరి=చచ్చిరి, అనుచు, కొందఱు=కొంత మందిజనులు. అందురు శాంతుఁడును, ఆనందమయమూర్తి యగు అమునిని, తొడరి=పూని, కోపించునే? (ఆముని కోపించియుండఁడు) దుమ్ము=బూడిద, నేలన్ కాక = నేలమీఁద నేకాని, గగనస్థలంబున=ఆకాశమున, జన్మించునే=కలుగునా? ఏసాంఖ్య మతమునన్=(కపిలమహర్షిని నిరూపించిన) ఏసాంఖ్యమను పేరుగల మతముచేత, ఇద్ధమతులు=శుద్ధమైన మనస్సుగలవారు, భవసముద్రముఁ=సంసారసముద్రమును, మృత్యుభయమును=చావు,వలని భయమును, లంఘింతురు=దాటుదురో, అబుద్ధిన్+ చేయు=అజ్ఞానమును కలిగిం చు,సరాత్మభూఁతుడు=భగవంతునిస్వరూపుఁడు, అఖిల బోధకుఁడు=సమస్తమును బోధించువాఁడు, కపిలుఁడు, అగ్నిచూడన్ = వెదకిచూడఁగా, అతనికిన్=ఆమునికి, సఖులున్=స్నేహితులును, అమిత్రులున్=శత్రువులును, ఎవ్వరును, లేరు, సగరసుతులు, తామ=వారు, తముచేయు నేరమిన్=తామే చేసికొన్న తప్పుచే, తనువులందున్=శరీరములందు, అవలకీలలు పుట్టి=నిప్పుమంటలుపుట్టి, నీఱైరిగాక=బూడిదయైపోయిరిగాని.

10. తా. సగరుని మఱియొక కొడుకు అసమంజసుఁడు. అతఁడు పూర్వజన్మమున, యోగియైయుండి, ఇతరులతోడి సంబంధమువలని దోషముచే యోగము చెడినవాఁడై, సగరునికిఁబుత్రుఁడుగాఁబుట్టి, పూర్వజన్మ జ్ఞానముకలిగియుండెను. అతఁడు తనవారికిని నితరులకునుగూడ చెడ్డపనులు చేయుచుఁ దిరుగుచుండెను.

11. తా. ఒకనాఁడతఁడు అయోధ్యలోని పిల్లలను సరయూనదిలోఁద్రోసి అందఱునుతిట్టుచుండఁగా మఱికొన్ని నాళ్ళకుతనయోగబలముచే ఆపిల్లలను మరలఁ దెచ్చెను. అందఱును చూచి ఆశ్చర్యము చెందిరి.

---

7. గుఱ్ఱము+దొంగ-కర్మధారయమునందు మువర్ణకంబునకు పు-ంపు అగును, గుఱ్ఱపుదొంగ.

8. (1)మంట+పుట్టి (గసడదవాదేశసంధి) మంటవుట్టి, (2) చేర్చుదురే-చువర్ణంబు తోడి దుగ్గకారంబు తకారంబగు, చేరుతే.

11. నిండు+వెలుఁగు-అన్యంబులగు సైత మికారాంతర్యంబులు (లోప సుగాగమములు గాని, లోపద్విత్వములు గాని) కొండొకచోఁ గానంబడియెడి (ఇటలోపద్విత్వములు.) నివ్వెలుఁగు.

12. తా. సగరుని కొడుకు అసమంజసుఁడు, అతనికొడుకు అంశుమంతుఁడు సగరుఁడు గుఱ్ఱమును వెదకిరమ్మని అంశుమంతుని నియోగించెను. అతఁడుపోయి సగర పుత్త్రులు త్రవ్విన గొప్పరంధ్రముప్రవేశించి బూడిదగుట్టలప్రక్క గుఱ్ఱమునుచూచి, కపిలుఁడను పేరుగల విష్ణురూపునికి నమస్కరించి యిట్లు స్తుతించెను.

13. మతి+చిక్కన్+పట్టి=మనస్సును నియమములోఁబెట్టి, సమాధి గౌరవమున బ్రాలియు=మనస్సు నేకాగ్రముగానుంచు సమాధియొక్క విశేషణమునందుఁ బ్రవేశించినను, బ్రహ్మ=బ్రహ్మయంతటివాఁడు. ఒకనాఁడున్, తనవెన్+అవ్వలన్, వెలుంగు, నినున్+కానఁడు=తనఆత్మనుమించి అవలప్రకాశించుచున్న, పరమాత్ముఁడవగు నిన్ను నెఱుఁగఁజాలఁడు. అట్టిబ్రహ్మయొక్క మనస్సునుండియు, అవయవముల నుండియు, బుద్ధినుండియుపుట్టిన గొప్పప్రాణులందు (బ్రహ్మగొక్క మనస్సునుండి నారదాది ఋషులుపుట్టిరి) హీనులమైన=అల్పులమైన, మావంటిమనుష్యులకు నిన్నెఱుఁగుట శక్యమగునా? జీవులలోపల నీవున్నను నిన్ను నెఱుఁగరు. గుణములన్+చూతురు=సత్త్వరజస్తమో గుణములనుమాత్రము తెలిసికొందురు. ఒకొక్కప్పుడా గుణములనుగూడ చూడలేరు. కేవలము తమస్సను చీఁకటిని మాత్రము చూతురు. వారి శక్తులు వెలుపలమాత్రముకాదునవిగాన లోపల (అంతర్ముఖులై) చూడలేరు. దేహధారులు గ్రుడ్డివారగుచు బయటికిఁ గనుపించు కేవల శరీరములను మాత్రమే యెఱుఁగుదురు (శరీరమేఆత్మ అనుకొనువారునుగలరు) భగవంతునివగు గొప్పమాయ నెఱుఁగఁజాలక యిట్లగుదురు.

14. కాయంబు=గుఱ్ఱమును, నీఱు+అగుట = బూడిదయైన విషయమును, తడవక=ఎత్తక, కరుణా విపులుఁడు=విశాలమైన దయగలవాఁడు.

15. బుధులకుఱేఁడ=బుద్ధిమంతుడవగు బాలుఁడా! గుఱ్ఱమున్, మీతాత యొద్దకున్, కొనిపో=తీసికొనిపొమ్ము, నీతండ్రులు, వెఱ్ఱులై = అవివేకులై, నీఱు+పరి=బూడిదయైనారు, అదిగోచూడుము. ఈమిఱునన్ = బూడిదగల యీమెట్ట యందు, గంగాజలము మెలఁగన్=ప్రవహించినచో, శుభము గలుగును.

---

12. ఆ+అసమంజసుఁడు - (యడాగమము) సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరం బయిన స్వరంబునకు యడాగమంబగు. ఆ+యసమంజసుఁడు - (త్రికసంధి) త్రికంబులాఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఆ+య్యసమంజసుఁడు ద్విరుక్తంబగుహల్లుపరమగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. అయ్యసమంజసుఁడు.

13. (1) మతి+చిక్కఁబట్టి-ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు. మతి సిక్కఁబట్టి. (2) ఆ+వల - (త్రికసంధి)-అవ్వల. (3) అతి + అంధులు (యణాదేశసంధి) ఇ-ఉ-ఋ లకు అసవర్ణమైన యచ్చుపరమగునపుడు క్రమముగా య్-వ్ - ర్ అనున వాదేశమగును. అత్యంధులు,

16. తురంగంబున్=గుఱ్ఱమును, పశువువలనన్=యజ్ఞపు పశువైన గుఱ్ఱము వలన, కడమనిండించి=మిగిలిన యజ్ఞభాగమును పూర్తిచేసి, ముక్తబంధుండై = సంసార బంధములు విడిపోయినవాఁడై.

17. జనకులు=తండ్రులు, ప్రుగ్గినచోటికి = చనిపోయినచోటికి, అనిమిష నదిన్=గంగానదిని, తెత్తున్=కొనివత్తును, అనుచు, అంశుమంతుఁడు, అటవీస్థలికిన్= అడవికి, చని=వెళ్ళి, తపము, చేయఁజాలక=చేయలేక, మనమున, వగలు+ఒలయన్= దుఃఖములు కలుగఁగా, తీఱెన్=చనిపోయెను.

18. అంశుమంతునికొడుకు దిలీపుఁడు. అతఁడు భూమిమీఁదికి గంగనుదెచ్చి తనతాతల సత్తమగతి కల్పించుటకై తపముచేసెను. కాని యతఁడును, ఖ్యాతిగన్+ తేలేక=గొప్పగా గంగను తీసుకొనిరాలేక, కాలపరవశుఁడయ్యెన్=చనిపోయెను.

19. దిలీపునికొడుకు భగీరథుఁడు. అతఁడు మిక్కిలి ఘోరమైన తపస్సును జేసి, అమృత+అపాంగన్=అమృతమైన కడగంటిచూపులు గలదానిని (చివరభాగములు గలది) సు+తరంగన్=మంచి కెరటములుగలదానిని, ముఖ+వనరుహ+రత+ భృంగన్=ముఖములవంటి పద్మములందు ఆసక్తిగలిగియున్న తుమ్మెదలుగలదానిని (నీటియందలి పద్మములలో తుమ్మెదలు రొదసేయుచుండెను)శివ+జటాగ్రరంగన్= శివుని జడలచివరను ఎగిరిపడుదానిని, గంగన్ కనియెన్.

విశే:—ఇందు అపాంగన్, రంగన్, భృంగన్ మొదలైన తుది అక్షరము లొకేరీతిగ నుండుటచే అంత్యానుప్రాసమను శబ్దాలంకారము.

20. కృప+చేసి=దయగలిగి, రాచపట్టి=రాజకుమారుఁడు (భగీరథుఁడు).

21. మావారి, భస్మరాసులన్=మా పితరులబూడిదరాసులను, నీవారిన్ = నీనీటిలో, కలిపికొనుము, పెంపెన్=బాగుగా, మావారల్, నీవారిన్+కలయ=నీనీటిలో కలియఁగా, నాకము=స్వర్గము, మావారికిన్ కలుగున్, తల్లీ! ఇది=ఇట్లగుట, ప్రమాణము=సత్యము.

అలం:—ఇందు 'వారి' అనుపదము పెక్కుమార్లు వచ్చుటచే అనుప్రాసమను శబ్దాలంకారము.

22. చెల్లన్=బాగుగా, ఫుల్ల + అంతరంగన్=ప్రకాశించుచున్న లోపలి భాగముగలదానిని, బహుపుణ్యసంగన్=అనేకపుణ్యములతో సంబంధముగలదానిని, కల్లోలలక్ష్మి=కెరటములసంపదచే, జిత=జయింపఁబడిన, కాశ+మల్లిన్=రెల్లుపూలును మల్లిపూలును గలదానిని (తెలుపులో రెల్లును, మల్లెలను మించినది). సుధీ=మంచి బుద్ధిమంతులకు, కల్పలతా+మతల్లిన్=శ్రేష్ఠమైన, కోరినకోర్కెలిచ్చెడికల్పవృక్షము వంటిదానిని, తల్లిన్, గంగన్, నిన్ను, మదిన్=మనస్సునందు, భజింతున్=కొలుతును,

విశే:—ఇట విశేష్యమైన గంగ ద్వితీయావిభక్తిలోనున్నది. దాని విశేషణములన్నియు ద్వితీయావిభక్తిలోనే యున్నవి. ఈపద్యమునందును అంత్యానుప్రాసము గలదు.

ఛందస్సు:—ఇంద్రవజ్రావృత్తము: 'త-త-జ-గగ' అను గణములు వరుసగా ఇంద్రవజ్రావృత్తమున నుండవలెను. 8వ యక్షరము యతిస్థానము. ప్రాస నియమము గలదు.

23. లోకపావని=లోకములను పవిత్రము చేయుగంగ.

24. నేను, వినువీథిన్ = ఆకాశమార్గమున, పఱతెంచి=పరుగెత్తికొనివచ్చి, నేలన్=భూమిమీఁద, పడన్=పడఁగా, నావేగంబును, నిల్పన్=అడ్డుటకు, ఓపిన వాఁడు=చాలినవాఁడు, ఎవ్వఁడు? (ఎవ్వఁడు నన్నునిల్పఁజాలడని భావము), నేను, మేదినీతలమున్=భూప్రదేశమును, భేదించి=పగులఁగొట్టి, పాతాళమున్=పాతాళ లోకమునుగూర్చి, చనుదున్=పోయెదను, వచ్చితి నేనిన్=భూమిమీఁదవచ్చుచో, నాజలములన్=నానీళ్ళయందు, మానవుల్=మనుష్యులు, సంస్నాతులై=చక్కగా స్నానముచేసినవారై, ననున్, పొందించు=కలిగించునట్టి, అఘ, వ్రజంబు=పాపముల సముదాయమును, ఎచట, నేను నాశంబున్+పొందించెదన్=ఆపాపము అణఁచు కొనుటను జేసెదను?

తా. ఆకాశమున నేను బఱుగెత్తుకొనివచ్చి నేలమీఁదఁబడఁగా నావేగము నాపఁజాలినవాఁ డెవ్వఁడున్నాఁడు? భూమిని నేను బ్రద్దలుకొట్టి పాతాళమునకేగ దను. నేను భూమిమీఁదకు వచ్చుచో నరులు నా నీళ్ళలో స్నానమాడి తమ పాపములను నన్నుఁ బొందించెదరు. నేనాపాపముల నెచ్చట నాశముచేసెదను?

25. లోకమాతకు=లోకములకుఁదల్లియగు గంగకు, రాజన్య, వర్యుండు=రాజశ్రేష్ఠులలో నుత్తముఁడు.

26. పరతత్త్వజ్ఞులు = భగవంతుని యథార్థనీతి నెఱిఁగినవారు, శాంత, చిత్తులు=నెమ్మదియైన మనస్సుగలవారు, తపః+పారీణులు=తపస్సున సిద్ధులైనవారు, ఆర్యుల్=పూజ్యులు, ఘనుల్=గొప్పవారు, అగు, పురుషశ్రేష్ఠులు = ఉత్తమమానవులు, వచ్చి, భవత్+అంభః గాహముల్=నీనీటిలో స్నానములుచేయఁగా, మందాకినీ=ఓగంగా, జగత్+నాథుండు=లోకపాలకు; ప్రభువును, నానా+అఘ. సంహారుఁడు=అనేకవిధములగు పాపములను నాశముచేయువాఁడునగు, ఆవిష్ణుఁడు, వారి

24. పొందించు+అఘవ్రజము — ఉదంత తద్ధర్మార్థక విశేషణమున కచ్చు పరమగు నపుడు నుగాగమంబగును, పొందించు నఘవ్రజము.

చిత్తములన్=ఆ మానవులమనస్సులలో, తానై+ఉంటన్=తనరూపమున నుండుట చేత, నరసంఘ+అఘము=మానవులయొక్క పాపము, నిన్ను, పొందునె?

తా. తల్లీ! నీ నీటిలో స్నానముచేయువారు భగవత్తత్త్వమెఱిఁగినవారు. నిశ్చలహృదయులు, తపస్సిద్ధులు పూజ్యులు, వారిహృదయములలో సకలపాపసంహారుఁడగు విష్ణుఁడుండును. కావున స్నానవిధులచే వారిపాపములు నిన్నంటవు.

27. తనలోన్ = (ఈశ్వరుని) లోపల, ఇన్ని, జగంబులున్=ఈలోకము లన్నియు. కలుగుటన్=ఉండుట చేతను, తాను=అతఁడు, ఇన్నిటన్ = ఈలోకము లన్నింటియందును, కల్గుటన్=ఉండుటనుబట్టి, తంతువులందున్=దారములందు, చీర, తల, ఆచందంబునన్=వస్త్రమున్నవిధముగా, విశ్వభావనుఁడై=సమస్తము తానైన భావనగలవాఁడై, ఒప్పు, శివుండు=ఈశ్వరుఁడు, కాక=కాకుండ, మఱి, నీవారిన్=నీజలమును, నివారింపన్+నేర్చినవారు=అడ్డగింపఁజాలినవారు, ఎవ్వరు? నిన్ను, ధరించుకొఱకై=తాల్చుటకై, శ్రీకంఠునిన్=ఈశ్వరుని, కొల్చెదన్=సేవించెదను.

తా. తనలో అన్నిలోకములును నుండుటచేతను, తానే, అన్నిటియందును నుండుటచేతను, ఓతల్లీ, దారములందు చీర ఉన్నరీతిగా, సమస్తమును దానైన భావనతో ఒప్పునట్టి శివుఁడుగాక, మఱినీనీటిని అడ్డుపెట్టుటకు శక్తిగలవారెవరున్నారు. నిన్ను, ధరించుటకు ఆ ఈశ్వరుని (శ్రీకంఠుని=విషముకంఠమునందుఁ గలవానిని) కొల్చెదను.

28. గ్రద్దన=శీఘ్రముగా.

29. భక్తవశ్యుండు=భక్తులయందుఁ బ్రేమగలవాఁడు, ఫాల+అక్షుఁడు=నుదుటియందు కన్నుగలశివుఁడు, భగీరథుని భక్తికిమెచ్చి, శౌరి=విష్ణువుయొక్క, పాద=పాదములచే, పూత=పవిత్రమైన, సలిలయై=నీళ్ళుగలదై, దివినుండి=ఆకాశము నుండి, ధరకు=భూమికి, వచ్చు గంగను అప్పుడు దాల్చెను.

30. జగతీనాథు, రథంబు, వజ్జన్=రాజగు భగీరథుని రథము వెంట, బహుదేశంబుల్=పెక్కు దేశములను, వడిన్=వేగముగా, దాఁటి, తత్+సగర+నృప+కుమార=ఆ సగరరాజు కుమారులయొక్క, భస్మముల మీఁదన్ = బూడిదరాశుల మీఁద నుంచి, పాఱన్=ప్రవహింపఁగా, వారు=ఆ సగరపుత్త్రులు, నవీన, శ్రీలతోన్=క్రొత్తసంపదలతో, మరుత్+నగర+ఆవాసము+పొందిరి=దేవతల పట్టణము నందు నివాసమును పొందిరి. గంగనీరుగతిన్+కాక= గంగనీరు పోవుటచేత గాక, మహాదురంత=మిక్కిలి చెడ్డదైన, ద్రోహ+అనలంబు=ద్రోహము నెడుఅగ్ని (కపిలుని ముట్టడించిన ద్రోహము), ఆఱునే=చల్లాఱునా?

---

26. జగత్+నాథుఁడు (అనునాసికసంధి)-పరుషములకుఅను నాసికములు పరమగునపుడు సవర్ణానునాసికములు వికల్పముగావచ్చును. జగన్నాథుఁడు.

30. (1) మరుత్ + నగరము (అనునాసికసంధి - చూ. 26 పద్య॥ వ్యా॥ వి) మరున్నగరము. (2) వాసము+పొందిరి(గసడదవాదేశసంధి) వాసమువొందిరి.

అలం:—అర్థాంతరన్యాసము.

31. హరున్ మెప్పించి=శివుని సంతోషపెట్టి. మహాత్+తపః+నియముఁడై=గొప్ప తపోనియమముకలవాఁడై, ఆకాశ గంగానదిన్=ఆకాశమునందు ప్రవహించు గంగానదిని, ధరకున్+తెచ్చి=భూమిమీఁదకు గొనివచ్చి, నితాంత=అధికమైన, కీర్తి, లతికా, స్తంభముగా=కీర్తియనెడు తీఁగకు ఆధార స్తంభముగా, నవ్య+సుస్థిర లీలన్=క్రొత్తదై, సుస్థిరమైన విలాసముతో, పితృకృత్యమంతయున్=పితరులకుఁ జేయు పరలోకవిధానమంతయు, ఒనర్చెన్=చేసెను, వారిత=త్రోసివేయఁబడిన, అనేక=అనేకమైన, దుస్తర=దాఁటరాని, వంశ, వ్యసనుఁడు=వంశముయొక్క బాధలుగలవాఁడు, ఆ భగీరథుఁడు, నిత్య శ్రీకరుండు=ఎల్లప్పుడును ఐశ్వర్యము కలిగించువాఁడు, అల్పుఁడే=తక్కువవాఁడా! హరిన్=విష్ణువును, తమ మానసములలోన్=తమ హృదయములందు, ఇడి=నిలిపి, ముని+ఇంద్రులు, హరిపాదాంభోజజనితమైన=విష్ణువుయొక్క పాదపద్మములనుండి పుట్టిన, నదిన్=గంగానదియందు, సుస్థిరులై=మిక్కిలిస్థిరబుద్ధిగలవారలై, క్రుంకి=స్నానముచేసి, త్రిగుణరహితులై=సత్వరజస్తమోగుణములు లేనివారై, ఆ+వేళన్=ఆసమయమున, హరిన్+కలిసిరి=విష్ణుసాయుజ్యమును బొందిరి.

## ప్రశ్నోత్తరములు.

### 1. గంగ భూమి కవతరించిన వృత్తాంతము దెల్పుఁడు.

#### (అ) సగరుఁ డశ్వమేధ మొనరించిన విధము.

హరిశ్చంద్రుని వంశమున వృకుఁడను వానికి బాహుకుఁడనువాఁడు జనించెను. అతఁడు శత్రువులకు రాజ్యమోడి వనముపాలై యడవిలోఁ జనిపోయెను. అతని భార్య సహగమనము చేయఁబోఁగా ఔర్వమునీశ్వరుఁడు బాహుకుని భార్య గర్భవతియై యుంట యెఱిఁగి, తత్ప్రయత్నంబునుండి యామెను వారించెను. ఆమె సవతులు అసూయఁజెంది యామెకన్నములో విషముపెట్టిరి. విషముతో (గరము) గూడి పుట్టిన బాలుఁడుగాన సగరుఁడాయెను. సగరుఁడు చక్రవర్తియై ప్రజానురంజకముగా రాజ్యమేలుచుగొప్పకీర్తిఁబడసెను. ఔర్వమునీంద్రు నుపదేశమున నాతఁడు పెక్కశ్వమేధములు చేయుచు నొకయజ్ఞమున గుఱ్ఱమును విడిచెను. ఇంద్రుఁడా గుఱ్ఱము హరించి పాతాళమున తపస్సుచేయుచున్న కపిలమహాముని ప్రక్కను విడిచెను. తండ్రి యాజ్ఞపై సగరునికొడుకు లఱువదివేలమంది గుఱ్ఱము వెదకఁ బయలుదేరి, యెందును గానక, భూతలమును త్రవ్వి, పాతాళమున కపిలుని చెంతనున్న యశ్వమును గనుఁ

గాని. మునియే గుఱ్ఱపు దొంగయని యెంచి నాయుధములతో నాతనిని దాకిరి. కపిలుఁడు నేత్రములు తెరచి చూడఁగా వారెల్లరును భస్మమై రాసిగా గూలిరి.

సగరునకు వేఱొక భార్యయందు అసమంజసుఁడను పుత్రుఁడు గలఁడు. అతని కుమారుఁ డంశుమంతుఁ డనువాఁడు సగరు పంపున నంశుమంతుఁడు గుఱ్ఱమును వెదక బయలువెడలి తుదకు కపిలమహాముని చెంతఁ జేరి, విష్ణురూపునిగా కపిలుని స్తుతించెను. ఆతఁడు తన తండ్రుల వృత్తాంత మెత్తక గుఱ్ఱమును విడువుమని యడుగక మ్రొక్కి నిలువఁబడెను. కపిలుఁడు భస్మరాసులు చూపి, గుఱ్ఱము గొని పొమ్మనియు, పితరుల భస్మరాసులపై గంగాజలము ప్రవహించిన శుభమగుననియుఁ దెలిపెను. అంత నాయంశుమంతుఁడు హయమును గొనివచ్చి సగరునకిచ్చెను. సగరుఁ డశ్వముతో యజ్ఞము పూర్తిచేసె, అంశుమంతునికి రాజ్యమిచ్చి తానుత్తమగతికేగెను.

(బి) భగీరథుఁడు గంగ నవతరింపఁజేయుట—

పితృతర్పణము కొఱకు గంగను దెచ్చుటకు అడవికిఁబోయి తపము చేయఁజాలక అంశుమంతుఁడు చనిపోయెను. అతనికొడుకు దిలీపుఁడుకూడ గంగకొఱకు తపము చేసియు తేలేక చనిపోయెను. దిలీపునికొడుకు భగీరథుఁడు మహాతపస్సు చేసి గంగాదేవిని గాంచి, నమస్కరించెను. ఆమె వరము వేడుమనఁగా, తన పితరుల భస్మరాసులపైఁ బ్రవహించి వారికి స్వర్గము గలుగఁ జేయుమని విన్నవించెను. గంగ తాను భూమికిఁ బడినచో భూమి తన్ను నిల్పఁజాలదనియు, భూభేదనము జరిగి తాను పాతాళమునకుఁబోవలసివచ్చుననియు, తనలో మునిఁగిన మానవుల పాపములు తన్ను బొందును గాన వానినెట్లు నాశము నొందింతునా యని విచారించుచుంటిననియుఁ దెల్పెను. అంత భగీరథుఁడు అతల్లీ, పరతత్త్వజ్ఞులు గంగాజలస్నానము చేయుచుండఁగా, నరుల పాపములు గంగనంటవనియు, సమస్తపాపక్షయకరుఁడగు విష్ణువు వారి హృదయములనుండఁగా పాపములు గంగను బొందవనియు, గంగను వహించుటకు శివుఁడు దక్క ఒరులు సమర్థులుగారు గాన నాతని వేడెదననియుఁ దెల్పెను. భగీరథుఁడు శివునిగూర్చి వెంటనే ఘోరతప మొనర్చి యాతని మెప్పించి, శివుడు తన శిరమున గంగను దాల్చునట్లు చేసెను. గంగ సగరపుత్త్రుల భస్మరాసులపైఁ బాఱెను. సగరపుత్త్రులు స్వర్గము నొందిరి.

ఇట్లు సగరపుత్త్రులతో నారంభించిన యత్నము కొన్నితరములు గడచి, భగీరథుని తీవ్రయత్నముచేఁగాని సంపూర్ణము కాలేదు. భగీరథ ప్రయత్నమన్నది లోకములో సామెతయైనది. భగీరథుఁడు వంశతారకుఁ డగుటయేగాక త్రిలోక పావనియగు గంగను భూలోకమునకుఁ దెచ్చిన పుణ్యము గట్టుకొనెను. అందుచే భగీరథ విజయమను పేర భాగమునకుఁ దగియున్నది.

2 ఈ క్రింది వాక్యములకు లఘువ్యాఖ్య వ్రాయుఁడు.

(1) సాధులం దపసుల గాసిల్బెట్టినీ మదస్ఫూర్తాత్ముల

నిల్వనేర్తురే.

గ్రంథకర్త చెప్పినమాటలివి కపిలుని బాధింప నెంచి సగరపుత్త్రులు గూలిన సందర్భములోనిది. నేర్తురే= నేర్తురా? నేర్చుదురే.

వ్యా॥ వి:— క్రియాపదముల యందు 'చు+దు' లకు 'తు' ఆగమముగానగు.

(2) మహాసురంత సుజన ద్రోహానలం బారుచే.

గ్రంథకర్త చెప్పినమాటలు : భగీరథుఁడు శివుని మెప్పించి గంగను వహించుట కాతని నొప్పించుటచే గంగ భూమి కవతరించెను. ఆ జలస్పర్శచే సగర పుత్రులు స్వర్గమునొందిరి. అరువదివేలమంది సగర పుత్త్రులను దరింపఁజేసినదిగంగ. నాఁటినుండియు లోకుల పాపములను హరించుచున్నది.

(పైవాని భావసందర్భముల సాపద్యముల టీకల సాధారణముగా వివరణ చేయదగును.)

3. 'హరి పాదాంభోజనితమైన నది' ఇందలి పురాణగాధను దెలుపునది.

విష్ణువు వామనావతారమున విజృంభించి తన పాదముచే నాకాశమును గప్పివైచెను. అప్పుడు బ్రహ్మ తన కమండలోదకముచే నాతని పాదము కడిగెను. ఆ కడిగిన జలమే గంగానదియై ప్రవహించెను. ఇట్లు గంగానది హరి పాదాంభోజనితమైనది.

—ɩ—

ప్రాంతము వాఁడగు రెండవ ప్రతాపరుద్రుని యొక్క సైన్యాధ్యక్షుఁడగు సాహిణి మారునికి రామాయణములోని చాలభాగము అంకితము గావించెను. కొన్నిభాగములను బూరించిన కవు లాయాభాగముల నితనికే కృతియిచ్చిరి. హుళక్కిభాస్కరుఁడు అరణ్యకాండమును యుద్ధకాండములోఁ గొంతభాగమును రచించెను. ఈతని పుత్త్రుఁడగు మల్లికార్జునభట్టు బాల, కిష్కింధా, సుందరకాండములను రాజకుమారుఁడుఁ దనకు శిష్యుఁడునగు కుమారరుద్రదేవుఁడు అయోధ్యాకాండమును మిత్త్రుఁడగు అయ్యలార్యుఁడు యుద్ధకాండములోని చివరభాగమును రచించిరి.

భారతభాగవతములవలెనే ఈభాస్కరరామాయణముగూడ నాంధ్రదేశమున బహుళప్రచారము నొందియున్నది. పురాణపఠనమున కిది చాల అనువుగనున్నది. సంస్కృతవాల్మీకిరామాయణము సులభముగానుండి పర్వదినములందు పురాణకాలక్షేపమునకు చాల వీలుగ నుండుటచే భాస్కరరామాయణముకంటె వాల్మీకి రామాయణమే యెక్కువ ప్రచారములో నున్నది. భాస్కరరామాయణ కవిత్వము ప్రౌఢముగను రసవంతముగను నున్నది. సంస్కృతపదభూయిష్ఠముగ నున్నది. పెక్కండ్రు కవులచేఁ గూర్పఁబడుటచే శైలిలో నేకత్వముండదు.

కథాసందర్భము:—

వృద్ధుఁడగు దశరథమహారాజు జ్యేష్ఠపుత్త్రుఁడగు రామునియందు రాజ్యభారముంచఁదలఁచి పట్టాభిషేకోత్సవప్రయత్నము జరిపించుచుండెను. ఆసమయమునఁ గైక మంథరదుర్బోధచేఁ గుటిలాత్మయై రాజును జేరి, తనకాతఁడు రెండువరములం దీర్చవలసియున్నదని గుర్తుచేసి, అందొకట రాము నడవికిఁ బంపుట, ఒకటి భరతునకు బట్టముగట్టుట జరుగవలెనని కోరెను. దశరథుఁ డదివిన్నంతనే మూర్ఛపడి కొంతవడికిఁ దెలివొంది దుఃఖించుచుండెను. రామునకీ విషయము తెలిసినది. వెంటనే యాతఁడు తండ్రిసత్యంబు పాలింప సీతాలక్ష్మణసహితుఁడై యడవికేగెను.

సీతారామలక్ష్మణుల వనగమనముచే నడలి దశరథుఁడు విలపించి విలపించి మరణించెను. రాజమరణమునకు రాజపత్నులును ప్రజలును నడలిరి. రాజు చనిపోవునప్పటికి భరతశత్రుఘ్నులు పురమున లేరు. వారు భరతుని మేనమామయగు కేకయరాజు నింటనుండిరి. వారికడకు వార్తాహరులను బంపి వారి నయోధ్యకు రావించిరి.

అర్థములు:—

1. సర్వజన, సమ్మతిన్=జనులందఱి యంగీకారముతో, కాల+ఉచితంబు (గుణసంధి)=అప్పటికిఁ దగినది, తైలపక్వంబు+చేయించి=ప్రాణముపోఁగా దేహము కుళ్ళిపోకుండునట్లు దానిని తైలమునందు భద్రపఱచుట (ప్రాచీనకాలమును, గూడమృతదేహములను భద్రపఱచువిధానము తెలిసియుండిరి) గిరివ్రజపురము=భరతుని మేనమామ రాజధాని, నియోగించినన్=నియమింపఁగా, దుస్+స్వప్నంబుల్=చెడుకలను

సుహృజ్జనులు=మిత్రులు, భరతుఁడు చెడ్డకలలు గని వానిని మిత్రులకుఁ జెప్పుచుం డెను. (ఉపాయనంబులు=కానుకలు, మహాకార్యంబు=అగత్యమైనపని. దశరథుఁడు చనిపోయినవార్త భరతునికిఁ దెల్పలేదు.) విచ్చేయవలయు=దయచేయవలెను. విన్న వింపఁగా=మనవిచేయఁగా, ఆ+తెఱంగు=ఆవిధమును, నర+ఇంద్రున్=(గుణసంధి)= రాజును, వీడ్కొని=పోయివచ్చెదనని చెప్పి, కదలి=బయలుదేరి, సప్తరాత్రంబులకు= ఏడురాత్రులకు, అంతిపురంబు+చొత్తెరన్ (గసడదవాదేశము)=రాణివాసపుస్త్రీ లుండు ప్రదేశము చేరఁగా, ఆలింగనము=కౌఁగిలింత, పుత్తెంచిరన్=నియమింపఁగా; అమంగళ+ఆకృతంబులు= అశుభస్థితులతోఁగూడుకొన్నవి, శూన్యంబై=కళాకాం తులు లేనిదై, నాదంబులు=ధ్వనులు, వీతేరవు=వచ్చుటలేదు ? కలంగెడున్=కలఁత బొందుచున్నది, భద్రంబులు=శుభములు, చేరినపుడు ఆగుగు మొదలగు వాని సువర్ణ మునకును, చొచ్చు, పుచ్చు, మున్నగువాని చువర్ణమునకును లోపము విభాషనగు. వీతేరు, చొచ్చు+తేరు=

2. వసుమతీపతి=దశరథ మహారాజు, ఒకటన్=ఒక వరముచేత, పట్టంబున్= పట్టాభిషేకము, విపినవాసము=అడవులలో నివసించుట, జానకీ లక్ష్మణ సహి తుఁడు=సీతతోడను లక్ష్మణునితోడను గూడినవాఁడు, మృతుఁడు=చనిపోయిన వాఁడు; పుత్త్రశోకంబున=కుమారునివలన దుఃఖముచే, భూవిభుండు=రాజు (దశర థుఁడు) నిష్ఠురంబులు=పరుషములు.

3. కనుఁగవన్=రెండుకన్నులనుండి, కనలుచున్=కోపపడుచు, కాంతారము నకు=అడవికి.

4. జట+అజినముల్=జడలు, చర్మములును, పుడమిన్+భరించి=భూమిని దాల్చి (రాజ్యమును బాలించి), భోగములు=సౌఖ్యములు, పొందన్+కలానశే=అను భవింపఁగలవాఁడవా ? ఇట్టి చొప్పులు=ఇటువంటిరీతులు, ఏ+ఎడన్=ఎండైనను, కలవు=ఉన్నవా ? ఏమి తెఱంగున=ఏవిధముగా, పాపము+కడుపునన్= (నీదగు) పాడు కడుపునుండి. భువన గర్హిత=లోకపు నిందకు, పాత్రుఁడన్+ఐతిన్=స్థాన మైతిని, రాక్షసీ=క్రూరాత్మురాలా !

వ్యా. వి:—పద్యము 4:—(i)పొందఁగలవాఁడను - ఉన్న - కల - సువర్ణకంబుల మీఁదితచ్ఛబ్దవకారమునకు లోపంబు విభాషనగు. పొందఁగలాఁడను. ("పొందఁ గలాను"అనునది లక్షణ సాధ్యము కాదు). (2) పాపము+కడుపు - కర్మధార యంబులందు మువర్ణకంబునకు పు-ంపు లగును. పాపపు+కడుపు-సమాసములం దుదంతస్త్రీ సమంబులకును, పు-ంపు లకును బరుష సరళములు పరమగునపుడు నుగాగమంబగును. పాపపున్+కడుపు (ద్రుతసంధి) పాపపుం గడుపు.

5. చిత్తవృత్తిని=మనోవ్యాపారమును (ఉద్దేశమును) చరితమున్=నడవడికను, ద్రోహింగాన్=కీడు చేయువానినిగా, నీచమతి=పాపపుబుద్ధిగలదానా! ఎగ్గు+చేసితివి=కీడు చేసితివి, ఓచెల్ల=అయ్యో, రఘుపతికిన్=రామునకు, నొచ్చెనో=బాధపడియుండును గాఁబోలు!

6. సుమిత్రాపుత్త్రుఁడు=లక్ష్మణుఁడు, చేతులు=కీళ్లు, పుట్టన్+పోలున్=పుట్టియుండవచ్చును, కేకయరాజ, బీజంబు+ఇంతకున్+ఏల+తొడంగెన్=కేకయరాజు సంతానమైనచో నిట్టి క్రూరకార్యమునకు ఎట్లు పూనును? పతిహంత్రివి=భర్తను జంపినదానవు, వాకిటన్=వాకిలియందు, అంతఃపురకాంతలు=రాణివాసపు స్త్రీలు; దుర్మంత్రంబునన్=చెడ్డఆలోచన (సలహా) చెప్పుటచే, ఆనర్థంబులు=కీళ్లు, వాటిల్లెన్=కలిగెను, అనవుడున్=అనఁగా, రోష+ఆవిష్టుండు=తీవ్రమైనకోపము చేఁబడలు తెలియనివాఁడు, సెలుచన్=శీఘ్రముగా, పడన్+తాచి=పడునట్లు తన్ని, కేలన్=చేతితో, కడకాలు+పట్టి=కాలి చివరభాగము పట్టుకొని, చిఱ్ఱచిఱ్ఱన్=తీవ్రముగా, నేలతో+వ్రేసి=నేలమీఁద పడవేసి అని అర్థము, ఖడ్గంబు=కత్తి, తిగిచి=లాగి, ఆంకించుచు=జళిపించుచు, ఈ+దురాత్మురాలిన్=ఈ పాపాత్మురాలిని, కకవన్+కవిసినన్=కైకను సమీపింపఁగా, తత్+పరిచారికలు+పాఱి=ఆమెయొక్క సేవకురాండ్రు పాఱిపోయి, మఱువు+చొచ్చి=చాటును చేరి, మాతృహంతలు=తల్లిని జంపినవారు, పుణ్యహీన=పుణ్యములేనిది, దురితంబున=పాపముచేత, అరహంబు=తగినది, అలుకవారించి, కోపము తొలఁగించి, అనుజసహితంబుగా=తమ్ముఁడగు శత్రుఘ్నునితోఁగూడ, రోదనంబు+చేయుటయు=ఏడ్చుటయు, ఆ+అగ్రసవిత్రియున్=ఆ పెద్దతల్లియు (కౌసల్యయు)

---

6 (1) దురాత్మ+ఆలు-కర్మధారయంబునం దత్సమ శబ్దంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబునకుత్వంబును రుగాగమంబునగు. దురాత్మురాలు. (2) మఱువు+చొచ్చిరి, మొగంబు+చూడఁడు, చేతులు+పుట్టె, కాలు+పట్టి (గసడదవాదేశ సంధులు) మఱువు సొచ్చిరి. మొగంబు సూడఁడు. చేతులు వుట్టె. కాలువట్టె. (3) ఆ+అగ్రసవిత్రి - (యడాగమసంధి) - సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగును. ఆ+యగ్రసవిత్రి (త్రికసంధి)- త్రికంబులాఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు, ఆ+య్యగ్ర సవిత్రి. ద్విరుక్తమగు హల్లుపరంబగునపుడాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. అయ్యగ్ర సవిత్రి. (4) ఆ+పలుకులు, ఈ + దురాత్మురాలు (త్రికసంధులు) అప్పలుకులు, ఇద్దురాత్మురాలు.

7. మీతల్లి+పతిన్+బందె+పట్టె=కైక భర్తను బందీగాఁ బట్టుకొని; తద్వియోగమున=రాముని యెడబాటుచే, గత+అసుఁడు = ప్రాణములు పోయినవాఁడు నృపుఁడు, నేల=భూమిని (రాజ్యమును) ఏలు=పాలింపుము.

7. అనవుడున్=అనఁగ, నొచ్చి=బాధనొంది, రామునకు ద్రోహింపనైతి నేని=రామునెడ ద్రోహబుద్ధి కలవాఁడ నైనచో, అభిషేకతంత్రికిన్, అడ్డు+పడితి నేని=పట్టాభిషేకము పొందుటకు నేనాటంకపఱచిన యెడల, కపట — సద్వ్రతప్రకాశ + ఎఱిఁగితి నేని=పన్నుగడను ముందుగా తెలిసికొంటి నేని, విప్రుని+చంపినవాని గతికిన్=బ్రహ్మహత్య చేసినవాఁడు పొందు దుర్గతికి, గురు=అంగనా (గురుపత్నీ) గామిగతికిన్=గురుభార్యతో పొందు చేసినవాఁడు పోవునట్టి పొందుగతికి, సువర్ణ+అపహరణము=బంగారము దొంగిలించుట, (స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, ఇవి చేయువారి తోడిసహవాసము ఇవి పంచమహాపాతకములనఁబడును.) భండనమునన్+ఓడి=యుద్ధమునందోడిపోయి, పంద=పిఱికివాఁడు, కడిఁదిశపథము=తీవ్రమైన ప్రతిజ్ఞ. భూజల+అంబర+అనల+అర్క+, శశులు= భూమి, నీరు, గాలి, ఆకాశము, అగ్ని, సూర్యుఁడు, చంద్రుఁడును.

9. పృథివి+ఆది, మహాభూతంబులు=భూమి మొదలగు పంచమహాభూతములును; ఎలుంగులన్+చెలంగెన్=ధ్వనులు వ్యాపించెను, సంకుల=గందరగోళమైన, ఆక్రందనంబులు=ఏడ్పులు, వారిన్+వారించి=కౌసల్యాసుమిత్రలను అడ్డుపెట్టి, వసుంధరన్=భూమిమీఁద, ఎలుంగెత్తి=గొంతెత్తి, రాజకుంజర=రాజశ్రేష్ఠుఁడా! (కుంజరము=ఏనుఁగు), దివాకర+అన్వయ=సూర్యవంశమునెడి, రత్నాకర=సముద్రమునకు, సుధాకర=చంద్రునివంటివాఁడా! పుత్తెంచి=పంపివేసి, భూషణ+అంబరంబులు= నగలును వస్త్రములును, సంభాషా+అర్హుండవు=మాటలాడఁదగినవాఁడును, ధరిత్రిన్=భూమిమీఁద, ధూళి, ధూసరిత=దుమ్ముచేత బూడిదవన్నెగాఁ జేయఁబడిన, అంగుండవై=శరీరముగలవాఁడవై, లీలన్=విలాసముగా, కేలన్=చేతితో, సమ్మార్జనంబు+చేయు వేళ=ఎందుచేత తుడుచువు? పలవించి=మిక్కిలి ప్రలాపించి.

---

7. (1) బందె+పట్టె (గసడదవాదేశము) బందెవట్టె. (2) ఏలు+ము-హలవసానంబులు పరంబగునపుడు మధ్యమ పురుష మువర్ణమునకు లోపంబు విభాషనగు. ఏలు.

8. (1) గురు+అంగన (యణాదేశసంధి) - ఇ ఉ ఋ ౡ ల కసవర్ణమైన యచ్చు పరమగునపుడు క్రమముగా య్,వ్,ర్,ల్ అనున వాదేశమగును. గుర్వంగన.
(2) నా+కడిఁది - ఏ - నా - తన శబ్దముల కుత్తరపదము పరంబగునపుడు దుగాగమంబగును. నాదు కడిఁది.

పలుకునట్లు మాటాడుచున్నావేమి ? నీమాట లేమని వినఁగలను. 'ఆఁడురాత్రించరియగు కైకకొడుకు వీఁడు' అనుసంతకు, నామనస్సెంతేగి నాయందు మఱియొక తప్పున్నచో చెప్పుము.

14. పుణ్యగుణ+అభిరామున్=పవిత్రమైన గుణములచే మనోహరుఁడైనవానిని రామున్, ఎలమిన్=ప్రీతితో, ప్రార్థించి, తోడ్తెచ్చి=పిలుచుకొనివచ్చి, దిక్+సీమ+అతిక్రమణ=దిక్కులహద్దులను మీఱునట్టి, క్షమా+ఓచ్చు గల, అన్వయ+అసత్+కీర్తుల్=వంశముయొక్క ప్రకాశమానమైన, కీర్తులు, వెలుఁగొందన్=ప్రకాశించుచుండ, ఉద్దామ+శ్రీకిన్=మిక్కిలి గొప్పదైన సంపదకు, అభిషిక్తున్ పట్టాభిషేకము నందు వానినిఁగ, చేయుదుఁగా, రఘు+ఉత్తంసంబు (సవర్ణదీర్ఘసంధి)=రఘువంశశ్రేష్ఠుఁడు (రాముఁడు) రాకున్నన్=రాకపోయినచో, ఆభూమీశ+అగ్రణిన్=ఆరాజశ్రేష్ఠుని, కొల్చి=సేవించి, తపోవేషినై=మునివేషముగలవాఁడనై, అటవీభూమిన్ నిల్తున్=అరణ్యప్రదేశమునం దుండిపోయెదను.

15. సభాసదుల=సభలోని పెద్దలు, శిరఃకంపంబు = ఆశ్చర్యసూచకముగా తలయూపుట.

16. మాతలు, మూఁడ్రున్=తల్లులగు కౌసల్యకైక సుమిత్రలు ముగ్గురును, పార్థివులున్=రాజులును, పురోహిత వ్రాతము=పురోహితుల సమూహమును, తోడన్+రాన్=వెంటవచ్చుచుండఁగా, గజ+అశ్వ=ఏనుఁగులతోడను, గుఱ్ఱములతోను ఆతత=విస్తారమైన, సర్వసైన్యయుతుఁడై=సైన్యము అన్నిటితో కూడినవాఁడై ఏగుదెంచి=వచ్చి, గంగా+తటీ+తటిన్=గంగానది యొడ్డున, విడియఁగా+కాన్=విడియఁగా, భరతుండు+అనువార్త మ్రోసిన=భరతుఁడు వచ్చెనను వార్త వ్యాపింపఁగా.

17. సంభ్రమంబునన్ = వేగిరపాటుతో.

18. అంత సేయుండక=తనతల్లి కైకేయి చేసినది చాలిపోయినదికనుక, అంతటి క్రూరకార్యముతో నిలిచియుండక, ఇట్లు=ఈరీతిగా, ఆ రాజపరమేశు పైన్=ఆరాముని మీఁద, పాపచింతన్, ఎత్తిపోయెడిన్=దుర్బుద్ధితో దండెత్తిపోవుచున్నాఁడు, అనుబుద్ధిన్=అనెడితలంపుతో, తనసైన్యము=గుహునిసైన్యము, ఆయితమైయుండన్+కావించి=సిద్ధమైయుండునట్లు చేసి, రేవులుకట్టన్+పనిచి=నదిదాటెడిత్రోవ రేవులన్నియు అరికట్టియుండునట్లు తనసేవకుల నియోగించి, తండ్రిపనుపు సెప్పన్=తండ్రియాజ్ఞ నిర్వర్తించుటకు, ఇంత సేయ నాతఁడేమి+చేసె=నీవింత క్రూరకార్యము చేయుటకు రాముఁడేమి దోషము చేసెను ?

14. రఘు+ఉత్తంసంబు, భూమీ+ఈశ+అగ్రణి (సవర్ణదీర్ఘసంధులు) —అ—ఇ—ఉ—ఋ అను సవర్ణము పరంబగునపుడు సవర్ణదీర్ఘ మేకాదేశమగును. రఘూత్తంసంబు భూమీశాగ్రణి.

19. ఇమ్ముల౯=వీలుగా, కిట్టి=సమీపించి, ఈ మునతోడన్=ఈసేనతో.

తా. రాముఁడు తమ్మునితోఁగూడి నిస్పృహుఁడై యడవిలోఁ దాపస వృత్తి నుండఁగా నీ వాతనిని పట్టి చంపఁబోవుచున్నాడవు. నీవునీచురాలగు కైకకుఁ బుట్టినవాఁడవే గదా! మతినీ యాలోచన మాత్రము నీచము గాకయెట్లుండును. ఐన నీగుహుఁడీ సేనతో నిన్నట్లు పోవిమువఁడు సుమీ.

20. నీసేన, విరిగిపోవన్+కన్=చెదరిపోవునట్లు, అసురగతిన్=క్రూరముగా (రాక్షసరీతిని) నెత్తురువఱదల=రక్త ప్రవాహములు, [illegible] = వ్యాపింపఁగా, [illegible]=విల్లెయిుక [illegible]=పెద్దదైనచేయు [illegible], అభ్రములవ=మేఘమునందె, పటుగా+ఆసారము+మాపెనన్=తీవ్రమైన బాణములయొక్క జడివానను జూపెదను.

అలం :— నెత్తురు వఱదలుగను. బాణములు జడివానగను, విల్లు మేఘముగను రూపింపఁబడుటచే రూపకాలంకారము.

21. నేను సమసిన వెనుక చనిపోయిన మీఁదటగాని నీవు ఈయేటిని దాటఁజాలవు. అని కోపముతో గుహుఁడు దెల్పెను. భరతుఁడా మాటలు విని (సస్మిత+ఆస్యుఁడు) నవ్వుతోఁగూడిన ముఖముగలవాఁడగుచు "ఓయెఱుక రాజా! రాముని పట్టాభిషిక్తుని గావించుటకై పిలువనేగుచున్నాను గాని ద్రోహబుద్ధితోఁ గాఁదని పలికెను.

22. విడిసిన, ఇంగుదీతరువును = బసచేసియున్న గారచెట్టును, పర్ణతల్పంబును=ఆకులతో నమర్చిన ప్రక్కను, విలపించుచున్=ఏడ్చుచు, పదంపడి=పిమ్మట, తరంగిణి=నది, ఆ+కిరాతపతిచే=ఆయెఱుక జేనిచే (గుహునిచే), తాపస+ఉత్తముండు=మునిశ్రేష్ఠుఁడు.

23. పాపాత్మ=నీచుఁడా! రాముఁడు, క్షోణీరాజ్యమున్=భూరాజ్యమును నీకు, ఇచ్చి, మునియై, ఘోర+అటవీ; వాటిన్=భయంకరమగు అరణ్యప్రదేశమున, అక్షీణశాంతి=గొప్పయోర్పు, వహించియుండఁగన్=పూనియుండఁగా, నీవు,ఇట్లు, మహత్+సేనా సమేతుండవై=గొప్పసేనతోఁ గూడినవాఁడై, ప్రాణద్రోహము+చేయన్+ఏగెదవు+ఒకో=ప్రాణహాని చేయుటకు వెళ్ళుచున్నావా! అజగత్+త్రాణుండు=లోకరక్షకుఁడగు ఆరాముఁడు. అల్పుఁడె = తక్కువవాఁడా? కైక, తల్లి, అఁట=(రాము నడవికిఁబంపి పతిప్రాణములు హరించిన క్రూరురాలగు) కైక నీకుఁ దల్లిగదా! నీవు= (అట్టి కైక కుమారుఁడవైన) నీవు, నిందన్+పొందన్=నిందపడుటకు, ఓడుదే=జంకెదవా!

---

23. ఓడుదు+ఏ-భూతతద్ధర్మార్థక క్రియల మధ్యమపురుషైకవచనములోపంబు విభాషనగు. ఓడుదే,

బల+ఆకీర్ణంబు=రథ, గజ, తురగ, పదాతులను నాలుగు విధములతో కలిసిపోయియున్న, ఏర్పడన్+పరికించి=స్పష్టముగా చూచి.

27. తరణికుల=సూర్యవంశము వారికి, ప్రధాన=ముఖ్యమైనట్టి, విరుదధ్వజ సంతతిన్=చిహ్నములైన జెండాల సమూహములను, చూచి, సేనతో, భరతుఁడు, దాడి+పెట్టి=దండు వెడలి, తమున్=సీతారాములను అత్యుగ్రుఁడులను, పట్టన్+వచ్చుటఁ గాన్+తలంచి=చెరపట్టుటకై వచ్చుచున్నట్లుగా భావించి, అత్యుగ్రుఁడు, నిష్ఠుర గతిన్=తీవ్రమైనరీతిగా, ఘన+చుంబి=మేఘములను ముద్దుపెట్టుకొనుచున్న, మహీరుహశాఖనుండి=చెట్టుకొమ్మనుండి, అ+గిరి+అగ్రంబునన్=ఆచిత్రకూట పర్వతము ప్రద్దలగునట్లుగా, పవిశ=వజ్రాయుధమువలె, అతత=విస్తారమైన, పాతము+అనన్=దెబ్బయేమో యనునట్లు, డిగ్గన్+ఉఱికెన్=క్రిందకు దుమికెను.

అలం:—అత్యుగ్రుఁడు దుముకుట వజ్రపాతముగా నూహించుటచే నిదియుత్ప్రేక్షాలంకార మగును.

28. బాణాసన+సన్నద్ధుండవు=వింటితో సిద్ధమైయున్నవాఁడవు, వైదేహిన్=సీతను, గిరిగహ్వర+అంతరంబునకు=కొండగుహలోపలికి, నెరింపన్=సహింపను, వినయశూన్యుండవు=వినయములేనివాఁడవు, నీచ+ఉక్తులు=నీచపుమాటలు, చిత్తవృత్తి=మనస్సుయొక్కరీతి. సంభ్రమంబు+ఉడుగుము=తొందరమానుము. వెఱచి=భయపడి, అజ్ఞ=అవనతు+వదనుండు=సిగ్గుచేతవంచబడిన ముఖముగలవాఁడు.

29. పాదచారియై=(భరతుఁడు) కాలినడకను వచ్చుచున్నవాఁడై, పర్ణశాలన్=ఆకులతో నిర్మించు గుడిసెను, విపుల, శోకమునన్=విస్తారమైన దుఃఖముచే, తనదు హృదయము=తనమనస్సు. ఎరియమునన్+ఉండగన్=మండుచుండఁగా.

30. మహనీయ=గొప్ప, మణిమయ, మందిరంబులన్=మణులతోఁ జేయఁబడిన యిండ్లలో; మేను=ఒత్తు=శరీరము ఒత్తుకొని పోవుచున్నదనుకొనునంతటి సున్నితమైన, సుఖి=సుఖవంతుఁడు. దర్భశయ్యన్=దర్భగడ్డితో నమర్చిన సజ్జపై, తనువు=శరీరమును, లలిత=మృదువైన, మాల్యంబులు=పూలదండలు, అలిల్=క్రమముగా, పూను, పతి=ధరించునట్టి ప్రభువు, వలను+ఒప్పన్=ఒకరీతిగా (వేర్పుగా) మృదుల+అంబరంబులన్=సున్నితమైన వస్త్రములతో, మెఱయు=ప్రకాశించెడు, పుణ్యుఁడు=నిర్మలుఁడు, వల్కలములు=నారబట్టలు, కోరి రాజన్య...ఇతర రాజులు కోరి. తన్నుకొలువవలెనని యుండుస్థితిమాని (రాజమౌళిమణి=రాజులలో శ్రేష్ఠుఁడు తానే మునులను సేవింపవలసినవాఁడాయెను. కైక కడుపునఁ బుట్టుటచే నాకీదుర వస్థఁ జూడవలసిన గతిపట్టినది.

---

28. అ+ఉత్తముని (యడాగమ - త్రికసంధులు) ఆయ్యుత్తముని.

29. తన+హృదయము - నీ - నా - తన శబ్దముల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబగులు. తనదు హృదయము.

31. తత్+అంఘ్రి+పురోభాగంబున=రాముని పాదముల యెదుట, అనుజ సమేతుండై = తమ్ముఁడగు శత్రుఘ్నునితోఁగూడినవాఁడై, దండప్రణామంబు+చేసిన=కఱ్ఱవలెపడి నమస్కారము చేయఁగా, కుమారయుగళంబుల్=భరతశత్రుఘ్నుల నిద్దఱను, పట్టి+ఎత్తి=లేవనెత్తి, అక్కున్+చేర్చి=తన రొమ్మునకుఁ జేర్చుకొని, ఆలింగనము+చేసి=కౌఁగిలించి, పదంపడి=పిమ్మట.

32. భరతశత్రుఘ్నులు తగువిధమున సీతాలక్ష్మణులకు నమస్కరించి దర్భాసనములపైఁ గూర్చుండిరి. రాముఁడు వారిని జూచి దశరథ మహారాజునకు క్షేమమే గదా యని యడిగెను.

33. డగ్గు+ఉత్తిక=గద్గదస్వరము, భవత్+వియోగ+శోక+ఆతురుండయి=నీయెడబాటువలని దుఃఖముచే బాధనొందినవాఁడై, రాజు పరలోకమున కేగెను. (చనిపోయెను) అని శత్రుఘ్నుఁడు చెప్పెను. అశనిపాత, ఘోషంబు=పిడుగుదెబ్బ యొక్క ధ్వని, కరపదము=వినికిడి (చెవిత్రోవ), మూర్ఛాపరవశుఁడు = సొమ్మసిల్లి పోయినవాఁడు, సౌమిత్రి=సుమిత్రానందనుఁడగు లక్ష్మణుఁడు.

34. నర+ఈశ్వరా=రాజా! ప్రాకృతునట్లు=అజ్ఞానివలె, తాల్మి=ఓర్పు, ప్రయ్యన్+కన్=చెదరిపోఁగా, శోక+ఆతురతన్=దుఃఖమువలని బాధను పొందక, స్థిరతన్=గట్టిగానుండు భావముచే, నీవు పితృదేవతల ఋణమును దీర్పవలెను (తిలోదక దానాది విధులు చేయవలెను.)

35. మందాకినియందు=గంగానదియందు, బదరీఫల మిశ్రితంబులు = రేగు పండ్లతోఁగూడినవి. ఇంగుదీయ పిణ్యాకంబులన్=గారకాయల పిండిముద్దలచే, కృత కృత్యతన్=నెఱవేఱిన ప్రయోజనము కలిగియుండుటను, ఆశ్రయులు=చేరియున్నవారు, శోకంబులు=విచారములు, వారించిరి=తొలఁగించిరి. మాతలన్=తల్లులను, వసుధాపుత్రీ సమేతుండు=సీతాదేవితోఁ గూడినవాఁడు, సవిత్రుల. అడుగులన్=తల్లుల పాదములపై, దెసలు+అద్రువన్=దిక్కులు చలించునట్లు, యతుల ధృతులు=మునుల ధైర్యములు, ఆ+శలోదరితో=ఆసీతతో, దురంత దుఃఖంబులన్=అంతులేని దుఃఖములతో, పొగులుచున్న=కుములుచున్న.

36. అబల=స్త్రీ(సీత), విపత్+భాజనమైనది=ఆపదలకు చోటైనది.

అలం:—ఈపద్యమున అర్థాంతరన్యాసము గలదు. జనకసంతతివాఁడు తండ్రి దశరథమహారాజు, శ్రీరాముఁడు భర్తయైయుండియు సీత ఆపదలకు స్థాన

34. ప్రాకృతు+అట్లు అనునది సమాసమునందు దుకార ఋకారముల కచ్చు పరమగు నప్పుడు నుగాగమంబగును. ప్రాకృతునట్లు.

షమనది, అను విశేషవాక్యమును, దైవగతి కసాధ్యములేదు అను సామాన్యవాక్యముచే సమర్థించెను గాన అర్థాంతరన్యాసము.

37. పాపజాతి=పాపపుపుట్టుకకలది. ఈవనితారత్నము=స్త్రీలలో శ్రేష్ఠురాలగు సీతను, వనవాస+ఆయాసము=అరణ్యవాసముకలని శ్రమ.

38. అనంతరంబు=పిమ్మట, శోకంబు+ఉడిగి=విచారముమాని, చిత్రకూట+అచల, వాసులు చిత్రకూటపర్వతము నివాసముగాఁగలవారు, యథా+ఉచిత+ఆసనంబులన్=వారివారికిఁ దగిన పీఠములమీఁద, కొలువుండిరి = సభదీరియుండిరి. అవలోకించి=చూచి, కేలుమొగిచి=చేతులుజోడించి (నమస్కరించి).

39. పార్థివ=రాజుయొక్క మందుచేతి బలముచేఁగాని, అట్లుకానిచో, ఆదిశేషుఁడను ఒక్కపాము భూమిని మోయఁగలుగునా (ఆదిశేషుఁడు భూమిని మోయుట, రాజుయొక్క బలముచేతనే, రాజుయొక్క ఆజ్ఞచేత సముద్రము భూమిమీఁదికి చొచ్చుకొనివచ్చుటలేదుగాని, చెలియలికట్టయను సముద్రపుగట్టు భూమికంతను శిరస్సుచే ధరింపఁదగు ఆజ్ఞ దాటిదగునా? రాజుయొక్క పరిపాలనబలముచేగాని, వర్ణధర్మములు క్రమముగా నిలుచుట కాధారము వేదములు కాఁగలవా? ఈశు=రాజుయొక్క, తీవ్ర, తేజో దీపదీప్తిన్ కాక=తీక్ష్ణమైన పరాక్రమపు దీపముయొక్క కాంతిచేఁగాని, ఈలోకమునను, ఇతరస్సులా వెలుంగు=సూర్యకిరణముల కాంతి యా వెలుగు నొసఁగునవి ? గొడుగువిఱిగినన్=రాజుయొక్క పరిపాలనాలక్షణమగు గొడుగు విఱిగినచో, ధారుణి=భూమి, కూలిపోవును, అబ్ధి మేరదప్పున్=సముద్రము హద్దుమీఱును, వర్ణాశ్రమాచారములు చెడును, అంతట దిక్కులందోప వండఁబోవును. అట్లు కావుంచునన్లు, భూరిధారుణీభారంబు=గొప్పదగురాజ్యభారము పూనుము.

40. దేవ=ప్రభూ! కైకేయి ద్రోహముచేయఁదలఁచి నీచమగునిందకు (రోయక) అసహ్యపడక నిన్నడవికిఁ బొమ్మనినది. ఆమె యట్లన్నంతమాత్రముననే నీ వడవికేగుట ధర్మమా? ఇట్టి (తెంపు) సాహసముచేయుట తగునా? పురమునకు దయచేయుము.

---

37. ఈ+పాపజాతి, ఈ+వనిత, ఈ+వనవాసము – (త్రికసంధులు)–ఇప్పాపజాతి, ఇవ్వనిత, ఇవ్వనవాసము.

39. (1) ముందు+చేయి–సమాసములందు ప్రాతిపాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు, ము+చేయి–లుప్తశేషంబునకు పరుషంబులు పరంబగునపుడు నుగాగమంబగు. ముఙ్+చేయి (ద్రుతకార్యములు) ముంజేయి. (2) దిక్+మూర్ధము (అనునాసికసంధి)–అనునాసికాక్షరములకు పరుషములు పరమగునపుడు సవర్ణానునాసికములు వికల్పము గావచ్చును, దిఙ్మూర్ధము.

41. ధరణీంద్ర=భూనాయకా (రాజా)! ఏను=నేను, నీ+అగు, రాజ్యలక్ష్మిన్=నీసంబంధమగు రాజ్యసంపదను. ధరింపఁజాలక=తాల్పలేక, నిత్య+ఉదాత్త సంపదల్=ఎల్లప్పుడును వృద్ధిపొందుచున్న సిరులు. పాదలుచుండన్=అతిశయించుచుండఁగా, ప్రజా, పరిపాలన, క్రియా+ఆపాదనశీలతో=ప్రజలను పాలించుటయను వ్యాపారమును వహించు కౌతూహలముతో, భువన, భారము. భూనగక=భూమియొక్క బరువును మోయుటకు, ఏఁగుదెమ్ము=రమ్ము, అటుగాక, తక్కినన్=అట్లుకానియెడల, అయోధ్యాపురత్వము=అయోధ్యానగరమునకు భర్తయౌట (ప్రభువగుట), అన్యులకు=ఇతరులకు, అర్హము=తగినది. కాదు.

42. ప్రాయోపవేశంబు = ఆహారాదులుమాని దేహము కృశింపఁజేసికొని ప్రాణములు విడుచుటయను, దర్భ+ఆస్తరణ, శాయి=దర్భలపాన్పుమీఁదఁబండుకొన్నవాఁడు, ఆ+నర+ఇంద్రుఁడు=ప్రభువగు ఆ శ్రీరామచంద్రుఁడు, చలంబు+ఊనుము=పట్టుదలమానుము. అనవుడున్ = అనిపలుకఁగా, అనాగతవృత్తాంతంబు=ముందుజరుగవలసినచరిత్రమును, చింతా+ఆక్రాంతుఁడు=విచారముతో నిండినవాఁడు.

43. భరతుఁడు, భక్తియుక్తిన్=భక్తితోడ, నిన్ను, ప్రార్థన+చేయుచున్, ఉన్నవాఁడు, నీవు, అరయఁగన్=ఆలోచింపఁగా, భక్తవత్సలుఁడవు=భక్తులయందు ప్రేమగలవాఁడవు, అట్లు, అగుటన్=అగుటచే, కృపతోడన్=దయతో, మేదినీభరమున్=భూభారమును (రాజ్యభారమును), భరింపక=భరించుటను, నీ తోడుగు పాదుకలు=నీవు తాల్చునట్టి పావకోళ్ళు, అనతియిమ్ము=అనుగ్రహింపుము, నావుడున్=అనిపలుకగా, రఘుప్రవరుండు=రఘువంశశ్రేష్ఠుఁడగు రాముఁడు, గురువచనంబు, మీఱక=గురువుగారిమాట యతిక్రమింపక, అటు+చేసి=అవిధముగాఁ బావుకోళ్ళనిచ్చి, తమ్మునిన్, పంపెను.

44. ప్రియము+అడరఁగన్ = ప్రేమ వ్యాపించునట్లు. వీడుకొలిపెన్ = (రాముఁడు భరతుని) పోయిరమ్మనిపంపెను. అప్పుడు, మదిన్=మనస్సునందు, రామచంద్రు, నిశ్చయము, తెఱంగు=రాముని (దృఢమైన) నిశ్చయముయొక్క విధము, ఎఱిఁగి=తెలిసి, రఘు సత్తము చిత్తము = రఘువంశ శ్రేష్ఠుఁడగు రాముని మనస్సు, నొచ్చున్+అంచున్=బాధపడునని తలఁచుచు, తాన్=ఆభరతుఁడు, భయమునన్=భయముచే, ఒత్తి=నొక్కి, ఒండు+ఒకటి=మఱియొకమాట, పల్కక, సానుజుఁడై=తమ్ముఁడగు శత్రుఘ్నునితోఁగూడినవాఁడై, దివాకర+అన్వయ పతికిన్=సూర్యవంశప్రభుఁడగు రామునకు, ప్రదక్షిణము వచ్చి=కుడినుండి యెడమకు ముమ్మారు చుట్టు తిరిగి, భక్తితో, నమస్కృతి+చేసి= నమస్కారము చేసి.

---

42. దశరథు+అట్టి షష్ఠీ సమాసమున ఉకార ఋకారములకు అచ్చుపరమగునపుడు నుగాగమంబగును. దశరథునట్టి.

45. వీడుకొని=పోవననుజ్ఞవడసి, మస్తకంబున=తలమీఁద, ఇరుకెలంకుల౯=రెండు ప్రక్కలందు, ఛత్ర, చామరంబులు = గొడుగు, వింజామరములును, పుచ్చి=పంపించి, మూలబలంబు=ముఖ్యమైన సైన్యమును, నగరికాపు+పెట్టించి=పట్టణముయొక్క రక్షణమున నేర్పఱచి, రామశూన్యము= రాముఁడు లేనిది. రోసి=అసహ్యించి.

46. గుణసుందరుఁడు=మంచిగుణములచే సుందరమైనవాఁడగు, భరతుండు, అగ్రజు శాసనంబున౯=అన్న యాజ్ఞచే, అఖిలనృపాలలోకము=సమస్తమైన రాజుల సముదాయము, అరుదు+అంద౯=ఆశ్చర్యపడునట్లును, నిజ+అన్వయ, కీర్తి చంద్రికల్=తనవంశపుఁగీర్తి యనెడు వెన్నెలను, నిఖిలము=లోకమంతను, కప్పి, ఒప్ప౯=ప్రకాశించునట్లును, నయ నిర్భరత౯=నిండైననీతితో, పాదుకాముఖమున౯=రాముని పావకోళ్ళ ద్వారా, రాజ్యభారము=రాజ్యముయొక్క బరువు, సముజ్జ్వల భంగి౯=మిక్కిలి ప్రకాశించువిధమున, వెలుంగ౯=ఒప్పుచుండునట్లు, భూప్రజాసుఖములు=భూమియందలి ప్రజలకు సౌఖ్యములను, ఒనర్చుచుండె౯=కలిగించుచుండెను.

## ప్రశ్నోత్తరములు

### 1. పాదుకా పట్టాభిషేక వృత్తాంతమును వివరింపుఁడు.

కైక తన పుత్త్రునికి రాజ్యపట్టము కట్టింపఁగోరి, పుత్త్ర ప్రేమాంధయై యుక్తాయుక్త విచారణశూన్యయై, వరములు వేఁడి, రామ నిర్వాసమునకును దశరథ మరణమునకు గారణభూతురాలైనది. అయోధ్యలో నీ విషయములు జరుగుచుండ భరతుఁడు దూరమున నుండుటచే నాతని కేమియుఁ దెలియదు. దూతలువచ్చి అయోధ్యకు రమ్మని చెప్పిరిగాని జరిగిన వృత్తాంతము దెలుపలేదు. భరతుఁడు కొన్ని దుస్స్వప్నములు గాంచి కలఁతపడెను. కాని యథార్థ మెఱుఁగకపోవుటచే మేనమామ యింటినుండి తెచ్చిన కానుకలఁ దల్లి కర్పించి కుశలవార్తలు దెలిపెను. పట్టణము మంగళ సూచకముగాఁ దోఁచుటచే నాతఁడు తల్లినడిగి, యామె భూనికచే రాముఁడడవి కేగుట, పుత్త్రశోకమునఁ దండ్రిమరణించుట, తెలిసికొనెను. పిడుగువంటి యావార్త విన్నంతనే యాతఁడు మూర్ఛితుఁడాయెను. అన్నయెడ భక్తియును, తల్లి చేష్టపై క్రోధమును నాతనికి తల మున్కలైనవి. తనచిత్తవృత్తి యెఱిఁగియుఁ దన్ను రాజుచేయఁదలచి నట్టిచర్యకుఁ గడంగినందుకు తల్లినిదుర్భాషలాడెను. తల్లిని రాక్షసి యనెను. ఆమె కేకయవంశమునఁ బుట్టలేదనెను. పిమ్మట కౌసల్య పాదములపైఁబడి తన యచ్ఛభావముఁ దెల్పి, రామునిపట్ల తాను ద్రోహియైనచో పంచమహాపాతకములు చేసిన పాపినగుదునని ప్రమాణవాక్యములు బల్కెను. తైలపక్వము గావింపఁ బడిన

---

45. కెలను+లు కళ్వాదులకు నుపర్ణంబు 'కు౯' అగు. బహువచనముపరంబగునపుడు నిత్యముగానగు కెలంకులు.

తండ్రి కళేబరమును గాంచి మూర్ఛపడెను. వసిష్ఠుఁ డాతని నోదార్చి, విధివిహిత పారలౌకిక క్రియ లాతనిచేఁ గావించెను.

పిమ్మట రాజ్య మరాజకముగా నుండరాదు గావ పట్టము గట్టుకొనుమని వసిష్ఠుఁడు బోధింప, తన వంశ ప్రతిష్ఠయు, తన చిత్తవృత్తియు నాలోచింపక యట్లన దగునా యని వసిష్ఠునికి మాఱాడి, రాముని వెనుకకుఁ గొనివత్తుననియు, నాతఁడు రాకున్న తాను నునడవులలో మునివృత్తి నుందుననియుఁ దన నిశ్చయమును దెల్పెను. సభాసదు లది విని యాశ్చర్యపడిరి. భరతుఁడు సేనాసమేతుఁడై తల్లులు మంత్రులు పురోహితులు మున్నగువారు వెంట వచ్చుచుండ రాముని దోడి తెచ్చుటకు బయలుదేరి గంగాతీరమున విడిచెను. కిరాతనాథుఁడగు గుహుఁ డా వార్త విని, రామునిపై దాడివెడలి వచ్చినవానినిగా భావించి క్రుద్ధుఁడై భరతుని నిందింపఁ జొచ్చెను. భరతుఁడంత తన సంకల్పము చెప్పి గుహుని శాంతుని గావించెను. పిదప భరద్వాజ మునియు నీతని దూషింపఁ దనకు ద్రోహచింత లేకుంట రూఢింగించి యాతని యనుగ్రహము వడసెను. భరతుని రాక గాంచి లక్ష్మణుఁడు క్రోధ సంభ్రమావిష్టుఁడు కాఁగా, రాముఁడు "నీచోక్తు లేల యాడెదవు. నీకంటె వాఁడు నాకు భక్తుడు" అని వానిని వారించెను. పాదచారియై భరతుఁ డన్నను జేర, మునివృత్తినున్న యన్నకు, సీతను, లక్ష్మణుని గాంచి పలుగీతుల వాపోయెను, పిమ్మట దశరథ మరణవార్త యెఱిఁగించెను మూర్ఛాపరవశుఁడై తేఱి బహు భంగుల విలపించిన యన్నకుఁ గర్తవ్యము బోధించి, పితృఋణము దీర్పవలెనని తెల్పి, గంగాతీరమున తిలోదక దానాది క్రియలు నిర్వర్తింపఁజేసెను.

పిమ్మట రాజు బలము చేతనే, యాదిశేషుఁడు భూమిని మోయుటయు, సంద్రము మేర దప్పకుండుటయు, వేదములు ధర్మవృత్తి కాధారములగుటయు, సూర్య కాంతులు లోకమునకు వెలుఁగిచ్చుటయుఁ గల్గుచున్నవని చెప్పి, క్రమస్థితి నిల్పుటకు రాజ్యభారము పూనుమని యన్నను వేడెను. కైక మాటలను బట్టి రాజ్యము పీడి పోరాదనియు, తాముఁ దేలవలపిన రాజ్య మేలుటకుఁ దా నర్హుఁడుఁ గాననియుఁ, దాను ప్రాయోపవేశము గావింతుననియు నాతఁ డన్నకుఁ జెల్పుకొనెను. రాముడు వ్రతసమాప్తినిగాని తిరిగి రాఁజాలనని తెల్పి భరతుని కోరికపైఁ దన పాదుక లాతని కిచ్చిపంపెను. ఎదురు మాటాడిన రాముని మనసు నొచ్చునని రూఢించి భరతుఁడు రామ పాదుకలతో నయోధ్యకు దిరిగివచ్చి, తన వెంట వచ్చిన మాతల నట విడిచి రామశూన్యమగు నగరున నుండుటకు నొల్లక, నంది గ్రామమును జోటికిఁ బోయి పాదుకాముఖమున రాజ్యకార్యములు నెఱపుచు నట నిల్చెను.

2. పాదుకాపట్టాభిషేకవృత్తాంతమునుబట్టి భరతుని సౌజన్యమును వివరింపుఁడు.

లోకమున నెక్కువ్యక్తులకు నెక్కువ గుణలక్షణము లుండుట సహజము. విష్ణ్వంశాసంభూతుఁడగు రాముఁడు సర్వోత్తమ గుణాన్వితుఁడు. లక్ష్మణుఁడు ఆత్మసుఖత్యాగము గావించి యన్నను సేవించెడి కార్యనిష్ఠుఁడు, శత్రుఘ్నుఁడు భరతునికి ఛాయగా దిరుగుచుండువాఁడు. ఇఁక భరతుఁడు పితరులయెడను సోదరులయెడను నపారప్రేమ గలవాఁడు, అచంచల కార్యనిష్ఠుఁడు. సౌమ్యగుణుఁడు. అవసరమును బట్టి పెద్దల మాటలు మన్నించువాఁడు.

మహాత్ములకు వారిమనస్సులే ప్రమాణమందురు. అయోధ్యయందు నడచిన యమంగళవిషయములు భరతుని మనస్సునకుఁ బొడకట్టెను. చెడుకలలు గాంచి యాతఁడు వికలతఁ జెందెను. దూతవాక్యములు విని, వెంటనే కానుకలతోఁగూడ నయోధ్యకుఁదిరిగివచ్చెను. ముందుగఁ దనతల్లికి మ్రొక్కి కానుకలిచ్చి కుశలసంభాషణములు గావించెను. అయోధ్యయందమంగళవిషయములు చూచి తల్లినడిగి తెలిసికొని, రామ నివాసమును దశరథ మరణమును విని మూర్ఛితుఁ డాయెను. రాముని యెడఁగలభక్త్యాదరములచే నాతఁడు క్రోధావిష్టుఁడై, తల్లిని రాక్షసియనియు, కేకయ రాజబీజము గాదనియు, సర్వానర్థములకును గారణభూతురాలనియు దుర్భాషలాడెను. తల్లి ననరానిమాట లనుటచే నీతఁడు క్రూరుఁడుగాఁ దోపవచ్చును. కాని కైకేయి చర్యలే యాతని నట్టివానినిగాఁ జేసెను. క్రోధవశుఁడైనను పాపపుఁ గడుపునబుట్టి లోకనిందకు పాలైతినని కుందియు, శత్రుఘ్నుఁడు మంథరను జంపఁబోగా, దాసీవధ మర్హముగాదని యాతని వారించెను.

మాతయెడ క్రూరముగఁ బ్రవర్తించినచో నన్నయగు రాముఁడు తన మొగము చూడఁడని వెఱచెను. కైకేయి పుత్రుఁడగుటచే నామె కారణమున కౌశల్యాదు లీతనిపైఁ గోపింప నీతఁడు తాను ద్రోహిని గానని ఘోరప్రమాణపూర్వకముగఁ దెల్పుకొనెను. తండ్రి శవమును గాంచి యాతఁడు గావించిన రోదనమును బట్టి యాతని యకలుషత్వము దెలియుచున్నది. విధివిహితపారలౌకిక క్రియలునిర్వర్తించి, రాజ్యము పాలింపుమని వసిష్ఠుఁడు బోధించినను తాను దురాత్మురాలగు కైకపుత్త్రుఁడననిపించుకొనఁ దలపలేదని చెప్పి, రాముని వెనకకుఁ దోడితెచ్చుటగాని, తానుగూడ నడవిలో మునివృత్తినుండుట గాని తన నిశ్చయమని వెల్లడించెను. వెంటనే తన నిశ్చయమును గార్యరూపమునఁ బెట్టుటకు సేనాయుతుఁడై యడవులకు బయలుదేరెను. శబరనాయకుఁడగు గుహుఁడీతనిపైఁ గోపింపఁ భరతుఁడు శాంతివహించి తాను ద్రోహిని

గానని తెల్పుకొనెను. భరద్వాజముని కోపమునకుగురియై భరతుఁడు తన రామభక్తిని విన్నవించుకొని భరద్వాజుని మన్ననకు బాత్రుఁడయ్యెను. భరతుని రాకగాంచి లక్ష్మణుఁ డాతని పరమద్రోహిగా శంకించి,భరతుని ప్రాణములు గొందునన్నప్పుడు "ఇట్టి నీచోక్తు లేలయాడెదవు. నీకంటె వాఁడు నాపక్షపాతుఁడు" అని రాముఁడన్న మాటలు భరతునియుత్తమశీలమునకుఁ బరమప్రమాణములు. భరతుఁడు వినయమహితుఁడై పాదచారియైయన్న పాదములకు మ్రొక్కి దశరథమరణవార్త యెఱింగించి, శోకాకులుఁడైన యన్న కోదార్పుమాటలు చెప్పెను. రాముఁడు సోదరసమేతుఁడై గంగాతీరమున తిలోదకాదివిధు లాచరించెను. కౌసల్యాదిమాతలను వసిష్ఠుఁడటకుఁ గొనివచ్చెను, ఎల్లర దుఃఖాక్రందనములు నైనపిమ్మట భరతుఁడు రాజగోపాలనా బలముచేతనే లోకము సుస్థితినుండును గాన రాజ్యమువహింపుమని యన్నను వేడెను. రాముఁడు తక్క ఇతరులు అయోధ్యనుబాలింప సమర్థులుగారని విన్నవించుకొనెను. రాముఁడు వ్రతసమాప్తినిగాని యయోధ్యకు మరలనని తెల్పి భరతుని ప్రార్థనపైఁ దనపాదుకల నిడెను. అన్నమాట కెదురుగా నొత్తిచెప్పిన నాతని మనస్సు నొచ్చునని భరతుఁ డూరకొని యన్నయాజ్ఞ శిరసావహించెను. అయోధ్యకు మరలి పురమునకుఁదగిన రక్షణములు గావించి రామపాదుకలను సింహాసనముననిల్పి తానువానికి, ప్రతినిధియై పరిపాలనా కార్యములు సాగించెను.

ఇట్లు భరతునియందు తల్లిని దుర్భాషలాడిన దోషముతక్క మిగిలినవన్నియు శ్లాఘ్యగుణములే. అతిక్రూరతచేఁ గైక నిందాపాత్రురాలైనది. తల్లిసంపాదించిపెట్టిన రాజ్యము నాతఁడు కాంక్షింపలేదు. అట్లు రాజ్యము త్యజించుట కాతని యశక్తత కారణముగాదు. అతనిస్థిరనిశ్చయమును రామభక్తియే యందుకుఁ గారణములు. అన్న యడవులలో నారచీరలు దాల్చి మునివృత్తినుండఁగా దాను రాజ్యభోగములొందఁ జాలక మునివృత్తి వహించెను. తనపైఁ గోపించిన కౌసల్య, గుహుఁడు, భరతుఁడు మొదలగువారి నందఱను శాంతిచిత్తులఁ గావించి తన క్షమాగుణము వెల్లడించెను. మాతృహంతఁడని రాముఁడు దూషించునేమోయని కైకయొడను మంథరయొడను క్రౌర్యము మానెను. అన్నకుఁ గర్తవ్యముదెల్పెనే కాని ఒత్తిచెప్పలేకపోయెను. దశరథునికిఁ బరలోకక్రియలు నిర్వర్తించి వెంటనే యడవులకు బయలుదేరెను. పాదచారియై చరించెను. రామపాదుకలతోఁ దిరిగివచ్చి యయోధ్యయందు రాజ్యరక్షణ అన్నియు నేర్పఱచి తాను నందిగ్రామమున నియమవృత్తిని జీవింప మొదలిడెను. భరతుఁడు కర్తవ్యమునుండి భయపడి పాఱిపోయినవాఁడు గాఁడు. ఇట్లు భరతుఁడుత్తమగుణశోభితుఁడుగా నీవృత్తాంతమునుబట్టి స్పష్టపడుచున్నది.

3 'రాముఁడు పుణ్యగుణాభిరాముఁడు' అను వాక్యమందలి సత్యమును నిరూపించునది.

రాముఁడు విష్ణ్వంశవలన దశరథునకుఁ గౌసల్యయందుఁగల్గిన కుమారుఁడు. దశరథుని సంతానములోఁ బెద్దవాఁడు సద్గుణములచే లోకమున నగ్రగణ్యుఁడు. పితృభక్తి, ధర్మనిష్ఠ, ఆదర్శవర్తనముఁగల మహితుఁ డాతఁడు.

రామునకు రాజ్యాభిషేకము జరుగనున్న సమయమున సవతితల్లియగు కైక వచ్చి 'రాము నడవికిఁబంపి, భరతునకుఁ బట్టముగట్టు'మని పతినిగోరినది. దశరథుఁ డందులకు వెనుఁదీయుచుండ రాముఁ డతని సత్యము పాలించుటకై సీతాలక్ష్మణ సమేతుఁడై సంతోషముతో నడవికిఁ బయన మయ్యెను. త్రోవలో గుహుఁడను బోయవాఁ డాతనిని భక్తితో సత్కరించి యోడఁబెట్టి గంగానదిని దాఁటించెను. పిమ్మట భరద్వాజుఁడను ముని సాదరముగఁ బూజించి విందొనర్చి పంపఁగా నతఁడు చిత్రకూటాద్రిఁజేరి కాలము గడుపుచుండెను. భరతుఁ డయోధ్యలోఁ దండ్రి పుత్త్రక్రియలు గావించి, యగ్రజు రాజ్యమేలుటకుఁ దానర్హుఁడు కాఁడని యెంచి, రాముని దోడితెచ్చుటకై సపరివారముగాఁ జిత్రకూటాద్రికి వచ్చెను. రాము డతని వలనఁ దండ్రి మరణవార్త విని పలువిధంబుల దుఃఖించి, తండ్రికిఁ దిలోదకాదు లొసంగి పుత్త్రధర్మము నెఱవేర్చెను. అనంతరము భరతుఁడు "న్యాయముగా నీకుఁ జెందిన రాజ్యలక్ష్మిని నేను భరింపఁజాలను, ధర్మసంరక్షణార్థము రాజ్యభారము వహించుట కయోధ్యకు మరలిరమ్మ'అని ప్రార్థింపఁగా, రాముఁడు పితృవాక్య పాలనకై తాను వ్రతసమాప్తియగు వఱ కయోధ్యకు రాఁజాలఁడని చెప్పి, వశిష్ఠు నాజ్ఞపైఁ దన పాదుకల నతనికిచ్చి పంపివేసెను.

ఇందు రాముని వర్తనమంతయు సత్యధర్మబద్ధము. పితృభక్తి పూరితమునై లోకమున కత్తమాదర్శముగా నొప్పుచున్నది. జన్మచే నగ్రజుఁడగుట రామునకే రాజ్యార్హతగలదు. అతని నడవికిఁబంపి భరతునకుఁ బట్టముకట్టుమను కైక కోరిక స్వార్థప్రేరితమైన దుష్టచర్య. కావున నామె కోర్కెను గాదని రాముఁడు పట్టము గట్టికొనుట ధర్మవిరుద్ధము కానేరదు. కాని యతఁ డట్టిపనికిఁ బూనినచోఁ దండ్రి వాక్య మసత్యమగును. తన యట్టికొడుకు తండ్రి సత్యము పాలింపనిచో వంశోన్నతి చెడుటయు, లోక మధర్మ పరమగుటయు సంభవించును. రాముఁ డింతయు నాలోచించి, రాజ్యవైభవముకంటెఁ బితృవాక్య పాలనమే ముఖ్యమని నిర్ణయించుకొనెను. దానిచేతనే యతఁడు, భరతుఁ డెంత వేఁడినను ప్రాయోపవేశము చేయుదు ననినను మనస్సు మార్చుకొనఁడయ్యెను. ఇది యాతని పితృభక్తి, ధర్మపరత, సత్య

సంఘటనల నిదర్శనమై యొప్పుచున్నది. రామునియెడ భరతాదులు చూపెడు గౌరవభావము, గుహుఁడు, భరద్వాజుఁడు మున్నగువారు చూపిన యవ్యాజభక్తియు నతని సౌజన్య మహిమాతిశయములను వెల్లడించుచున్నవి. భరతుఁడు తన్నుఁ దోడి కొని పోవచ్చినప్పుడు లక్ష్మణుఁ డతనిని విరోధిగాఁదలఁచి చంపెద నన్నప్పుడు, "నాకుఁదమ్ముండవైయుండియు నింత వినయశూన్యుండవై యిట్టి నీచోక్తు లేల యాడెదవు? నీకంటె వాఁడు నాకు భక్తుఁడు" అని రాముఁడతనిని మందలించెను. దీనివలన రాముఁ డవినయమును సహింపఁజాలఁడనియు, నితరుల భావములను జక్కఁగా గుర్తించు సూక్ష్మబుద్ధి యనియుఁ దెలియుచున్నది. భరతుని ప్రార్థనము నిరాకరించి, వ్రతసమాప్తియగు నంతకుఁ దా నయోధ్యకు రానని రాముఁ డన్నంత నే రావణవధంబు కోరుచున్న కిన్నర కింపురుషాదులు సంతసించుటంబట్టి, యతఁడు విఘ్నంకశసంభూతుఁ డనియు, రాక్షసవధంబు గావించి లోక సంరక్షణ కవతరించెననియు విదితమగుచున్నది. ఇట్టి పాదుకా పట్టాభిషేకమున వర్ణింపఁబడిన విషయములనుబట్టి 'రామఁడు పుణ్యగుణాభి రాముఁ'డని స్పష్టమగుచున్నది.

4. లక్ష్మణునికంటె భరతునకే రామునియం దెక్కుడుభక్తి గలదను విషయమును నిరూపించునది.

భరత లక్ష్మణు లిరువురును రామునకుఁ దమ్ములే. ఇరువురకును రామునియందు భక్తి గలదు, స్థూలముగాఁ జూచినచో భరతునికంటె లక్ష్మణునకే రామునియం దెక్కుడు భక్తియున్నట్లు గోచరించును. కాని రాముఁ డొకసందర్భమున లక్ష్మణు నితో 'నీకంటె వాఁడు నాకు భక్తుఁడు' అని భరతునిభక్తి నధికముగాఁ జేర్కొ నెను. సూక్ష్మముగా నాలోచించిన నావిషయము యథార్థమని విదితమగును.

లక్ష్మణుఁడు చిన్ననాటినుండియు రాము నాశ్రయించియుండెను. రాముని సేవయే తనజీవిత పరమార్థమని యతఁడెంచుకొనెను. రామునితోడి నిత్యసహ వాసముకంటె నతనికిఁ గోరఁదగిన దింకొకటిలేదు. రాముని సేవించుటయందే యతఁ డానంద మనుభవించుచుండును. కావుననే తనకు విహితము కాకున్నను లక్ష్మణుఁ డగ్రజుతో నడవికేఁగెను. రాజ్యమందుండి భోగము ననుభవించు నవ కాశము తనకున్నను గణింపక, కోరి జటావల్కలములందాల్చి పర్ణశాలావాసము చేయుచు రామునితో వనవాసక్లేశము ననుభవించుటకు సిద్ధపడెను. దీనికంతకు రాముని యందు దానికిఁగల భక్త్యతిశయమే కారణముగాని వేఱుగాదు.

భరతుఁడు లక్ష్మణునివలె రామునితోడి నిత్యసన్నిహితత్వముగలవాఁడు కాఁడు. చిన్ననాఁడె యాతఁడు శత్రుఘ్నునితోఁగూడి మాతామహునింటికేగి

యుండెఁ జెరుగుచుండెను. కాని హృదయమునం దెపుడు రామునెడ భక్తిభావము గలిగియుండెడివాఁడు. కావుననే యయాచిత లబ్ధమైన రాజ్యము నాతఁడు పాలింప నొల్లక, రాముని దోడితెచ్చుటకై యడవికేగెను. తండ్రిరాజ్యమునకు న్యాయముగా నర్హుఁడగువాఁడు రాముఁడే కాని తన కది సంక్రమించుటలో భరతుని దోషమే మియు లేదు. తనకుఁ దెలియకయే తన యభీష్టమునకు వ్యతిరేకముగాఁ దనతల్లి కైక వరమూలమున రాజ్యము పొందినది. రాముని గష్టపెట్టి రాజ్యముసంపాదించిన దోషము కైకకుఁ జెందును. లోక మామెను నిందించిన నిందింపవచ్చును. అనిందకు భరతుఁ డర్హుఁడు కాఁడు. కావున భరతుఁ డారాజ్యము గైకొని హాయిగా సుఖము ననుభవింపవచ్చును. ఇతరుఁ డగుచో నట్టి యవకాశమును విడువఁజాలఁడు. తనపైఁ ప్రేమకొలఁది రాజ్యముసంక్రమింపఁజేసిన తల్లి ననేకవిధముల సమ్మానింపఁజూచును. అయినను భరతుఁ డది యకార్యకరణమని యెంచి తల్లినిఁ జూచి "రాక్షసీ! రాముని గాంతారమునకుఁ జనుమనఁగా నోరెట్లులాడె నీకు? అతఁ డడవుల నిడుమలంపడుచుండ, నేను బుడమి భరించి భోగములు పొందఁగలనా? పాపపుఁ గడుపునఁబుట్టి నేనీ భువనగర్హకుఁ బాత్రుఁడనైతిని. రామునకు ద్రోహియగునట్లు నీవు నన్నుఁ జేసితివి" అని పెక్కువిధముల దూషించెను. శత్రుఘ్నుఁ డామెను జంపనుంకించు నప్పుడు భరతుఁ డతనిని "మన మీ పాపజాతిని జంపిన మాతృహంతలని రామచంద్రుండు మన మొంగంబులు జూడండు" అని పలికి వారించెను. రాజ్యము రాజకముగా నుండఁగూడదు గానఁ బట్టముకట్టికొనుమని వసిష్ఠుఁడనఁగా "ప్రాకృతునివలె నీవు నిట్టులాడెదవా? దురాత్మురాలగు కైకనందనుఁ డనుట తక్క నాయందు వేఱుదోషంబులేదు. నేనిప్పుడ యడవికిఁబోయి రాముని దోడ్తెత్తును. అతఁడు రాకున్న నడవిలోఁ దపోవేషినై యుండిపోయెద" నని చెప్పెను. పిమ్మట నతఁ డడవికిఁబోయి రాము నయోధ్యరమ్మని ప్రార్థించి, యతఁడు రాకున్నఁ దావచ్చుటనే ప్రాయోపవేశము చేయుదునని పలికెను. తుదకు రాముని మనంబునకుఁ గష్టము కలుగకుండుటకై యతని యాజ్ఞప్రకార మతని పాదుకలం గాని రాజ్యమునకు మరలివచ్చెను. అప్పుడును నతఁడు రామశూన్యమగు నయోధ్యలో నుండలేక నందిగ్రామంబున మునివృత్తినుండి రాజ్యపాలనము సేయఁదొడఁగెను.

ఈచర్యలన్నియు భరతునకు రామునియందుఁగల నిష్కళంకమగు భక్తిని జాటుచున్నవి. అంతియకాదు. లక్ష్మణునికంటె భరతుఁడే యెక్కుడు భక్తుఁడనియు నిరూపించుచున్నవి. లక్ష్మణుఁడు తొలుత నుండియు రామునితోడి దేశమున నమ్మి యతఁడున్నచోట నేయుండి, యతనితోపాటు కష్టసుఖము

అనుభవించుచున్నాఁడు. భరతుఁ డట్లుకాదు రామునితోడి సాహచర్య భాగ్యమతనికి లేకున్నను, నిరంతర మతనినే మనమున ధ్యానించుచుండును. తాఁబలుకు ప్రతి పలుకును, చేయుప్రతికార్యమును రామునకు హితకరమగునో కాదోయని యోజించుచుఁ దదనుకూలముగా భరతుఁడు వర్తించుచుండును. ఇట్లు త్రికరణశుద్ధిగా రాముని నమ్ముటచేతనే భరతుఁడు కన్నతల్లిని దూషించుటయు, లభించిన రాజ్యమున దపేక్షలేక మునివృత్తి నుండుటయు జరిగెను. భరతుని చిత్తవృత్తి నెఱుంగుటం బట్టియే రాముఁడు 'నీకంటె వాఁడు నాకు భక్తుఁడు' అని స్వయముగాఁ జెప్పుకొనెను.

5. రామాయణ కాలమునాఁటి సాంఘిక ధార్మికాచారములు దెల్పుఁడు.

భారతదేశము కర్మభూమి. వేదమతమున కాలవాలమైనది. ధర్మశాస్త్రములును సనాతన ధర్మములు ప్రజలు చర్యలను మాటిమాటికిని తీర్చి దిద్దుచుండుటచే నతి ప్రాచీన కాలమున నెలకొన్న సాంఘికమైనట్టియు మతసంబంధమైనట్టియు నాచారములు స్వల్పభేదములతో నేఁటికిని గానవచ్చుచున్నవి.

దుస్స్వప్నములు గాంచినప్పుడు కుటుంబమున కేదో ముప్పు వాటిల్లునని నాఁడు నమ్ముచుండిరి. భరతుఁడట్టి కలలు గాంచి భయపడెను. రాజాంతఃపురములు ఈర్ష్యాద్వేషములకు గురియగుచుండెడివి. రాజులు పెక్కండ్రుభార్యలను పెండ్లాడుచుండిరి. వేలువేలు భార్యల మనః ప్రవృత్తులు వేర్వేఱుగా నుండుటచే రాజులు బాధల పాలగుచుండిరి. అంతఃపుర కల్లోలముచేతనే దశరథుఁడు ప్రాణములు వీడవలసివచ్చెను. మంధరవంటి అంతఃపుర పరిచారికలకు రాణులపై నెంతయో పలుకుబడి యుండెడిది. మంధర దుర్మంత్రము లేనిచో కైకేయి యింత దుష్కృత్యము కొడిగట్టెడిది గాదనవచ్చును.

ఏదైన తీవ్ర శపథము చేయవలసివచ్చినపుడు పృథివ్యాది పంచభూతములు సాక్షులుగా ప్రమాణములు చేసెడివారు. బ్రహ్మహత్య, గురుభార్యాగమనము, కల్లు ద్రాగుట, సువర్ణాపహరణము మొదలగు మహాపాతకములకు వెఱచుచుండిరి. భరతుఁడు తన ద్రోహ రాహిత్యమును దెల్పుట కిట్టి ప్రమాణము గావించెను.

రాజులు మొదలగువారు చనిపోయినప్పుడు, బంధువుల రాకకొఱకును, పారలౌకిక విధుల ప్రారంభము కొఱకును, రాజశవములను తైలపక్వము గావించి భద్రపఱచు నాచార ముండెడిది. భరతుఁడు వచ్చువఱకును దశరథుని శరీర మిట్లు భద్రపఱుపఁబడెను. దహనసంస్కారముకొఱకు శవము నలంకరించి [illegible]

పోయెడివారు. పారలౌకిక క్రియలు ఆచారవిధులను బట్టి జరుగుచుండెడివి. గోమహిష గజాశ్వాది దానములు జరుగుచుండెను. మృత్తికాస్నానములు, తిలోదకదానములును నాఁ డేర్పడినవే నేటికిని జెల్లుచున్నవి.

అడవులును మున్యాశ్రమములును రాజధానులకు సమీపమున నుండెను, రాజ్యపువార్తలు మున్యాశ్రమములలో దెలియుచుండెను. ఋషులకుఁ బ్రాభవము విశేషముగా నుండెడిది. భరతుఁడు భరద్వాజునిచే ధర్షింపఁబడి, తుదకాఋషి దీవననొందెను. గంగానది మొదలగు పుణ్యనదుల తీరములందు పారలౌకికక్రియ లాచరించుట ధర్మముగాఁదలఁపఁబడుచుండెను. భరతుఁడయోధ్యలో దశరథునికిదహనసంస్కారాదులు గావించెను. రాముఁడుగంగాతీరమున తిలోదకములిడి పిండములుపెట్టెను. వసిష్ఠుఁడు కౌసల్యాదిమాతల నటకుఁ గొనివచ్చెను. అందఱునుజేరి విలపించుచోటికి చిత్రకూటాచల వాసులగు మునీశ్వరులువచ్చి దుఃఖితుల నోదార్చిరి. ఇట్లు ఋష్యాశ్రమములుండి యందలి నివాసులు ప్రజలతో సంబంధములు గలిగియున్నట్లు తెలియుచున్నది.

రాజు రాజ్యముచేయుట వర్ణాశ్రమాచార రక్షణ కత్యవసరమై యుండెను. భరతుఁడు రాజ్యమరాజకముగాకుండ పాలనకార్యము బూనుమనఁగా రాముఁడు తన పితృవాక్యపాలన వ్రతముయొక్క ప్రాధాన్యమును వివరించెను. ప్రాయోపవేశము చేయుట యను తలంపులు రామాయణ కాలమున నుండెననుటకు భరతుని మాటలు సాక్ష్యము. వసిష్ఠాది పురోహితులకు రాజులయందు విశేషప్రాభవముండెను. వసిష్ఠుఁడు భరతునికి రామునికిని గూడఁ గర్తవ్యబోధ గావించెను. రామాయణమునుబట్టి యానాఁటి సాంఘిక ధార్మికాచారములు తెలియుచున్నవి.

6. ఈ క్రింది వాక్యములకు సందర్భ సహిత లఘువ్యాఖ్య వ్రాయుఁడు.

(1) దాసీ వధంబును నర్హంబుగాదు.

భరతుఁడు తల్లివలన దశరథ మరణాది వృత్తాంతము విని యామెను 'కేకయరాజ బీజం బింత' కేల తొడంగుననియు, నామె రాక్షసి యనియుఁ బలుతెఱంగుల దూషించెను. అట్టియెడ వెలుపలనున్న శత్రుఘ్నునకు నంతఃపుర కాంతలు మందరను జూపి, యాదాసియాయనర్థంబున కంతకును గారణమని తెల్పిరి. దానిపై శత్రుఘ్నుఁడు పట్టరాని కినుక వహించి మంథరం బడఁదన్ని దానిం ద్రుంచెదనని యత్నింపఁబోవ పరిచారికలందఱును భయపడి కౌసల్యాదేవి వెనుకకు బాఱిరి. అది చూచి భరతుఁడు శత్రుఘ్నుని వారించుచు నిట్లనెను. కైకేయిని బాధించినవార్త రాముఁడు వినినచో

నాతఁడు తమ్మును మాతృహంతలని తమ మొగములు చూడఁడనియు, దాసీవధము తగదనియుఁ, దానిని దండించిన తమకు లాభము లేదనియుఁ దెల్పెను. ఈమాటలను బట్టి భరతుని దూరదృష్టియు, ధర్మబుద్ధియు, అన్నయెడఁ గల భయభక్తులును వెల్లడి యగుచున్నవి.

(2) ఇంత సేయు నాతఁ డేమి సేసె.

సేనాసమేతుఁడై భరతుఁడు గంగాతీరమున విడియఁగా గుహుఁడు భరతుని పాపచింతకునిగాఁ భావించి యాతని దూలనాడుచు నిట్లనె. (18 పద్యము) "సమస్త రాజ్యభోగములును విడిచి, తండ్రియాజ్ఞ దీర్ప తపస్వియై రాముఁ డడవికి నేగ, నాతని నింకను నాశమొందించు దుర్బుద్ధితో సేనాసమేతుఁడవై వెడలితివా, నీవింత ద్రోహము దలపెట్టుటకు రాముఁడు నీకేయుపకారము గావించినాఁడు." ఈమాటలను బట్టి గుహుని రామభక్తియు, ధర్మబుద్ధియు వెల్లడియగును. భరతుని మనస్సు నెఱుఁగకుండుటను నెవరికైనను నిట్టి యూహయే పుట్టుట సహజము. ధర్మదృష్టిచే గుహు డిట్టి సాహసవాక్యము లాడుటకు తెగించెను. ఇంత సేయు, ఏమి సేసె,—ఇట్టి చోట్ల గ, స, డ, ద, వ. ఆదేశసంధి.........

(3) నిందంబొంద నీవో డుదే.

గుహుని వీడ్కొని భరతుఁడు సేనాసమేతుఁడై భరద్వాజముని యాశ్రమము చేరి యా మునికి మ్రొక్కఁగా యా ఋషి భరతునిపైఁ గోపించి యిట్లనెను. "భూరాజ్యమును [illegible] రాముఁడు గొప్పరాయిడులను వహించి యడవులకుఁ బోఁగా నీవు పాపాత్ముఁడవై, లోకంతకుఁడగు నా రాముని వధింప నెంచి ద్రోహచింతతో సేనాసమేతుఁడవై బయలుదేరితివా! ఆ రాముఁడు అల్పుఁడా? నీ చర్య నీ జన్మమునకుఁ దగినట్లున్నది. నీవు కైక పుత్త్రుఁడవు గదా! ఆ పాపాత్మురాలి పుత్త్రుఁడవగుటచే నిట్టి నింద పొందుటకైనను నీవు వెనుదీయుదువా" కైక చేసిన దుశ్చేష్టావిషయము దేశమందును మున్యాశ్రమములందునుగూడ వ్యాపించెను. జననిని బట్టి గుణములు బిడ్డలకు వచ్చుట లోక సామాన్యలక్షణము అగుటచే భరద్వాజుఁ డంతటివాఁ డిట్లనెను. ఇటఁ గని భరద్వాజుని దివ్యదృష్టిని దెల్పక సాధారణముగా లోకులకు గల్గు భావనను మాత్రమే వర్ణించెను. గుహుఁడును భరద్వాజుఁడును నిందింపఁగా భరతుఁడు తన యకలుష భావనను దెల్పుటచే భరతుని గుణప్రకటన తెలియుచున్నది. [illegible] మధ్యమపురుష [illegible] లోపించును. [illegible] సంధి విశేషము. ఓడుదే.

## (4) సీకాంతియు నిన్నింతచేసె

భరతునిసేనా కలకలమునకు వడవిమృగములుబెదరి పాఱఁదొడఁగెను. అది గాంచియు, నాదిక్కున పెద్దధూళిరేగుటయుఁగాంచి లక్ష్మణుఁ డొకయెత్తైన చెట్టెక్కి చూచి, వచ్చుచున్న సేనను గాంచెను. సూర్యవంశసూచక ధ్వజములనుబట్టి యాసేన భరతుని సేనయనియు భరతుఁడు తమపైదండెత్తి వచ్చుచుండెననియు గ్రహించెను. లక్ష్మణుఁడు క్షణకోపుఁడు. రామునికున్నంత యోర్పును దూరదృష్టియు నాతనికి లేవు. కాన నాతఁడు రాముని గిరిగుహలో రక్షణముకొఱకు దాగుకొనుమనియు రాముని యోర్పే వారి కన్నియిక్కట్టులు గలిగించెననియుఁ బల్కెను.

## (5) దైవగతి కసాధ్యము గలదే.

భరతునినోట పితృమరణ వృత్తాంతము రాముఁ డెఱిఁగి దుఃఖాతిరేకముచే నొడలు తెలియక విలపించెను. భరతునిచే బోధితుఁడై, రాముఁడనుజసమేతముగాఁ దండ్రికిఁబరలోకక్రియలాచరించెను. అన్నదమ్ముల యాక్రందనములువిని మునులును యక్షకిన్నరాదులును వారి శోకము కొంతవారించిరి. వసిష్ఠుఁడు కౌసల్యాదిమాతల నటకుఁ దోడితెచ్చెను. అందఱును బెద్దపెట్టున రోదనముసేయుఁదొడఁగిరి. ఆసమయమున నేడ్చుచున్న సీతనుజూచి గరుడ గంధర్వ కిన్నర కింపురుషాది కాంతలిట్లనిరి. "ఈసీతకు తండ్రి జనకమహారాజు, దశరథుఁడు మామ- భర్త శ్రీరాముఁడు. ఇట్టి మహామహాన్వితులు బంధువులై యుండియు నీమె యిట్టి యాపదలకు పాలుపడవలసి వచ్చినది. దైవగతి కసాధ్యమున్నదా." ఎంతటివారైనను విధినుల్లంఘింపఁజాలరను లోకసామాన్య ధర్మమునకిది నిదర్శనము. ఈసామాన్య ధర్మము దీనికిముందున్న విశేషధర్మమును సమర్థించుచున్నది గాన నిందలి యలంకారము అర్థాంతరన్యాసము.

7. ఈక్రిందిపద్యములకుఁబ్రతిపదార్థ తాత్పర్యములు వ్రాయుఁడు.
14, 23, 27, 41, 46 —
(పై పద్యము యర్థతాత్పర్యముల కాయా టీకలను జూచునది.)

8. "వసుమతీపతి రెండువరములు మును నాకు నిచ్చినయవి గావు" ఆ వరముల వృత్తాంతమును దెల్పునది.

దశరథుఁ డొకప్పు డింద్రప్రార్థితుఁడై శంబరాసురునితో యుద్ధమున కేగెను. అప్పుడు కైకయుఁ బతికిఁ దోడుగా వెళ్లెను. దశరథుఁడు యుద్ధము చేయుచుండగా రథచక్రము కీలు ఊడిపోయెను. కైక తనవ్రేలా చోటునుంచి చక్రము జాఱిపోకుండఁ గాపాడెను. దశరథుఁ డదిరెఱిఁగి మిక్కిలి సంతోషించి 'రెండు వరము లిచ్చెదను కోరుకొను'మని యామెతోఁబలికెను. కైక యప్పుడావరములను గోరక కావలసినప్పుడు కోరుకొనెదనని చెప్పెను, రాజందులకు సమ్మతించెను. (రామునిపట్టాభిషేక సందర్భమునఁ గైక యారెండు వరములను గోరుకొనెను.)

—— ) ——

# గుడిగంటలు

## (శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు)

**కవిజీవితాదులు :—**

ఆధునిక ఆంధ్రవాఙ్మయమున కవితకు విశేష ప్రచారము గావించి, సాహిత్యమును సామాన్యమానవుల సగ్గఱకు జేర్చినవారు తిరుపతి వెంకటకవులను జంటకవులు. వీరు శతావధానములు చేసి ఆంధ్రదేశమంతటను సభావిజయములు గాంచి వేలకొలది శిష్యులను సంపాదించుకొనిరి. అట్టి శిష్యులలో కాటూరి వెంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతము లొకజంట. వీరిద్దరును కలిసి రచించిన ప్రసిద్ధ కావ్యము సౌందరనందము. వీరిలో కాటూరి వెంకటేశ్వరరావుగారు తిరుపతి దేవాలయమున హరిజన ప్రవేశ సందర్భమున 1947వ సంవత్సరము మార్చి నెలలో రచించిన పద్యములు గుడిగంటలు అను పేరున వెలసినవి. ఈ పద్యములు కృష్ణాపత్రికలో మార్చి 1వ తేదీని 8వ తేదీని ప్రకటింపఁబడినవి. 'ఓస్వామీ నీ గుడిగంటల ధ్వనులు ఆకాశము నిండుచున్నవి. లోకములు మేల్కొన్నవి. హరిజనులు నీ పాదదర్శనము కాంక్షించుచున్నారు. నీ తలుపులు మూయక వీరికి దర్శనమిమ్ము'' అని స్వామిని వేడుకొను సర్థముతో నీపద్యములు రమ్యముగా నున్నవి.

**అర్థములు:—**

1. తిరుపతి తుంగశృంగ వసతీ=తిరుపతి కొండయొక్క ఎత్తయిన శిఖరము నందు వాసముగలవాఁడా! సుప్రభాత గీతరవము=శుభమైన ఉదయకాలపు పాటల ధ్వని, వినవచ్చెను. సౌఖశాయినిక, దాసజనుల్=సుఖముగా రాత్రి నిద్రపోయితివా యని సర్థమిచ్చెడు పాటలు పాడెడి పరివారపు జనులు, కరములన్=చేతులందు, కపురము+ఆరతుల్=కర్పూరపుహారతులు, తాల్చి=ధరించి, నిల్చిరి, జగమ్ములు=లోకములు (జనులు) నీ కనువిప్పు కై చెడిన్=నీవు నిద్ర మేల్కొనుటను కనిపెట్టుకొని యున్నవి పరగునన్=శీఘ్రముగా, మేలుకో=నిద్రలెమ్ము, కొలువుసాలను=సభామందిరమునందు, దర్శనము+ఇచ్చి, ఏలుకో=పాలించుకొనుము.

---

వ్యా॥ వి:...పద్యము 1:—(1) కపురము+ఆరతులు-కర్మధారయంబునందు మువర్ణకంబునకు పుం-ంపు లగును. కపురంపు+ఆరతులు-కర్మధారయంబులం దుత్తున కచ్చు పరమగునపుడు టుగాగమంబగు. కపురంపు టారతులు.

4. (ఈరు+ఏడు) ఈ రేడు లోకముల్=పదునాలుగు లోకములును, మా పాలి వేల్పు=మాకు రక్షణ మొసఁగు దైవమా! శ్రీనివాసా=లక్ష్మికి నివాసమైన వాఁడా! (లక్ష్మి విష్ణువు వక్షస్థలమున నుండును). చేదుకో=మీఁదికి లాగుకొనుము. (కొండ లెక్కు భక్తులు తమకష్టము చెల్లుకొనుచు, ఓ భగవంతుఁడా, ఎక్కించునట్టిది మాశక్తి కాదు, నీవే మమ్ము చేదుకొనుము. మీఁదికి లాగుకొనుము అనుచు, చేదుకో వెంకన్నా అని అఱచుచు తిరుపతికొండ లెక్కుదురు).

వడ్డికాసులవాఁడు=శ్రీ వెంకటేశ్వరులకు వడ్డికాసులవాఁడని పేరు. భక్తులు ఆపదలలో మ్రొక్కుకొందురు. ఆ మ్రొక్కులు కొంత కాలపరిమితిలో చెల్లించుకొందుమనియు, నట్లు మ్రొక్కుతీర్పలేనియెడల వడ్డితో చెల్లింతుమనియు మ్రొక్కుదురు. వడ్డితో చెల్లింపవలసిన ఈ ధనము కొఱకు 'వడ్డికాసులు' అను నాణెములు తిరుపతి కొండమీఁద కొందురు. మ్రొక్కుబడులవారు తమ మ్రొక్కుబడి సొమ్ములతో ఈ వడ్డికాసులను గూడ దేవుని కర్పింతురు.

అడుగడుగు దండములు - అడుగడుగునకును దండములు పెట్టుచు ఆపదలలో మ్రొక్కులు మ్రొక్కుచు భక్తులుందురు. ఆదుకొమ్ము=మాకు ఆధారమవు కమ్ము, అభయముద్ర మెఱయు=భయము లేదని తెలుపు చిహ్నముగా చేయియెత్తి బొటన వ్రేలిని తర్జనితో చేర్చి చూపువిధము ఒప్పఁగా, (తిరుమల : తిరుఅనగా శ్రీ; మల అనఁగా కొండ) తిరుమల+అయ్య శ్రీ గిరి నివాసుఁడవగు వెంకటేశ్వరా, ప్రత్యక్షముగుము.

5. తా. ఈ హరిజనులు రాచరికము (ప్రభుత్వము) కోరుటలేదు. ఆపద లందు మ్రొక్కులు మ్రొక్కి అవి తీరఁగనే మఱచిపోవువారుగారు. నీకు ఉడుగరలు (కానుకలు) ఈయఁగలేరు కోరరానికోరికలను గోరరు. వారుకోరునదెల్ల నొక్కటే. విరచిత+అంజలి మాలలు=కూర్పఁబడిన దోసిళ్ల వరుసలుగల మాలలు (పంచములు) ప్రసన్న=శరణార్థులైన, జనత=జనసమూహముయొక్క, ఆర్తి+హరమ్మును=బాధను హరించునదగు, నీ అడుగు+కవన్=అడుగుల జంటను జూడఁగోరుచున్నారు. దానిని జూడనీయవా!

6. వేదశిఖ+ అధ్వనీనము = వేదాంతములు తాను నడుచు మార్గముగాఁ గలది (వేదాంతములందు విష్ణుపాదయుగము స్తుతింపఁబడును), అరవింద సఖమ్ము= పద్మములవంటిది, అమరేంద్ర పూజితము=దేవేంద్రునిచేఁ బూజింపఁబడినది, ఆదిమ సర్గమూలము=మొదటి సృష్టికిఆధారమైనది, అఖిల+ఆశ్రిత,రక్షణ, దక్షము=సమస్తమైన ఆశ్రితులను రక్షించుటయందు సమర్థమైనది, ఐన, శ్రీపాద యుగమ్ము=నీయుభ

5. అడుగు+కవ-సమాసములందు దుదంత స్త్రీ సమములకును, పుంపు లకును పరుష సరళములు పరంబగునప్పుడు నుగాగమంబగును. అడుగున్+కవ (ద్రుతకార్య ములు) అడుగుఁగవ.

కరములు పాదముల జంట, కొలన్+కని=చూడగలుగుటకుఁ జాఁచి, పాణికలమ్ములు మోడ్చి=అర చేతులుజోడించి, ధన్యులై=కృతార్థులై, వీరు=ఈహరిజనులు, కోరుదురు. ఓ దయా+ఆలవాలా=దయకుఁ బాదైనవాఁడా! నీ గుడికి=నీ దేవాలయమునకు, వాకిళులు=గుమ్మపుఁ దలుపులు, మూయమేము.

7. తా. కొండమీఁద వెంకన్నతా న్నాడనిజనులు కొనుచుండఁగా ఈమాటలు వినుటేగాని, జయ్య=అయ్యా, నీరూపమున్ ఎఱుఁగమయ్యా, త్రిజగత్+కళ్యాణ, రమ్య+ఆకృతీ=ముల్లోకములకు శుభమైన సాకారరూప గలవాఁడా! నీవు జినదేవుఁడవో=బుద్ధదేవుఁడవో, శక్తివో, శివుఁడవో, సంపన్నుఁడవగు విష్ణువవో, కన్నులకు విందుగా నుండునట్లు కనుపించరావా.

8. దేవా! వీరు నీ యశములను పాటలపై నుంచుకొనుచు నీ గీతములే పాడుచు ఉదయమును సాయంకాలమును, నీ పేరుచెప్పి ఇంటిలో దీపముపెట్టుకొని పిటికోళ్ళు ఇడుదురు. (నమస్కారములు చేయుదురు) నేఁడు కొండపైనున్న నీ రూపమును జూడవచ్చినారు. నీశరణు కోరివచ్చిన వీరికి నీ మొగ మొక్కసారి చూపింపవా!

20. గంగానమ్మలు, పేరుసాహెబులు పెంపదలకు పోచమ్మను అమ్మవార్లను... గొంతెమ్మను కొల్చునట్టి యీ మామలకు హృదయములందు కనఁబడి, నీప్రాపుచేరన్=నీఆధారమును చేరుకొనుటకు, కొండయెక్కివచ్చిన యీశరణార్థులకు, మొగము చూపకుండ నుందువా?

9. చీఁకటి కొంపలో=ఎప్పుడును జీఁకటి యావరించియుండు గుడిసెలో, బ్రతుకు, చింకితలల్=తైల సంస్కారములు లేక చింపిరిచింపిరిగా నుండెడు జుట్టులును, మేయిన్=శరీరమున, కాటికానితి=నలుపు కాటుకలో ముంచిన నిండు నలుపుయు. పెల్లు+అకఁటికిన్=పెద్ద ఆఁకలి వేసినప్పుడు, గంజికై=కొద్దిపాటి గంజికై =ఉడకబెట్టిన చోడిపిండియు, అంబలియున్=జావమును, చటికే=చటికి, ఇంత, ఉప్పుగల్=ఉప్పుగడ్డలును, వేఁకటికి, ఇంత, చప్పిడి=తెవులుగొంటుగానున్న వేళ కొద్దిపాటి చప్పని యన్నమును, వేఁకికి=జ్వరమువచ్చినప్పటికి, పసులను=ఉపవాసములును, ఐన= కలిగిన వీరిపైన్=ఈహరిజనులపై, నీకరుణాకటాక్షరస నిస్సరణమ్ములు=నీదయతోఁగూడిన కడగంటి చూపులనెడు నీటి వెల్లువలు, పొంగి పారుతన్=ప్రవహించును గాక.

10. మాలఁడు, ఆలన్+కాచును=పశువులను కాచును, క్షీరముల్=పాలు,

---

10. మూఁడు+కారులు, మూఁడు+ప్రొద్దులు-సమానాధికరణంబగు ఉత్తర పదంబు పరంబగునపుడు మూఁడు శబ్దములోనిడు వర్ణకంబునకు లోపంబును, మీఁది హల్లునకు ద్విత్వంబును నగును. మూ+కారులు, మూ+ప్పొద్దులు-ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ముక్కారులు. ముప్పొద్దులు - ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు ముప్పొద్దు. (ప్రాయిక మనుటచే ముక్కారులనుచోట ఏకవచనము రాలేదు.)

నీపాదమ్ములు=నీచరణములను, మున్=పూర్వము(ఇంతవరకును), సోకింపదు=సోకడ లేదు, పాప, ధ్వాంత+తత్+ఉత్తమాంగములపై=పాపములనెడి చీకట్లు గ్రమ్మిన వారి శిరములపై, భద్రాయితమ్ము, ఐన=శుభప్రదమైన, నీచూపున్=నీకటాక్షము కలుగుటకూడ, మున్న=పూర్వము, వ్రాలదు=పడలేదు, అన్నా=తండ్రీ, దేవా, తదీయ+ఈక్షణాలి=వారియొక్క (ఆమాలలు యొక్క) నేత్రములు, ఆలోకన్=తృప్తి చెందఁగా, నీదామమ్ముల్=నీమాలలు, నేడుకదా=ఈరోజునకేకదా, చరితార్థతన్= కనినవి=కృతార్థతను బొందినవి, అనఁగా మాలలు తృప్తిని నిన్నుజూచుట చేతను దీనులను బ్రోచు నీదయా వీక్షణములు కృతార్థములైనవి యని భావము.

## ప్రశ్నోత్తరములు.

1. గుడిగంటలలో వర్ణింపఁబడిన హరిజనుల జీవిత స్థితిని, హరి భక్తిని వివరింపుఁడు.

ప్రభాత సమయమున శ్రీ వేంకటేశుని యాలయములో సౌఖశాయనికలు నీరాజనము లిచ్చుచు స్వామిని మేల్కొలుపుచుండిరి. బ్రాహ్మణోత్తములు ద్రవిడ ప్రబంధ గానములు సల్పుచుండిరి. హరిజనులా సమయమున దేవదర్శనాపేక్షతో వచ్చి స్వామివారి హజారపువాకిట నిలిచిరి. చీమలవలె బారులుతీరి, పక్షులవలె నెగురుచుఁ గోతులవలె దుముకుచు, మేకలవలె మోంగాళ్ళపై నెగురుచు ''ఏడుకొండలవాఁడా! వడ్డికాసులవాఁడా! యాపద మ్రొక్కులవాఁడా! వెంకట రమణా! గోవిందో, మమ్మాదుకో'' యని చేతులెత్తి మ్రొక్కుచు వారందరును గొండలెక్కి గుడికివచ్చిరి.

వారు ప్రభుత్వముకోరి స్వామికడకు రాలేదు. ఆపదలందు మ్రొక్కి సంపదలలో స్వామిని మరువరు, (కోరరాని కోర్కెలను గోరరు దేవుని పాదదర్శనమే

---

18. (1) పున్నామ+గములు-కర్మధారయంబులందు మువర్ణకంబునకు పుంపులగును. పున్నపు+గములు-సమాసములం దుదంత స్త్రీ సమంబులకును, పుంపు లకును పరుష సరళములు పరమగునపుడు నుగాగమంబగును. పున్నపున్+గములు-వర్గ యుక్సరళములు పరములగునపుడు ద్రుతమునకు పూర్ణబిందువును గానంబడియెడి పున్నపుంగములు. (2) ఈ+వారలు-త్రికంబు మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఈ+వ్వారలు-ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ఇవ్వారలు. (౩) ఈ క్షణములు+ లు, ల, నలు పరమగునపు డొకానొకచో మువర్ణకంబునకు లోపంబును, తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు. ఈక్షణాలు.

వారు మహాభాగ్యశాలురుగాఁ దలఁతురు, కొండలపై గోవిందుఁడు వేంకటేశుఁడై వెలసెనని వినియున్నారే తప్ప, వారా దేవుఁడెవ్వఁడో, యెట్లుండునో యెఱుంగరు. ఉదయ సాయంవేళలం దెప్పుడును స్వామిపాదములను ధ్యానించుచు నాతని పేరుగా నింటిలో దీపమెత్తుచు జోహారు లర్పించుచుందురు. చీఁకటి గుడిసెలలోఁ జంపిరితలలతో మెలంగుచు, నాఁకలియైనపుఁ డుప్పుకలిపిన గంజి త్రాగుచుఁ బస్తులుండి, సుఖమెఱుఁగనివారై, దేవుని కరుణా కటాక్షమును గోరి దర్శనార్థులై వారువచ్చిరి. తమ పాడిపంటలను దేవునికే యర్పింతురు. తాము పస్తులుండియైనను దేవునికి భోగములు జరిపింతురు. తాము కష్టపన్నను దేవునకు దువ్వలువలు సమర్పింతురు. తాము శీతాతపములకు గుడిసెయందున్నను స్వామికి గుడులను, గోపురములను గట్టింతురు.

ఇట్లు దుర్భర పరిస్థితు లనుభవించుచుండియు నిత్యమేమరక స్వామిని హరిజనులు సేవించుచుందురు. అంతటి భక్తులగు వారికి శ్రీవేంకటేశుండు దర్శనమిచ్చి తరింపఁ జేయుఁగాక. దేవుని పాదదర్శనము చేసికొని హరిజనులు చరితార్థులగుదురుగాక. వారిపై వేంకటేశ్వరస్వామి కరుణా కటాక్షములు ప్రసరించును గాక.

## 2. గుడిగంటలను బట్టి కవిగారి కవితారీతులు పరీక్షింపుఁడు.

గుడిగంటలు పద్యములు రచించిన వారు కాటూరి వేంకటేశ్వరరావుగారు. వీరును పింగళి లక్ష్మీకాంతముగారును జంటకవులుగా నుండి సౌందర నందమను కావ్యము రచించిరి. వీరిద్దరును తిరుపతి వేంకటకవుల శిష్యులు. తిరుపతి వేంకటకవులు శతావధానము లారంభించి, కవిత్వమున కంతకు పూర్వముండెడి కఠిన నియమములను సడలించి వచనమువలెనే పద్యములుగూడ సన్నివిషయములను వాడవచ్చునని నిరూపించిరి. ఈ యాశయములనుబట్టియే కాటూరి వేంకటేశ్వరరావుగారు గుడిగంటలు పద్యములను అతిసరళమై సులభమైన సంభాషణశైలిలో వ్రాసిరి. తిరుపతి వేంకటేశ్వర దేవుని సంబోధించి సంభాషించుచున్నట్లీ పద్యము లున్నవి.

ఆధునికకవులకు ఉత్ప్రేక్షలు అతిశయోక్తి కల్పనలు మొదలగు డొంకతిరుగుడు త్రోవ లిష్టముకాదు. వీరు సూటిగ భావములు చెప్పివేయుదురు. ఒక ప్రకృతి విషయమునుగాని సంఘటనమునుగాని చూచినపుడు వారిమనస్సులందుపుట్టిన భావములను రసవంతముగాఁ జెప్పివేయుట నేటికవుల యభిరుచి. ఈరీతులన్నియు గుడిగంటలలోఁ గాననగును.

గాంధిమహాత్ముని యసహాయోద్యమమునఁ బాల్గొననిమానవుఁడా కాలమున నుండుటరుదు. మహాత్ముని యుద్యమములోఁ బ్రధానాంగము హరిజనోద్ధరణము. హరిజనులకు దేవాలయ ప్రవేశార్హత గల్గించవఁగాని భారతీయుల కళంకము పోదని

మహాత్ముఁడెంచి దేశమందంతటను హరిజనదేవాలయ ప్రవేశోద్యమము సాగించెను. వెంకటేశ్వరరావుగారు గాంధిభక్తులు. కావున అధఃపతితులైనహరిజనులకు శ్రీవేంకటేశునిదర్శనభాగ్యము గలిగింపవలెనని యుద్బోధించుచు నీపద్యములను రచించిరి.

ఈపద్యములలో కఠిన దీర్ఘసమాసములుగాని అన్వయ కాఠిన్యముగాని లేవు. దేవుని మేలుకొమ్మని వేడుకొనుచు మొదటిపద్య మున్నది. దేవునితో సంభాషించుచు, వేంకటేశ్వరా, చీమల బారులుగావచ్చి నీపాదదర్శనము గోరుచున్న యీ హరిజనులకు నీతలుపు తీయవయ్యా, వీరుకోరెడి కోరికలు అసాధ్యములుకావు. నీకు సమస్తమైన సౌకర్యములు కూర్చుచు కూడుగుడ్డల కల్లాడిపోవుచున్న యీదీనులపై నీ దయాకటాక్షములు వెదజల్లుట ధర్మమని తెల్పు నీ పద్యములున్నవి.

ఈ కవు లాధునికులైనను ఛందో నియమములను, వ్యాకరణ నియమములను, నుల్లంఘించినవారు గారు. సరళమైన భాషలో సూటిగ పద్యములు వ్రాయుటలో వీరు శ్రమపడినట్లుగాని తీవ్రప్రయత్నము చేసినట్లుగాని యగపడదు. సహజప్రవాహ ధోరణిలో పద్యములు నడచును. వర్ణింపబడు విషయములు చిత్రము గీయఁబడినట్లు కండ్లయెదుట చూపుట నేఁటి కవుల యభిరుచి స్వభావవర్ణనము సహజముగా వీరు గావింతురు. వేలకొలఁదిగఁ గొండలెక్కిన హరిజనులను చీమలబారులుగను పక్షుల వరుసలుగను, ముందుకాళ్ళతో నెగురు మేకలుగను పోల్చుట సహజముగ నున్నది. రచనయందు జాతీయములు చొప్పించినచో కవిత్వము సహజముగఁ దోచును. చేది కోటే మమ్మ శ్రీనివాసా! వడ్డికాసులవాఁడా! అడుగడుగు దండమ్ము లాపద మ్రొక్కులవాఁడా! నీపేరుగా నింటిలో దీపంబెత్తుచు మొదలైనట్టి జాతీయములు

ఈ పద్యములందు హరిజనుల దీన దుర్భర జీవితము కన్నులకు గట్టినట్లు చిత్రింపఁబడినది. చీఁకటికొంపలో బ్రతుకు......., ఆలు గాచును......... తిన్నావో పస్తులేయున్నావో మొదలగు పద్యములిట్టి వర్ణనములుగలవి. ఈపద్యము లందలి భావములను పతితుల హృదయముల నూపివేయఁ జాలినవిగానున్నవి. ఆడు కొమ్మింతచేయిచ్చి చేదుకొమ్ము, అడుగవచ్చిన గుడిమారి గడియవైచి కూరుచుంటివి కొండెక్కి గొప్పదొరవు. మొదలైన భావములు సరళముగనుండి సామాన్య సంభాషణా ధోరణిలో నున్నవి.

అన్వయము విషయమున వచనమువలెనే సులభముగ నున్నను పద్యముల కుండెడి మాధుర్యమును, రసనిర్భరత్వమును నీపద్యములయం దినుమడించుచున్నది. ఆధునిక కవితాలక్షణము లిట్టిందు గాంచనగును.

౬. ఈక్రింది పద్యముల కర్థము వ్రాయుఁడు.

1, 6, 9, 13,

(పైపద్యముల యర్థముల కాయా టీకలను జూచుకొనునది)

—o—

# కుంతీకుమారి

## (శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి)

కుంతీకుమారియను పద్యగుచ్ఛము శ్రీజంధ్యాల పాపయ్యశాస్త్రిగారు రచించిన 'ఉదయశ్రీ' యను ఖండకావ్య సంపుటిలోనిది. పాపయ్యశాస్త్రిగారు ఆధునిక కవులలోఁ బ్రసిద్ధులు. వీరు కరుణరసమును మధురముగను, లలితముగను, పఠితల హృదయములను వెన్నవలె మెత్తపఱచునట్లుగను సుకుమార పదబంధములతోఁ గవిత చెప్పఁగల కవితాశిల్పులు.

ఆధునిక కవులు ఆత్మాశ్రయ కవితాప్రియులు. పౌరాణికమో చారిత్రకమో యగు చిన్నకథాభాగమును గ్రహించి యాధునికులొక ప్రత్యేకసన్నివేశముపై తమ భావపరంపరలను బరుగెత్తింతురు. కవి ఊహాకల్పనా ప్రధానుఁడై శబ్దచిత్రణము గావించి తాను నిర్మించిన చిత్రణముతో పఠితల హృదయములను తన్మయము గావించును. తాను వర్ణించు పాత్రతోను నా సందర్భముతోను గవి యైకాత్మ్యానుసంధానమును బొందినఁగాని కవిత యంత సహజముగను భావస్ఫోరకముగను వ్రాయలేఁడు. ఒకవేళ వ్రాసినను పఠితల హృదయములను దన భావజగత్తులో లీనము చేసికొనలేఁడు. ఆధునిక కవులిట్టి భావచిత్రణమునందు దిట్టలు, ఈ యాధునిక లక్షణములన్నియు పాపయ్యశాస్త్రిగారిలోఁ బుంజీభూతమై యున్నవి.

శ్రీశాస్త్రిగారికి కరుణరసము అభిమానరసము. అర్జునుఁడు, భీముఁడు, ద్రౌపది మొదలగువారి భావములు మాటలలో చెప్పించునపుడు వీరరౌద్రరసములను బ్రదర్శించినను, కరుణాపూరితమగు లలితభావ పరంపరలను జాలువారించుట వీరికిష్టమని పొడకట్టును. ఈ కథాభాగము కుంతి కన్యగానున్నప్పుడు సూర్యవరమున తాను గనిన కర్ణకుమారుని, లోకాపవాదభీతిచే గంగాప్రవాహమం దొక పేటికలో విడిచివేయుటకు సంబంధించినది. ఇది చాల కరుణామయమగు సన్నివేశము, దీనిని గైకొని పాపయ్యశాస్త్రిగారు తమహృదయమందు పొటమరించిన భావములను రమ్యముగఁ జిత్రించి యాధునిక కవితారీతికి వన్నె దెచ్చిరి. వీరిపద్యములు, గ్రామఫోనులందు స్థాపితములై దేశమునం దెల్లెడల మాఱుమ్రోగుచున్నవి, ఇందు భాషాకాఠిన్య ముండదు. భావములు సూటిగనుండును.

### భారతమునందలి కుంతీచరిత్రము:—

యాదవకులమున శూరుఁడను రాజుండెను. ఆతని పుత్రికలలోఁ బెద్దది పృథ. ఈమె యన్న వసుదేవుఁడు. శూరుని మేనత్త కొమారుఁడు కుంతిభోజుఁ డపుత్రకుఁడు

అందుచే శూరసేనుఁడు పృథను కుంతిభోజునకుఁ గూఁతురుగా నిచ్చెను. కుంతిభోజునిచేఁ బెంచఁబడుటచే నీబాలిక కుంతి యనఁబరఁగెను.

కుంతి తన తండ్రియింటికివచ్చు నతిథ్యభ్యాగతులకు సపర్యలు చేయుచుండ నొకనాఁడు దుర్వాసుఁడను ముని యటకువచ్చి యామెచే నభ్యర్చితుండై, "ఈమంత్రముచే నీవే వేల్పునైన నారాధించిన నావేల్పు నీవు కోరినట్టి పుత్రుల నిచ్చు"నని మంత్రోపదేశము చేసిపోయెను. ఆ మంత్రశక్తి యెఱుంగఁగోరి కుంతి యొకనాఁడు సూర్యున కర్ఘ్యమెత్తి "నీయట్టికొడుకు ననుగ్రహింపుము" అని వేఁడెను. వెంటనే సూర్యుఁడు తన తీక్ష్ణత్వము మాని, తరుణకాంతితోఁ గుంతికిఁ బ్రత్యక్షమాయెను. కుంతి బెదరిపోయెను. కాని సూర్యుఁ డామెకు ధైర్యము చెప్పి యామె కోరిన వరమిచ్చితి ననెను. కుంతి యెఱుఁగక యిట్టిపని చేసితిననియు, క్షమించుమనియుఁ, దనకుఁ బుత్రుఁడు గలిగిన సంఘములోఁ దన ప్రతిష్ఠ పాడు గావలసివచ్చుననియు మనవిచేసికొనెను. సూర్యుఁడంతయు నెఱుఁగుదుననియు, దనదర్శనము వృథ గాదనియు, నామెకు సద్యోగర్భమునఁ దనయంశమునఁ బుత్రకుఁడుద్భవిల్లుననియు నందుచే నామె కన్యాత్వము దూషితము గాదనియు వరమిచ్చి వెడలిపోయెను.

అంత కుంతికి సూర్యవంశమున, సహజ కవచకుండలుఁడై శిశు వుద్భవించెను. కన్యకపుత్రుఁడుగాన నీతఁడు కానీనుఁడనబరగెను. పుత్రోత్పత్తిచే కుంతి బెదరిపోయి, బంధుగులు తనపై నిట్టినింద మోపుదురోయని దిగులొంది. సూర్యతేజుఁడగు బాలుని ద్రోచిపుచ్చఁజాలక దుఃఖించుచున్న సమయమున గంగాప్రవాహమున నొకపెట్టె కొట్టుకొని వచ్చుచుండెను. కుంతి సూర్యు ననుగ్రహమున నది వచ్చెననుకొనుచు బాలుని వీడలేక దుఃఖించుచు తుదకా బాలుని పెట్టెలోనుంచి ప్రవాహములో విడిచిపుచ్చెను. ఈసమయమున కుంతి హృదయమున నుద్భవిల్లిన భావములను పాపయ్యశాస్త్రిగారు రతిసుకుమారముగఁ జిత్రించిరి.

## అర్థతాత్పర్యాదులు:—

1. ఒక యింపైన పూలతోటలో నొక మేడగలదు. ఆమేడయందలి మూఁడు మూలగదియొక్క తలుపు తీసికొని మెల్లగా నెవరికి దెలియకుండ పదునైదేండ్ల యీడుగల యొకకన్య చూడఁగా రాచకన్యవలెఁ దోఁచును. బెదరుచు కాళ్ళు తడబడుచు మెట్లక్రిందుగా దిగివచ్చుచున్నది.

విశే:—ఈపద్యమందలి పదరచనచే కవియొక లేవడుకన్యను మన కండ్లయెదుటఁ బెట్టెను. కథాకథన పద్ధతిని కుంతీకన్య రహస్యముగాఁ దనబిడ్డను నదిలో విడుచుటకు మెట్లుదిగి వచ్చుచున్నదని చెప్పివేయక, నవలారచనాపద్ధతిని హఠాత్తుగఁ బాత్రను మనకండ్లయెదుటఁ బెట్టి మనయూహాకల్పనమునకు చురుకుదనమునిచ్చుట కొంగ్రొత్తరచనా పద్ధతి. దీనిచే పఠితల యుత్సుకత రేకెత్తును. ఎవరీపిల్ల ? ఎందుకు

మారుమూలగది తలుపుతీసి యొక్క తెరచే మెల్లదిగుచున్నది? ఈమెకు బెదరెందుకు? ఈమెకు బెదరెందుకు? మొదలైన ప్రశ్నలు పఠితమనమున బొడకట్టి నిరీక్షణమును కలిగించును.

2. కన్నియలాగ బాలకము, కాదుకాదు, కన్యయైనచోఁ జేతులలో శిశు వేలయుండును. ఆబిడ్డడీమె కేమౌనో, ఈమె లక్షణములా బిడ్డయుం దచ్చుగ్రుద్దినట్లున్నవి. తప్పక ఆబిడ్డ డీమె బిడ్డఁడే యై యుండవలెను.

విశే:— ఇట్టి భావముల యూగిసలాట చూచువానిమనమున బయలుదేరును. ఈతలంపుల యూగిసలాటకు సరిపోవునట్లుగనే పదముల కూర్పునుగలదు. కన్నియ లాగ బాలకము కన్పడుచున్నది. కాదుకాదు... మొదలైన రచనము ఎంతయులలిత ముగను, భావ పరివర్తనానుగుణముగనునున్నది. ఈపద్యములలో చిన్నవాక్యములు చిట్టిపొట్టి పదములతో అన్వయకాఠిన్యము లేక, సంభాషణా శైలిలో నడచుచున్నవి. ఇది వైదర్భీరీతి యనఁబడును. పద్యముల పాకము ద్రాక్షాపాకము. లోపలను వెలుపలను రసముచిప్పిలుచున్నది. సుకుమారత, ప్రసాదము, మధురత, సమత, మొదలగు కావ్యగుణము లింగుస్ఫుటముగ నున్నవి.

3. ఆమె నేత్రములనుండి కన్నీటిబొట్లు జాతి బిడ్డనిఅద్దములవంటి చెక్కిళ్ల మీఁదఁ బడుచున్నవి. చక్కని ముద్దులబిడ్డనిజూచి యానందపు కన్నీళ్లు గార్చుచున్నదా? ఏదైన బెదురుచే దుఃఖపు కన్నీళ్లు గార్చుచున్నదా?

విశే:— కవియొక్క మాటుగ చెప్పివేయక కొంతసేపు పఠితల నూహించుకో నిచ్చి చెప్పవలసిన సమయము వచ్చినప్పుడు మెల్లగ రహస్యము బయలుపెట్టును.

---

వ్యా॥ వి. 3:—(1) బాష్పము+లు, నేత్రము+లు—లు-ల-నలు పరంబగునపుడొకానొకచో మువర్ణంబునకు లోపంబును, దాని పూర్వ స్వరంబునకు లోపంబును విభాషనగు. భాష్పాలు, నేత్రాలు. (2) చెక్కు+అద్దాలు-కర్మధారయంబులం దుత్తునకచ్చు పరమగునపుడు టుగాగమంబగు. చెక్కుటద్దాలు.

4:—(1) వజ్రము+కవచము-కర్మధారయములందు మువర్ణకంబునకు పుంపు లగును. వజ్రపు+కవచము—సమాసములం దుదంత స్త్రీసమంబులకును, పుంపులకును పరుషసరళములు పరమగునపుడు నుగాగమంబగును. వజ్రపున్+కవచము (ద్రుత కార్యములు) వజ్రపుంగవచము. (2) నెత్తురు+అందు-(మీఁది సూత్రముచే నుగాగమము, పిమ్మట ద్రుతకార్యములు వచ్చును). నెత్తురుఁగందు. (3) నెఱ+చెలి- అన్యంబులకు సైతము ఈ కార్యంబులు (లోపనుగాగమములు లేక లోపద్విత్వములు) కొండొకచోఁ గానంబడియెడి. నెచ్చెలి

పెద్దల యనుమతి లేక, సూర్యుని యనుగ్రహముచే తాను గర్భమున గనిన బిడ్డను, లోకనిందకు వెఱచి కుంతికన్య నదీప్రవాహమున విడువఁ బోవుచున్నది. బిడ్డని విడువ లేక యామె యేడ్చుచున్నది. యీయేడ్పు రహస్యమే. బహిరంగముగ నేడ్చుట కైనఁ గుంతి కధికారము లేదాయె.

4. పొత్తిగుడ్డలలో బిడ్డఁడున్నాడు. వానికిపుట్టినప్పుడే చెవులకున్ వజ్రకుండలములును దేహమునకు వజ్రపుఁ గవచమును నమరియున్నవి. కయిచేసినార్=అలంకరించినారు. మేల్=చక్కని, ప్రత్తడి తమ్మిమొగ్గ=బంగారపు తామరమొగ్గవంటి, జిగిబుగ్గలన్=నునుపైన బుగ్గలతో, నెత్తురుకంపున్=అప్పుడేపుట్టుటచే గర్భపు నెత్తురికంపు కడిగివేయఁబడలేదా యున్నట్టున్న శిశువును, ఎత్తుకొని కన్య యచ్చటికేగుచున్నదో కదా!

5. గాలిదెబ్బచే ఆమె జలతారు ముసుఁగు ఓసరిలినది. ఇప్పుడామె మొగము పోల్చుకొంటిమి, ఈమె కుంతిభోజుని పుత్రియగు కుంతీకుమారి. స్నిగ్ధ సుకుమారి=దట్టమై నునుపైనట్టి సౌకుమార్యము గలది.

విశే:—ఇంతవఱకును పఠితల నాశానిరీక్షణములోఁ బెట్టి, ఈమె కుంతీకుమారి యని చెప్పుట రమ్యము.

6. చెంగుచెంగున కెరటములు లుబుకుచుండ గంగానది ఆతోఁట వెంబడినే ప్రవహించుచున్నది. బుడుతన్=పిల్లవానిని, చేతులలోఁ బట్టుకొని, గద్గదికతో=దొట్రుపాటుతో ఏమేమో, వాపోవుచు-పలుకుచు, పూవువంటి శరీరముగల ఆ కుంతీకుమారికూడ గంగాతరంగముల వైపునకు వచ్చుచున్నది.

7. ముని=దుర్వాసుఁడు, ఇడెనో=ఇచ్చెనుకొందము, మార్తాండుని=సూర్యుని, కన్నియ=పెండ్లికానిపిల్ల, పట్టి=బిడ్డ.

---

6:—(1) పూవు+మేను—బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకుఁ బోఁడియగు, పూవు+పోఁడి-సమాసములందుఁ బ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు. పూ+పోఁడి-లుప్తశేషములకు పరుషములు పరంబగునపుడు నుగాగమంబగును. పూన్+పోఁడి(ద్రుతకార్యములు), పూఁబోఁడి. (2) ఈ+ఎడకు సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. ఈ+యెడకు—త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఈ+య్యెడకు - ద్విరుక్తంబగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు-ఇయ్యెడకు.

విశే:— ముని మంత్ర మొసఁగుట మొదలు, సూర్యుఁడు తనకు బిడ్డ నొసఁగుట వఱకును అన్నిఁటిని హఠాత్తుగా ఒక దానివెంట నింకొకటిగా సాగిపోవుటచే కుంతి తన సౌభాగ్యము అణఁగిపోయె ననుకొనెను.

8. ఈ కసిగందును=ఇప్పుడేకన్న బిడ్డను, గౌరవశ్రీ = మర్యాదాసంపద, జనులు, చేతులుచూపరె=చేయెత్తిచూపి నిందింపరా !

విశే:—ధిక్కారముగా చేతులు త్రిప్పుట ఆంధ్రదేశమున నాచారము. ఈ పసిపాపను నే నెచ్చట దాఁచుకొందును. ఈవిషయ మెఱిఁగినచో నన్నుఁగన్న తండ్రియు బంధువులును ఛీయని పరిహసింపరా! జనులునిందింపరా! ఈశిశువు మూలమున లోకనిందకు ఒడిగట్టితిని, దైవయోగముశిక్షపడుగదా! అని కుంతియనుకొనెను.

9. విషాదాశ్రువుల=దుఃఖమువలని కన్నీళ్ళు, ఎంతకాలమీ మేనుమోతు= ఎన్నాళ్ళు బ్రతుకఁగలను. శరీరము పెద్దబరువుగను, ప్రాణమునిల్పుకొనుట ఇష్టము లేని మోఁతవలెను. కుంతికిఁదోచెను. కలుషహారిణీ=పాపములను పోగొట్టునది. నా కన్నకడుపుతోడ=నాబిడ్డనితోఁగూడ, గంగాతల్లి కడుపులోఁ గలిసిపోవుదును,

10. పసివానిని రొమ్మునకద్దుకొని కుంతి నదిలోనికి దిగినది. అంతలో— పవనకంపిత=గాలిచేకదలింపఁబడిన, తరంగమాలికా=కెరటముల వరుసలనెడి, డోలికలన్=ఊయలలలో, తేలి తేలివచ్చు, నొక పెట్టెవంటి దామెకు కనిపించెను.

11. మందసము రాక=పెట్టెవచ్చుట, దుఃఖ+అశ్రుపూర్ణనయనములు = దుఃఖమువలనఁ గలిగిన కన్నీళ్ళతోనిండిన కన్నులు.

విశే:—పెట్టెరాకనుచూచి, కుంతి తనబిడ్డను నీటిలోవిడిచిపెట్టెదననుకొన్న తలంపుమాని, ఏవో ఆశాకిరణములు కానిపించుటచే, బిడ్డఁడు బ్రదుకు నవకాశమున్న దనుకొని, రెప్పవాల్చకుండ పెట్టెవచ్చుచున్న దిక్కునకుఁ జూచుచుండెను.

12. దూర దూరాలనుండి పోయిన ప్రాణబంధువు దగ్గఱపడుచుండునప్పటి యానంద మామెకు తనబిడ్డను బ్రతికించుటకు సాధనమైన పెట్టెదాపగుచున్నప్పుడు కలిగినది. ఆపెట్టె తనబిడ్డయంత పొడవేయుండుటవలన కుంతి మనమున నేవో యాశాభావములు పుట్టినవి.

---

9:—మోచుటను—చువర్ణంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు. మోతును.

12. దూర దూరము+ల, విధము+న—లు-ల-నలు పరంబగునపుడు డొకానొకచో మువర్ణంబునకు లోపంబును, దాని పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు. దూర దూరాల విధాన.

13. దీన+ఆలు.—కర్మధారయంబులందు తత్సమశబ్దములకు, ఆలుశబ్దము పరమగునపు డత్వమున కుత్వమును, రుగాగమంబును నగు. దీనురాలు.

15. నెఱ+తలిరాకు—అన్యంబులకు నైతమిక్కార్యంబులు (లోపనుగామములులేక లోపద్విత్వములు) కొండొకచోఁ గానంబడియెడి. నెత్తలిరాకు.

13. భువనబాంధవుఁడు= లోకములకు బంధువగు సూర్యుఁడు కన్నబిడ్డతో గంగలోఁ గలసిపోవఁబోవుచున్న తనపై జాలిఁబుట్టి కాపాడుటకై సూర్యుఁడే పెట్టె నంపెనని కుంతి భావించినది.

14. విభ్రాంత=ఏమియుఁ తోచనిది. బిడ్డనందులోఁ బెట్టి గంగలో విడువ దలఁచి కుంతి నదిలోదిగి సగము తడిసిన కోకతో పెట్టెను దరికిఁ జేర్చెను. (ఇందు కుంతి యొక్క సందేహగ్రస్తావస్థ చక్కఁగా చిత్రింపఁబడినది.)

15. నెత్తలిరాకులు= నెఱి+తలిరు+ఆకులు= నిండైన లేతయాకులు ఒత్తుగాఁ బూలగుత్తుల నెత్తుపెట్టి దానిపైఁ దనచీరకొంగును చించి మెత్తగా పరచినది. మెత్తని లేతయాకులు పెట్టి యని బిడ్డనిదేహమున కొత్తుకొనవు గదా యని చేతితోఁ దడవి చూచుకొనెను. (ఇందు కన్నతల్లి యార్ద్రహృదయము నెల్లడింపఁబడినది.)

16. బాష్పములన్= కన్నీళ్ళతో, సామి= సగము, బజ్జండబెట్టెన్= పరుండఁ జేసెను. (ఇది మాండలికపదము)

17. పసిబిడ్డని యమాయిక స్థితి యీ పద్యమునఁ జక్కఁగఁ జిత్రింపఁబడెను.

18. పెట్టెత్రోయఁబోవును వలపు నిలుపలేకపోయెను. విడుచుటకు చేయి రాదు. బిడ్డను గౌగలించి వెక్కి వెక్కి యేడ్చును. కన్నీరు గ్రుక్కుకొనును, (ఇట నెన్నియో భావములును చర్యలును చక్కఁగా వర్ణింపబడెను-స్వభావోక్తి)

19. కన్నినలుసు= అప్పుడే పుట్టి అన్నమైన తినలేని బిడ్డను బ్రతికించుకొనలేని తన భోగభాగ్యములును, గొప్పవంశమునందు పుట్టుకయు నేమి ప్రయోజనములు? (ఇందు సాధారణముగ తల్లుల యేడ్పు మాటలు సూచితములు.)

20. కన్నకడుపుయొక్క తీపి కుంతికిప్పుడు బోధపడినది. తన్ను గన్న తలిదండ్రుల ప్రేమ యెట్టిదో యీనాఁడామె కవగతమైనది. స్వానుభవముచే నిట్టివి తెలియును కాని, ఊహామాత్రముచేఁ దెలియవు. (కాళ్ళురావనుట, కన్నకడుపు తీపి ఇవి చక్కని జాతీయములు.)

21. బిడ్డని ద్రోసిపుచ్చుచు 'నా పుట్టుక మాసిపోనుఁ నినుబోలిన రత్నము నాకు దక్కునే' అని కుంతి తన్నుఁ దాను నిందించుకొనెను. (ఇవి స్త్రీసహజవిలాపవాక్కులు).

---

17. (1) ముత్యము+లు(ములోపము-పూర్వ స్వరదీర్ఘము) ముత్యాలు. (2) అమాయికము+బిడ్డ-కర్మధారయంబులందు మువర్ణకంబునకు పు-ంపు అగును. అమాయికపు బిడ్డ.

20. అభాగ్య+ఆలు...కర్మధారయంబులం దుత్సమశబ్దముల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబు, రుగాగమంబునగు-అభాగ్యురాలు.

22. నిండుచంద్రునిబోలు నీచక్కని మోమును నేనెన్నటికైన చూతునె? మరి నాకంత భాగ్యము గల్గునె. ఏయమ్మయైన నీకన్నము పెట్టిఆయువుపోసిననాఁటి పాటగదా నాయనా!

23. పాలబుగ్గలు=మిక్కిలి లేతబిడ్డ గాన త్రాగినపాలు బుగ్గలయందుగనపడుచున్నట్లున్న బిడ్డ వాలుగన్నులు=చక్కని నేత్రములు('నీలిముంగురులవరాలతండ్రి, కాలుచెయిరానితండ్రి'-ఈమాటలు దీనాతిదీనములై పతితలకు గన్నీరు దెప్పించును)

24. నెఱికురుల్=అందమైన పిల్లజుట్టులు, మైనిగనిగల్=శరీరపుకాంతులు,

25. కుంతీదేవి లేతప్రొద్దువంటి తన బాలుని గంగలోవిడుచుచు,వాని నేతల్లి చేతిలోనైనఁ జేర్చి రక్షింపుమని ప్రార్థించుచున్నది. (గంగ చేతిలో బిడ్డనువిడిచి, వానినేతల్లిచేతిలోనైన జేర్చుమని కోరుటయు, నమస్కారమనుటయు కరుణోద్దీపనములు).

26. దిక్కు-అనుజావి-ఈపద్యమున కుంతీదేవియొక్క 'కంగారు' తెలియుచున్నది. అలసించిన నెవరువచ్చి చూతురో! కలువకంటి=కలువవంటి కన్నులు గలది. బాలభాస్కరుని=లేతసూర్యుని.

27. మరులు రేకెత్త=ప్రేమభావము హెచ్చుకాఁగా, మమకారము+ఉజ్జగించి=నాదియను భావము విడిచిపుచ్చి.

28. ఆతపత్రమ్ముభంగి=గొడుగువలె, కంజాతపత్రము, ఒండు=తామరపాకొకటి, బంగారు కిండిపై=ముద్దులపట్టిపై ఎండతగులకుండ, సంధించి=కూర్చి, ఆ మెలో నుండి కడపటి ముద్దుంచెను.

---

వ్యా. వి: 23—(1) చిక్క+తనాలు, చక్క+తనాలు-ఉదంత స్త్రీ సమంబులకు పుంప్రులకు, అదంతగుణ వాచకంబులకు 'తనంబు' పరంబగునపుడు నుగాగమంబగును. చిక్కన్+తనాలు, చక్కన్+తనాలు (ద్రుతకార్యములు) చిక్కదనాలు, చక్కఁదనాలు, (2) ముందు+కురులు—సమాసంబులఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు, ము+కురులు—లుప్త శేషమునకు పరుషములు పరంబగునపుడు నుగాగమంబగును. ముఙ్+కురులు (ద్రుతకార్యములు) ముంగురులు.

28:—కడపట+కడపట-ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులతొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల అదంతంబగు ద్విరుక్తటకారంబగును, కట్టకడపట.

మేఘములతో నాడుచును, నీటిలోదిగి కుంతి తడిసినబట్టతో పెట్టెనొడ్డునకు లాగుచు, కవి అతిసూక్ష్మాంశములనుగూడ విపులముగ వర్ణించుటచే భావము నిండు జీవకళతో స్ఫుటపడుచున్నది.

కుంతి మెత్తని యాకులు పెట్టెలో పేర్చి యవి యొత్తుకొనవుగదా యని చూచికొనెను. కన్నీళ్లు బొటబొట గార్చుచు బిడ్డను పెట్టెలో బజ్జుండబెట్టెను. ఇట బజ్జుండబెట్టుట అను పదము బలమైనది. ఏమియు నెఱుగని బిడ్డ కలకల నవ్వుటయు, పెట్టెను నీటిలో త్రోయబోయి కుంతిచేయి రాక బిడ్డని గౌగిలించి వెక్కి వెక్కి యేడ్చుచుటయు, తానెంత భోగభాగ్యములతో దులదూగుచున్నను దన బిడ్డకు పట్టెడన్నము పెట్టనోచుకొనలేనని యామె యేడ్చుటయు మొదలగు విషయములను వర్ణించి కవి పఠితల హృదయములను కరుణారసమున ముంచియెత్తును. స్త్రీలు ఏడ్చుచు ననుకొనునట్లు 'నా పుట్టుక నాశముగాను. ఇట్టిరత్నము నాకు దక్కునా? నీమోము మరల చూతునా? ఏ యమ్మయైన నీకింత యన్నముపెట్టి పున్నముగట్టుకొన్నప్పటి మాటగదా! యనును. 'ఓ గంగాభవానీ, నాబాబుని నీగర్భమున నుంచుచుంటిని వీని నేయమ్మచేతికైన బెట్టుము ఇవే నమస్కారములు' అని కుంతి దిక్కులుచూచి, బిక్కమొగముపెట్టి, బిడ్డను పొలిండ్లకొత్తుకొని, పెట్టెలోబెట్టి జోకొట్టెను. ఒక తామరాకు బిడ్డని కడ్డముగాబెట్టెను ఆసందులోనుండి బిడ్డని తుదిముద్దు బెట్టుకొనెను. గద్గదకంఠయై వణకుచున్న చేతులతో, నిమీలిత నేత్రయై పెట్టెను, నీటిలోనికి త్రోసెను. పెట్టె కెరటాలలో గొట్టుకొనిపోవుచుండ నిర్ఘాంతపోయి నిరీహతో నామె చూడదొడగెను. ఈవర్ణనముచే కుంతీకుమారి యప్పటి యాకారము పఠితల హృదయ నేత్రములకు కొంచెమైన తప్పిపోకుంట ప్రస్ఫుటమగును. ఈశబ్దచిత్రణము కథాసమగ్రముగనుండి కవియొక్క భావకల్పనా రూపము పఠిత మనమున యథాతథముగ నచ్చుపడినది. ఇట్లే ఖండకావ్యకర్త కుంతీకుమారి పాత్ర చిత్రణమున కృతకృత్యుడైనాడు.

౨. ఈక్రిందివానికి సందర్భసహిత లఘు వ్యాఖ్యలు వ్రాయుడు:-

(1) దైవయోగమున్ ద్రోయగరాదు; ఈనిసువుతో నాడిగట్టితి లోకనిందకన్

(2) 'ఇట్టులున్నది కాబోలు నీశ్వరేచ్ఛ.

(3) కన్నకడుపన్నది కాంతల కింత తీపియే?

(4) నాపుట్టుక మాసిపోను నినుబోలిన రత్నము నాకు దక్కునే!

(పైవాని సందర్భ వివరణములకు యాపద్యముల టీకలను జూచునది).

—*—

# జయగీతి

ఈపద్యములు రచించినవారు వేదుల సత్యనారాయణశాస్త్రిగారు. వీరు ఆధునిక కవులలో ప్రసిద్ధి పొందినవారు.

ఆంధ్రవాఙ్మయము క్రీ. శ. ఆరు, ఏడు శతాబ్దములలో బీజరూపముగానుండి పదునొకండవ శతాబ్దిలో వాగనుశాసనుడగు నన్నయభట్టు మూలమున వెలువడి రూపొంది, తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథుడు, పెద్దన, ముక్కుతిమ్మన, కృష్ణదేవరాయలు, పింగళిసూరన మొదలగు కవిపుంగవులచే పోషింపబడి చక్కగ వికసిల్లినది. నన్నయ మొదలు కృష్ణరాయల యుగాంతము వఱకును. పందొమ్మిదవ శతాబ్దాంతము వఱకు సాంప్రదాయిక పురాణపద్ధతిని, ప్రబంధపద్ధతిని నడచి ఛందోవ్యాకరణాది నియమములను, అలంకారిక పద్ధతులను, నితరశాస్త్రీయ పద్ధతులను పాటించి, ప్రాచీన సంప్రదాయములను పాటించుకొనుచు వికాసము గాంచినది. పందొమ్మిదవ శతాబ్ద్యంతమునకు, నిరువదవ శతాబ్దారంభమున నాంధ్రకవిత్వముపై నాంగ్లేయ సారస్వత ప్రభావము విశేషముగ వ్యాపించినది. దానిఫలితముగ నాంధ్ర కవిసమాజము ఆంగ్లకవుల రచనామార్గములకు మక్కువపడిరి. పందొమ్మిదవ శతాబ్దివఱకు పురాణపురుషులను, దేవతలను, రాజులను సాధారణముగా చేసికొని పురాణములును, కావ్యములును ప్రబంధములును వెలయగా, నిరువదవ శతాబ్దికవులు భావప్రధానముగా గీతములను ఖండకావ్యములను వ్రాయ మొదలిడిరి. నేటి కవులు స్వాతంత్ర్యప్రియులు కావ్యరసమే ప్రధానమని భావించువారు. కథావస్తువేదైన నుండవచ్చునని తలంచినవారు తమ మనస్సులం దుద్భవిల్లిన యానందభావములకు గీతరూపమిచ్చినవారు. వీరు ఛందోవ్యాకరణాది నియమములను ప్రాచీన సాంప్రదాయిక పద్ధతులను బంధనములుగా భావింపక, వానిని వీలైనంతవఱకు గైకొని స్వేచ్ఛావేశముతో భావప్రధానముగా కవిత్వమును సాగించినవారు. వీరిలో శివశంకరస్వామి, రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, జాషువా, వేదుల సత్యనారాయణ శాస్త్రి మొదలగువారు కొందఱు ముఖ్యులు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు ప్రాచీనపద్ధతి నేకైక నారాధించినవారు విశ్వనాథ సత్యనారాయణగారు రెండురీతుల కవిత్వమునందును మహాప్రముఖులు.

జయగీతి మొదలుగా పెక్కుగీతములు 'దీపావళి' యను నొక సంపుటియందు ముద్రింపబడినవి. ఇందలి గీతము లొక్కొక్కటి యొక్కొక్క దీపమువలె వెలుగుట చేతనో, ఈసంపుటియందు దీపావళినాడు అనుపద్యము లుండుటచేతనో ఈసంపుటికి దీపావళియని పేరిడిరి. దీపావళిరచయిత వేదులసత్యనారాయణశాస్త్రి గారు, పెక్కు పాఠశాలలలో నాంధ్రపండితులుగా బనిచేసి ప్రస్తుతము కావలి కళాశాలలో నాంధ్ర భాషాధ్యాపకులుగా నున్నారు. వీరు బహుసన్మానముల

నందినవారు వీరి పద్యములును గేయములును స్వాతంత్ర్య భావపూరితములై యువక కవుల కుత్సాహ జనకములుగ నుండును.

జయగీతి యనునది 'దీపావళి' సంపుటిలోని మొదటి గేయము. ఇది భారత మాత నుద్దేశించిన విజయగానము. భారతదేశపు స్వాతంత్ర్యోద్యమ దినములలో వ్రాయబడినది. స్వరాజ్యయోధులు విజయపతాకలుగొని, గాంధిగారి మంత్రములను జపించుచు ధన మాన ప్రాణములను భారతమాత దాస్యశృంఖల విచ్ఛేదనము కొఱ కర్పించు నావేళ సమయమునందీ పద్యములు వ్రాయబడినవి.

అర్థతాత్పర్యాదులు:

1. కావిముసుగు=ఎఱుపురంగు (కాషాయవర్ణపు) బట్టముసుగు. వేకువకాంత= తెల్లవాఱుటయనెడు స్త్రీ, దివస+అంగణము=దినమనెడి భవనముయొక్క ముంగిలి, (ఎదుటివాకిలి) వనపాళి=తోటలవరుస, సుమగంధము=పూలపరిమళము, అలమికొనెన్=క్రమ్ముకొనెను (వ్యాపించెను.)

ఇది ఉదయకాలమును వర్ణించుగీతము ఉదయము అరుణరేఖలతో పొడచూపును. ఈ యెఱుపు కాంతులనే కవి ఉదయమను స్త్రీయొక్క ఎఱుపుగుడ్డముసుగుగా రూపించినాడు. ముసుగుగుడ్డ కదలుచుండునట్లు ఎఱుపుచారలు మెల్లమెల్లగా వ్యాపించును. ఉదయకాంత తన యెఱుపు ముసుగు అల్లాడుచుండగా దినమనెడి భవనపు ముంగిలిని చేరును. ఆమె చేరగనే శుభసూచకముగా నన్నట్లు, దగ్గఱి వనముల సమూహములందలి పుష్పముల పరిమళము గాలిలో అలముకొనెను. ఉదయకాలమున చల్లగాలులు క్రొత్తగా వికసించు పూలపరిమళముతో వీచుట సహజము. వేకువ స్త్రీగాను, దివసము భవనముగాను కవి రూపించుటచే నిందు రూపకాలంకార మున్నది.

2. రోదోంతరము=భూమ్యాకాశముల మధ్యప్రదేశము (రోదః+అంతరము) తరుణ=లేతదైన, తరణిద్యుతులన్=సూర్యకాంతులచే, రంజితమయ్యెన్=ఎఱుపు రంగు కలదిగా జేయబడెను. ద్విజసంతాన=పక్షుల సమూహముయొక్క, గళ= కంఠములనెడి, కాహళులన్=బాకాలనుండి, ప్రాతః+స్తవము=ఉదయపుస్తుతి గీతములు. మాఱ్ఱోగెన్=మాఱుమ్రోగెను.

ఈశుభకార్య సమయమునందు భవనముల రంగులు పూయుదురు. బాకాల ధ్వనులు మ్రోయింతురు. స్తుతిగానములు పాడుదురు. అట్లే ఈ యుదయకాల శుభ సమయమునందు భూమ్యాకాశ మధ్యప్రదేశమను భవనభాగము లేతసూర్యుని కాంతులతో రంగుపూత పెట్టబడినట్లుండెను. ఉదయవేళ పక్షుల కలకలరవము బాకాధ్వనులవలెనుండి ప్రాతఃకాలపు స్తుతిగీతములవలె నల్దెడలను మాఱుమ్రోగెను.

3. తృణము తృణమునన్=ప్రతి గడ్డిమొలకయందును, కాంతివికసిల్లెను. అన్ని దిక్కులందును కాంతులు ప్రకాశించెను. దేవళమ్ములన్=దేవాలయములందు. జయ ఘంటావితానమ్ము=జయమును తెలుపు గంటలసమూహములు మొరసెన్=మ్రోగెను.

ఉదయకాలమున ప్రకృతి యంతయు శాంతముగ నుండెను. శాంతి ప్రతి గడ్డి మొలకయందును వ్యాపించినట్లుండెను. క్రమముగ సూర్యకాంతులు అన్ని దిక్కులకు ప్రాకెను. ఉదయకాలమున స్నానములు చేసెడివారు దేవాలయము లకుఁ బోయి జయసూచకముగా గంటలు మ్రోగింపఁదొడఁగిరి.

4. అదె=అదిగో, త్రివర్ణధ్వజ=ఎఱుపు, తెలుపు, ఆకుపచ్చరంగులు గల స్వరాజ్యధ్వజము (జెండా) యొక్క, పట+అంచలము=గుడ్డయొక్క అంచు, ఉదయపవన=ఉదయకాలపు గాలిచే, ఉచ్చలితము+అయ్యెను=బాగుగ కదలింపఁ బడెను. నిదుర మైకము=రాత్రి నిద్రవలని ఒడలు తెలియమి, జయశంఖారవమ్ములన్= జయమును దెల్పుశంఖముల ధ్వనులచే వదలెన్.

అవి భారత స్వాతంత్ర్యోద్యమము చెలరేఁగుచుండిన దినములు. ఉదయకాలము లందు కాంగ్రెసు త్రివర్ణ పతాకములు విప్పుకొని స్వరాజ్య ఘోషలు ప్రచారము నకై బయలుదేరుచుండిరి. ఉదయపుగాలి కదలికచే మూఁడురంగుల జెండాల గుడ్డల అంచులు తటతటలాడుచుండెను. జయశంఖములు కొందఱూదఁగా ఆ ధ్వనులు విని యింకను నిద్రమైకములో నున్నవారు నిద్ర వీడుచుండిరి.

5, 6, 7 (ఈ మూఁడు పద్యములకును క్రియాపద మొక్కటే యున్నది అందుచే వీని నొకటిగా గ్రహింపవలెను.) వీరశౌర్యము=వీరుల పరాక్రమము, సతుల తేజము= పతివ్రతలగు స్త్రీలయొక్క కాంతియు, పేదవారి భక్తియు, సాధుదీక్షయు=యోగ్యు లయొక్క పట్టుదల (కార్యదీక్ష) వృద్ధపౌరుషము=వృద్ధవీరుల పరాక్రమమును. ఒక్క మాత+ఆవేశమున వెలుఁగన్=క్రొత్తదైన యొక (స్వరాజ్య) ఆవేశమున వెలుఁ గఁగా, కాలధూమ=నల్లని పొగనుండి. ఉద్గత=పైకివచ్చిన, మహాగ్నిజ్వాల మాలిక లో=గొప్ప నిప్పుమంటల వరుసలో యున్నట్లుగాను, ఝంఝానిల=పెద్ద సుడిగాలిచే విఘూర్ణిత=తిరుగుడు పెట్టఁబడిన, నీల=నలుపువర్ణముగల, వారాంనిధి=సముద్రము యొక్క, తరంగములో=కెరటములోయున్నట్లుగా, ఆసేతుశీతాచలము=దక్షిణము న సేతువు (రాముఁడు కట్టిన వంతెన) నుండి ఉత్తరమున హిమాలయములవఱకు, నర నారీ సమూహము=పురుషులయొక్కయు స్త్రీలయొక్కయు గుంపు, వెలువడియెన్, జనయిత్రీ=ఓ భారతమాతా! నేఁడు నీ, ప్రభాత+ఉత్సవ మహూర్తము=నీయొక్క ఉదయకాలపు ఉత్సవపు సమయము.

వీరుల పరాక్రమమును, స్త్రీల తేజస్సును, పేదజనుల దేశభక్తియు, ఉత్త ముల కార్యదీక్షయును వృద్ధవీరుల పౌరుషమును, క్రొత్తదైన స్వరాజ్య యత్నావేశ ముతో వెలుఁగఁగా యీనాఁడు భారతదేశమునను స్త్రీపురుషుల జయయాత్రా సమూహ ములు, నల్లని పొగలనుండి బయలుదేరిన గొప్పమంటలవరుసలలో యున్నట్లుగాను,

ఝంఝూవాయువుచే కదిపి వేయఁబడిన సముద్రపు కెరటములో అన్నట్లుగాను బయలు దేరెను. స్వరాజ్యాందోళన దినములలో స్త్రీ పురుషులు ఊరేగింపులుగా బయలు దేరుచు అగ్నిజ్వాలలవలెను, సముద్రపు కెరటములవలెను వెలుగుచుండిరి.

8. వేదధాత్రివి=వేదముల భూమివి, (వేదములను పెంచిన దాదివి) జ్ఞానదాత్రివి=జ్ఞానమిచ్చినదానవు. వీరరాజ్ఞీ=వీరురాలవగు భరతదేశమను రాణీ!

(భరతమాతకిది స్తుతిగీతము) వేదములను కన్నభూమివి. జ్ఞానము ప్రసాదించు దానవు. సేవలను అన్నపూర్ణాదేవివలె అన్నమిడుదానవు. నీవు వీరురాలవు. ఇంక వలస ఆంగ్లప్రభువుల చేతులలో నణఁగి, చేసిన పరదాస్యమింక నీకు తొలఁగిపోవును

9. నిజసుస్వాతంత్ర్య=జనముతోను స్వాతంత్ర్యముతోనుగూడిన, మంగళ నిలయ=శుభమైన యింటియొక్క, దేహళికన్=గుమ్మమునందు, నీ మహోన్నతి పాడుకొందుము.

(ఇది భారతదేశ భక్తుల శపథవాక్యము) ఇంక స్వాతంత్ర్యమందిన శుభమైన నీమందిర ద్వారమునందె నిలిచి మేము నిన్నే ధ్యానించి సేవించుచుందుము. నీ గొప్ప తనమునే పాడుకొనుచుందుము.

10. 11. స్వేచ్ఛ=స్వాతంత్ర్యముయొక్క, శుభోదయ=శుభమైన ఉదయము యొక్క, మంగళ+ఆశీః=మంగళ ఆశీర్వచనముల సంబంధమైన, కుసుమ=పూలచే, సురభిళ=పరిమళములైన, మౌళి=తలలచే, వినతులమై=వంగినవారమై, (మ్రొక్కిన వారమై) పారతంత్ర్య=రాజ్యముయొక్క, ఉచ్చాట=వెళ్లగించి త్రోసివేసెడి జయగీతములు పాడుచు. నికేతనము=నీ జెండాను, నానాదిగంతములన్=అన్ని దిక్కుల చివరలందు, నాటెదము.

అనేకతరములనుండి భారతదేశమును బంధించియున్న పారతంత్ర్యపు బంధనములు విదల్చివేసి, స్వాతంత్ర్య శుభోదయ సంబంధమైన మంగళాశీస్సులు చెప్పెడి పూలు గల తలలు వంచు నీయొక్క దాస్యమును త్రోలివేసెడి జయగీతములను కోటి గొంతుకలతోఁ పాడుకొనుచు, అన్ని దిక్కులందును నీ (భారతదేశ) పతాకమును నాటెదము.

12. ప్రసవములు=పూలు, మహా+ఉజ్జ్వల=మిక్కిలి ప్రకాశమైన పాదపీఠికన్=పాదము లుంచెడి పీటమీఁద

ఓ భరతమాతా, నీ మిక్కిలి ప్రకాశమానమైన పాదపీఠముమీఁద మా ప్రాణములను, ధనములను మానములను పూజాపుష్పములుగా సర్పింతుము. (భారతదేశ సంగ్రామమున నహింసా యోధులు తమ ధన మాన ప్రాణముల నర్పించి పాల్గొనిరి.)

13. భారతభాగ్యధాత్రీ=భారత భాగ్యభూమీ! వినమిత పుత్రపుత్రీ=నమస్కరించిన పుత్రులును పుత్రికలును గలదానా! శాంతిజగత్+సవిత్రీ=శాంతితో గూడిన జగత్తును గనుదానా! జనయిత్రీ=తల్లీ! నీకు జయము.

14. హిమగిరిమణికిరీటా=హిమాలయములే మణులకిరీటముగాఁ గలదానా? సింహళము పాదపీఠముగాఁ గలదానా! విజయ+అంకిత+లలాటా=విజయముచే గుర్తు పెట్టఁబడిన నుదుటి ప్రదేశము గలదానా! (విజయమును తెల్పు బొట్టు నుదుటియందు పెట్టుకొన్నదానా!) (ఈపద్యమున భారతమాత రూపము ధ్యానింపఁబడినది).

## ప్రశ్నోత్తరములు

### 1. జయగీతియందలి విషయమును వివరించునది.

చీకటియనెడు శాంత తనశాఖముఁ గప్పుచుండ దినమనెడి యువతి వాకిలిఁ జేరెను. ఉదయభానుని శ్వేతకిరణములచే భూమ్యాకాశముల మధ్యభాగమంతయు నెల్లవారెను. బాకాధ్వనులవంటి పక్షిసంతానముల కిలకిలారావములు ప్రాతఃకాలపు స్తుతిగీతములై యెల్లెడఁ బ్రతిధ్వనించెను. ప్రతి గడ్డిపరకయందును శాంతి యలరారెను. దిగంతములందెల్ల నుదయరాగము వ్యాపించెను. దేవాలయములందు విజయసూచకములగు ఘంటారావములు మ్రోగెను. ప్రభాతవాయువులచే మూడు రంగుల జెండాయంచులు రెపరెపలాడుచుండెను. నిద్రమైకమున నున్నవారు జయసూచక శంఖధ్వనులువిని మేల్కాంచిరి. వీరుల శౌర్యము, స్త్రీల తేజము, పేదల భక్తి, సాధుల దీక్షయు, వృద్ధుల పౌరుషమును నూత్నావేశముతో నొక్కపెట్టున వెలుఁగఁజొచ్చెను. ఆసేతుహిమాచలము (హూవద్యాకతమున) గల స్త్రీపురుషులు, నల్లని పొగలనుండి బయలుదేరిన గొప్ప మంటలవరుసలో, ఝంఝూమారుతముచే క్షుభితమైన సముద్రపుఁ గెరటములో యనునట్లు విజయయాత్రకు బయలుదేరిరి.

తల్లీ, భారతమాతా! అట్టి నీ ప్రభాతోత్సవ సంరంభము నొక్కపరి గాంచితివా! నీవు వేదములకుఁ గన్నతల్లివి. జ్ఞానమునకుఁ బెంపుడు తల్లివి. పేదల కన్నపూర్ణవు. వీరరాజ్ఞివి. అట్టి నీకింక పరదాస్యములేదు. నీపుత్త్రులమగు మేము స్వాతంత్ర్యమందిన నీ శుభమందిర ద్వారమున నిలిచి, నిన్నే ధ్యానించుచు సేవింతుము. నీ గొప్పతనముచే పాడుకొనుచుందుము. తరతరములనుండి తగిలియున్న మా దాస్యబంధములింకఁ దొలఁగించుకొని, స్వేచ్ఛాశుభము బొసఁగు నాశీస్సులనెడు పువ్వులను దలఁదాల్చి నీకు వినతు లగుదుము. కోటిగొంతులతోఁ స్వాతంత్ర్యమును పొంగఁద్రోలెడు జయగీతములను పాడుకొనుచు నీపతాకము నెల్లదిక్కుల

నా వేదము. మా ఘనసమాన ప్రాణములను బూజాపుష్పములుగా నీపాదపీఠియం దర్పింతుము.

హిమగిరి కిరీటముగను, సింహళము పాదపీఠగను, విజయచిహ్నము లలాట భాగముగను గల్గి లోకమునకు కాంతినొసఁగునట్టి యో భారతభాగ్యధాత్రీ! ప్రియ జననీ! నీ కిదే జోహారు, జయమగుఁగాక!

## 2. జయగీతినిబట్టి నవ్యకవిత్వపురీతులను దెల్పుఁడు.

క్రొత్తవింత ప్రాఁతరోఁత, పొరుగింటి పుల్లకూర రుచి, అను సామెతలు నిజమని మన కవిత్వపురీతులు నిరూపించుచున్నవి. చిరకాలమునుండియు నతిపరిచయముచేత ప్రాఁతవిగాఁ దోఁచిన మనపురాణ ప్రబంధరీతులను ఆధునిక కవులు రోసి, పాశ్చాత్య సంపర్కాతిశయముచే క్రొత్తగఁ దోఁచినయాంగ్లకవిత్వపద్ధతులకుముచ్చట పడిరి. మన పురాణప్రబంధకవులు దేవతలను, రాజులను కావ్యనాయకులుగాఁ జేయఁగా నాధునికులు సామాన్య జీవితఘట్టములను రైతులను, పేదలను కావ్యనాయకులుగాఁ జేయఁదొడఁగిరి. ఆధునికులకు ప్రకృతివర్ణనములు ఆకర్షణము గలిగించును. చంద్రోదయమున, వనములు, సెలయేళ్ళు, కోవెలకూఁతలు మొదలగువానినిగూర్చి నవ్యకవులు వినయగానములు చేసిరి. పూర్వకవులు కవిసమయములతోను, చాలచుట్టుతిరుగుడుగా నుండు ఉత్ప్రేక్షలతోను కావ్యములను నింపిరి. ఆధునికులు స్వభావవర్ణనములనువిశేషముగాను ఉపమారూపకములను గొంతవఱకును వాడుచున్నారు. ఆధునిక కవులు ప్రకృతివస్తువులను జూచి, వానిపై వింత వింత భావకల్పనలనుజేసి మామిడిచెట్లను ముత్తైదువులుగను గులాబిపూలు లేఁతబాలికల పాలబుగ్గలుగను నూహించుచుపలుపోకడల తలంపులకు గీతరూపములనిచ్చిరి. అందుచే పూర్వకవిత్వము వస్తుప్రధానమును సంప్రదాయబద్ధమును కాఁగా, నాధునిక కవిత్వము స్వేచ్ఛాభావ ప్రధానముగా నుండును. భాషా ఛందోవ్యాకరణాదినమములను నవ్యకవులు ప్రతిబంధకములుగా నెంచక భావకమునకును రసమునకును ప్రాధాన్యమిచ్చి మధురకవితనువెలయించిరి. భారతదేశ స్వాతంత్ర్యోద్యమము పెక్కుండ్రయందు కవితాభావనలనుబురికొల్పెను. కవిత్వమునకు ఆవేశముకూడ నవసరము.

జయగీతియందు పై యాధునిక కవితా లక్షణములుగలవు. ఈ గీతిక ఆసహాయోద్యమ సమయమున స్వాతంత్ర్య యోధులకు ప్రోత్సాహము గూర్చెడి విజయోత్సాహ గానముగ వ్రాయఁబడినది. హిమాలయములు కిరీటభాగముగను, సింహళము పాదపీఠముగను నుండెడి భారతమాత రూపము నీకవి ధ్యానించి, ఆశీఃపుష్పములతో గూడిన తలఁపులఁబంచి నమస్కారములు దెల్పి విజయగీతము పాడెను. ఈ గీతిలో నీ

కవి ప్రాచీనములగు గీతము, ఆటవెలది కందము మొదలగు ఛందస్సులను వాడక రాగతాళములకు గుదిరెడి శ్రోత్రగేయ రీతిని వాడెను. ఉత్ప్రేక్షలేమియు లేవు? ప్రాతఃకాలపు అరుణకాంతులు వ్యాపించుట ఉదయమను కాంతయొక్క నరెవాటు ముసుగుబట్టయొక్క అంచులు కదలుటగా భావించెను. ఉదయపు పక్షులకూతలు బాకాలధ్వనులుగ నెంచెను. ఉదయకాలమున లోకము కాంతిమయముగ నుండుటను, కాంతులు వ్యాపించుటను, ఉదయమున దేవాలయములందు గంటలు మ్రోగుటను నీయన వర్ణించెను. స్వాతంత్ర్యపతాకల రెపరెపలు, జయశంఖాధ్వనులను నీయన యెంతయుత్తేజముగ వర్ణించెను. ఆ బాలవృద్ధమును భారతీయులు సముద్ర తరంగములవలెను అగ్నికీలలవలెను కదలినడచుట యీయనవర్ణించిన తీరు నుత్తేజనకము, భారతమాత వేదధాత్రియనియు, వీరరాజ్ఞయనియు, పేదలపాలిటి యన్నపూర్ణయనియు నీయన వాకొనుట భారతీయుల ఆత్మోన్నతిని స్ఫురింపజేయును. తమ దేశమును భోగము కొనుట వీరలక్షణము. అందును స్వాతంత్ర్యోద్యమమునందివ్వివి యువకుల కుత్సాహ జనకములు. భారతమాత కడపదగ్గఱ జయస్వాతంత్ర్యగీతములు పాడుమనియు, పారతంత్ర్యము పటాపంచలగుననియు, ఆశీఃపుష్పములతో తలలువంచి మ్రొక్కుడు మనియు కోటిగొంతులతో పారతంత్ర్యములు పాఱద్రోలు పాటలుపాడుచు జయ పతాకల నెల్లెడ నాటుడుమను వాక్యములు దేశభక్త్యావేశపూరితములు. ధనమాన ప్రాణములను మాతృసేవ కర్పింపవలెననుట దేశభక్తుల కుద్బోధకము. ఇది నిజముగ జయగీతియనదగును. దేశస్వాతంత్ర్య సంపాదనకుపోద్బలకారి. దేశస్వాతంత్ర్యమే గాక భావస్వాతంత్ర్యమును మధుర కల్పనమును నిందు ధ్వనించుచున్నవి.



# అసహాయదశ

## స్వీయచరిత్రము

(కందుకూరి వీరేశలింగముపంతులుగారు)

**కవిజీవితాదులు :—**

వీరేశలింగముగారి స్వీయచరిత్రమువంటి రచనలు ఆధునికాంధ్ర వాఙ్మయ లక్షణములలో నొకటి యనవలెను. మన పూర్వకవులును పంతులును స్వప్రతిభను గాని సోత్కర్షణమును గాని చెప్పుకొనుటలో విముఖులై యుండిరి. మహోదార గ్రంథములను రచించి లోకోపకారార్థముగా వానిని వెలయించుటే వారియుద్దేశము. కొందఱుస్వీయచరిత్రాంశములను వ్రాయకపోలేదు. బాణకవి స్వీయచరిత్రాంశములను హర్షచరిత్రములో వ్రాసెను. తెలుగుకవులగు నన్నయ, తిక్కన, శ్రీనాథుఁడు మొదలగు వారు తమ్మును తమకృతిభర్తలను గుఱించి చరిత్రాంశములను చెప్పుకొనిరి. పింగళిసూరన, రామకృష్ణుడు మొదలగువారు కవితామతులను గుఱించి తమ భావములు చెప్పుకొనిరి. కాని వారెవరును సమగ్ర జీవితచరిత్రలను వ్రాయఁ దలపెట్టలేదు. ఆఙ్గ్లసాహిత్యమున స్వీయచరిత్రారచనముగలదు. దేశచరిత్రయుత్తమ మానవచరిత్ర మొదలైనవి లోకోపకారముగ నుండునవియైనచో నట్టివానిని కొందఱు రచింతురు. అందఱు జీవితములు మహోదారములై ప్రజోపయోగకరములై యుండవచ్చును. అట్టివారి జీవితరహస్యము అమూల్యమైనవి. యితరులకుఁ దెలియక పోవచ్చును. అందుచే స్వీయ చరిత్రలు రచించుట యవసరమని భావింపఁబడెను. స్వీయచరిత్రలయం దుండవలసిన ప్రధానాంశము సత్యకథనము రచయిత తనజీవిత విషయములన్నిటిని మఱుగుపఱచకయు, హెచ్చువేయకయు, యథార్థముగ నిష్పాక్షికబుద్ధితో రచింపవలెను. అట్టి యెడలనే పఠితలు ఆస్వీయచరిత్రలకుఁ దగిన విలువ కట్టి, రచయితలను విమర్శించి వారియందు గుణములున్నచో గ్రహింతురు. ఇట్టి జీవిత చరిత్రములలో నేడు ప్రసిద్ధమైనవి గాంధి ఆత్మకథ (సత్యాన్వేషణము) నెహ్రూ ఆత్మకథ, వీరేశలింగము ఆత్మకథ మొదలైనవి.

ఆధునికాంధ్ర వాఙ్మయమున వీరేశలింగముగారి ప్రాధాన్యము శంకింప రానిది. ఆయన చేసిన బహుముఖసేవ ఆంధ్ర సాహిత్యమునందును, ఆంధ్రుల సాంఘిక జీవితమునందును రాచబాట లేర్పఱచినది. ఆయన కాలమున భాషను చెప్పు

కాని కడగండ్ల పాలుచేసినను ఆంధ్రజాతి వీరేశలింగమును గద్యతిక్కనయనియు, ఆధునికాంధ్రవాఙ్మయ నిర్మాతయనియు, బ్రశంసించుచు నాతని నొక యుగప్రవర్తకునిగా నెన్నుచున్నది. వీరేశలింగము ననుసరించి పెక్కండ్రు తమతమ యభిరుచులను నవసరములను బట్టి గ్రంథములు రచించిరి. వీరేశలింగముగారి కాలమునను తరువాతను స్వీయచరిత్రా రచనము ప్రముఖముగ వృద్ధిపొందినది. రాయసము వెంకటశివుడుగారు, కల్లూరి సూర్యనారాయణరావుగారు, కాశీనాథుని నాగేశ్వరరావుగారు, కొండా వెంకటప్పయ్యగారు, టంగుటూరి ప్రకాశముగారు మొదలగు నాంధ్ర ప్రముఖులు తమ స్వీయచరిత్రలను వ్రాసికొనిరి. ప్రజ లీ చరిత్రలను జదివినచో గొంత ప్రయోజన ముండగలదని ఆ రచయితల యుద్దేశము. వీరేశలింగముగారు తమ జీవిత చరిత్రను రెండు సంపుటములుగా ప్రకటించిరి. మొదటి సంపుటము 1910వ సంవత్సరమునకు ముందు వ్రాయఁబడి 1911లోఁ బ్రకటింపఁబడినది. రెండవ సంపుటము 1910 నుండి 1913 జూన్ నెల లోపున వ్రాయఁబడినది. అనఁగా దీనిలోఁ గొంత భాగము, వీరేశలింగముగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు చనిపోవుటకు ముందును, కొంత భాగము ఆమె చనిపోయినతరువాత ఆయన అసహాయదశలోఁ బడిపోయి యున్నప్పుడును వ్రాయఁబడినది. రాజ్యలక్ష్మమ్మ 1910 ఆగష్టు పండ్రెండవ తేదీ తెల్లవారుజామున చనిపోయినది. ఆమె నిజముగ అర్ధాంగియని చెప్పదగినదై వీరేశలింగమునకు శారీరక మానసిక బలమును చేకూర్చుచుండెడిది. ఆమె తన భర్త చేయు సంఘసంస్కారాది కార్యములు బలాత్కారముచే చేయుటగాక, తాను హృదయపూర్వకముగ నమ్మి, గాఢమైన సేవాబుద్ధితో చేసినది గాన, నామె మరణముచే వీరేశలింగమునకు సగము బలము కృంగిపోయె ననఁదగును. అందుచేతనే స్వీయచరిత్రలోని రెండవ భాగములోని నాలుగవ ప్రకరణమున ప్రధానాంశము 'అసహాయదశగాఁ బేర్కొనఁబడినది. ఇది 1910 నుండి 1913 వఱకు వ్యాపించిన కాలము.

### అర్థాదులు:—

పుట:—50. ఆకస్మికముగా=తలవని తలంపుగా, ఘోర, విపత్తు=భయంకరమైన యాపద, అసహాయునిన్=తోడులేనివానిని, పతిత, యువతీ, రక్షణశాల=సంఘములోఁ బురుషుల దుర్ణయముచేతనో, తమ యింద్రియ దుర్బలత్వముచేతను చెడిపోయి పశ్చాత్తాపమునందిన స్త్రీలను గాపాడుటకొఱకుఁ గట్టఁబడిన గృహము (వీరేశలింగము దంపతు లట్టి యువతుల కొఱకుఁ దమతోఁటలో నొక గృహము నిర్మించిరి.) వితంతువు=భర్త చనిపోయిన స్త్రీ.

పుట:—53. సర్ప, దంశన, చిహ్నములు=పాముకాటు గుర్తులు.

పుట:—54. గృహ్య. జంతువులు=ఇంటియందలి పెంపుడు జంతువులు. అయోమార్గ, యంత్రకారుఁడు=ఇనుపదారికి వలయుయంత్రములను జేయువాఁడు, స్థానాంతరమునకు=మఱియొక చోటునకు,

పుట:—56. శుద్ధ శ్రోత్రియులు=అచ్చమైన ఛాందసులు, సంస్కార, ప్రియులు=(సంఘములోని దురాచారములను మాన్పి) సంఘమును బాగుపరచు ప్రయత్నమునందాసక్తిగలవారు, ఉడిపి=తొలఁగించి, నిభృత+అగ్ని=కప్పఁబడిన యగ్ని, హృదయ+అంతరాళమును=మనస్సు లోపలిభాగమును, శోక+అగ్ని=దుఃఖమనెడు నగ్ని, దుర్భరము=భరింపరానిది, తత్+దయా+అమృత, ప్రసారము=ఆదేవుని యనుగ్రహమనెడు నమృతముయొక్క వ్యాప్తి, దుఃఖ+అనలమును=దుఃఖమనెడు నగ్గిని, ప్రాడ్వివాకులు=న్యాయవాదులు, (ప్లీడరులు).

పుట:— 57. కృతజ్ఞుఁడవు=చేసిన మేలును గుర్తుంచుకొనువాఁడను, ప్రేతమును=శవమును, ఏనూఱుగురు=ఐదువందలమంది, వృత్తాంత పత్రికలు=న్యూసు పేపరులు, తంత్రీముఖమున=టెలిగ్రాముల ద్వారా, దుఃఖ+ఉపశమనము (గుణసంధి)=దుఃఖమును దొలఁగించుచున్నది.

పుట :— 58. వితంతు, శరణ+ఆలయము=అనాథ స్త్రీలయొక్క ఆశ్రయము కొఱకేర్పడిన గృహము, అస్థికలను=ఎముకలను, శూద్ర+అంగన=శూద్రజాతి స్త్రీ, మోహము=ప్రేమ, పుత్ర+అధికముగా=కుమారునికంటె నెక్కుడుగా.

పుట :— 59. వృద్ధదశలోన్=ముసలితనమున, ప్రాపు=రక్షణము, ప్రాయశ్చిత్తము=చేసినపాపమును దొలఁగించుకొనుటకై చేయుకర్మము. మనః+స్వాస్థ్యము=మనస్సునకు నెమ్మది, తల్లడిల్లు=చలించు (బాధపడు), ఉల్లమందు=హృదయమునందు, దుర్+చింతలు=చెడుతలంపులు, సంసార, వారిధి=సంసారమనెడు సముద్రమునకు.

పుట :— 60. ఎన్నికగా = లెక్కింపఁదగినదానినిగా, పాపి=తొలఁగించి, పట్టి=బిడ్డ, మోహ, పాశములు=అజ్ఞానమనెడు త్రాళ్ళు, దీన, రక్షక=దిక్కుమాలిన వారిని రక్షించువాఁడా! స్వస్థచిత్తురాలు=నెమ్మదిగనిన మనస్సుగలది, సత్+కార్య, కరణమందు=మంచిపని చేయుటయందు, మనః+తాపము = మనస్సునకు బాధను, గ్రామ. పాచకుఁడు=గ్రామమునందలి వంటలవాఁడు, బాల, వితంతువు=చిన్నతనముననే భర్త చనిపోయిన స్త్రీ.

పుట:—61. స్త్రీ, పునః+వివాహ, సమాజమువారు=(విధవలైన) స్త్రీలను జేరఁదీసితిరిగి పెండ్లిచేయుటకై యేర్పడిన సంఘమువారు, ఇన్నూరు=రెండువందలు, రక్షణనిధి=సేవింగ్సుబ్యాంకు, ప్రవేశపరీక్ష=మెట్రిక్యులేషను పరీక్ష,

పుట:-62. దృఢకాయురాలు=దిట్టమైన శరీరముగలది, బలవత్+మరణము (అనునాసికసంధి)=బలవంతముగాఁ జనిపోవుట, స్వప్రయోజన, పరత్వము=సొంత లాభమందలి యాసక్తి, ప్రాజ్ఞనవు=బుద్ధిమంతునవు,

పుట:-63. అసహాయుఁడను=తోడులేనివాఁడను, నిక్షేపించితిని=భూమిలోఁ బాఁతిపెట్టితిని, ప్రమదావనము=పూలతోఁట. యథా+ఇచ్ఛముగా (గుణసంధి)=ఇష్టము వచ్చినట్లుగా.

పుట:- 65, అసువులు=ప్రాణములు (బహువచనము).

పుట:-66. ధన+ఆగమము=సొమ్మురాబడి, అరణము = పెండ్లి కొమరితకుఁ బుట్టింటివా రొసఁగెడి ధనము.

పుట:-67. మాన్యము=ఆదరముతో నొకరొసఁగినభూమి, సుప్రకాశితము=దస్తావేజు, ధర్మపత్ని=యథావిధిగాఁ బెండ్లాడిన భార్య. సాధ్వి=పతివ్రతయైన స్త్రీ, పరమపదమున నొందెను=స్వర్గస్థురాలయ్యెను.

పుట:-69. అవ్యాజ, ప్రేమ=కపటములేని (పవిత్రమైన) ప్రేమ, భ్రమరకీట న్యాయము=తుమ్మెద యొకపురుగును దెచ్చి తనగూటిలోఁ బెట్టి, తాను గూటిచుట్టును ఁగూయుచుండును. గూటిలోని పురుగు కదల మెలఁగక యొుగుచున్నతుమ్మెదనే ధ్యానించుచుఁ గొలదికాలములోఁ దానును తుమ్మెదగా మారిపోవును. దీనిని బట్టి భ్రమరకీట న్యాయమను దేర్పడెను. భ్రమరముతోడి నిత్యసహవాసముచేత కీటము తానును భ్రమరముగా మారిపోయినట్లు, ఒకఁడొకనిసహవాసమునఁ దానును వానివలె మారిపోయెననుటకీ న్యాయముపయోగింపఁబడుచుండును, వీరేశలింగము గారి సహవాసమువలన రాజ్యలక్ష్మమ్మగారు నాతనిగుణములు గలవారుగా మారిరని భావము, మత్తగజము=మదపుటేనుఁగు, అంకుశము = ఏనుఁగును లొంగదీయునట్టి యినుపసాధనము, సుధారసము=అమృతము, ఉపచారము=సేవ, అత్యంతసహకారి=ఎక్కువ తోడుపడునది, ఆత్మసంరక్షణము=హృదయమును గాపాడుట,

పుట:- 70 షట్+కర్మ, యుక్తురాలు=ఆఱుకర్మలతోఁ గూడియుండినది, సంతుష్ట+అంతరంగురాలు=సంతృప్తిపొందిన మనస్సుగలది, సంక్షోభము=అలజడి, శతగుణములు=నూఱురెట్లు, సహస్రగుణములు=వేయిరెట్లు.

పుట:- 71. అకార్య కరణము=కూడనిపని చేయుట, కార్యసాఫల్యము = పని నెఱవేఱుట, దీన+ఆలాపములు=జాలిగొలుపుమాటలు, ప్రతి+ఉత్తరము (యణాదేశసంధి)=బదులుమాట, అవ్యాజము=కపటములేనిది, వివాహ+అపేక్ష = పెండ్లి కోరిక, ఉడిపి=తొలఁగించి.

పుట:- 72, సర్వ+అనర్థదాయకము=అన్ని విధములగు కష్టముల నొసఁగునది.

పుట:- 73. ఏమఱించి=కనుగప్పి, భీరుత్వము=భయము, గమ్యస్థానము=చేరుకొనఁదగు చోటు (వీరేశలింగముగారు ఏర్పఱచిన వితంతు శరణాలయమున కని భావము), పురమందిరము=టౌనుహాలు, మార్గ+ఆయాసము = ప్రయాణపు బడలిక, సడలి=జారి, కృశించిన=చిక్కిన, సరకు+చేయక= లక్ష్యపెట్టక, సఖీసముదాయముతో=స్నేహితురాండ్రయొక్క సమూహముతో.

పుట:- 74. పరిణయ+అభిలాష=పెండ్లి చేసికొనుట యందలి కోరిక, వంచకులు=మోసగాండ్రు, పతితలు=చెడినవారు, పశ్చాత్తప్తులు=చేసినదోషమునకు [illegible] బాధపడువారు, అనాథమానినులు=దిక్కులేని స్త్రీలు, పతితయువతీ రక్షణశాల=దుర్మార్గుల మోసముచే మానభంగమంది దిక్కుమాలియున్న స్త్రీల రక్షణముకొఱకు నిర్మింపఁబడిన గృహము, శిశుహత్యాదోషము=బిడ్డలను జంపుకొనుటవలనఁ గలిగెడి పాపము, విముక్తురాండ్రు=తొలఁగింపఁబడినవారు, ప్రసవనిమిత్తము=పురిటికొఱకు

పుట:—75. సమస్త+ఉపచారములు (గుణసంధి)=అన్ని సేవలు, అకస్మికముగా=హఠాత్తుగా, పూర్వ+ఉక్త (గుణసంధి)=ఇంతకుమున్ను చెప్పఁబడిన, విగతభర్తృకలు=భర్తలు చనిపోయిన స్త్రీలు.

పుట:—76. పరివేష్టించి=చుట్టియుండి, బీభత్స రూపముతో=గోఁతకలిగించు వికారమైన యాకారములో, అభియోగము తెచ్చుటకు=కేసు పెట్టుటకు, రక్షకభట+ఆగారమునకు=పోలీసు స్టేషనుకు, ఆపన్నులు=ఆపదనందియున్నవారు.

పుట:—77. పరము, పిత=(అందరకు) పూజ్యుఁడగు తండ్రి, పామర, జనులు=తెలివితక్కువవారు, అల్పులు=నీచులు.

పుట:—78. విగ్రహ+ఆరాధనము=దేవతా విగ్రహములను బూజించుట, ఏక+ఈశ్వర+ఉపాసనము (గుణసంధులు)=ఒకేయొక దైవమును ధ్యానించుట, పరిశుద్ధ+ఆస్తికభావము=దేవుఁడుగలఁడను విషయమున నిర్మలమైన విశ్వాసము గలిగియుండుట, సహస్రముఖములన్=వేయివిధములుగా, ఏకాంత, ప్రార్థనము=ఎవ్వరు లేనిచోట (ఒంటిగా) ధ్యానము చేయుట, వికల+అంగులకు=అవయవలోపము గలవారికి (కుంటి, గ్రుడ్డి మొ॥)

పుట:—79. పాక, రచనము=వంట చేయుట, నిరుపమానము=సాటిలేనిది, ప్రథమ, కర్తవ్యము=మొదట చేయఁదగిన పని, చాయవలె=నీడవలె, సహధర్మచారిణి=భర్తతోపాటు ధర్మములన్నిటిని నిర్వహించునది(భార్య), జాతి, బహిష్కృతుఁడను=కులమునుండి వెడలివేయఁబడినవాఁడను, యజ్ఞోపవీత, విసర్జనము=జందెము ----

పుట:—100. సాహాయ్య, సంక్రియా, శాలిని=సహాయమును. రక్షణాధారమును దొరకఁగడి వృక్షములను, అనంత, సత్+ఫల, సంధాయకము=మిక్కిలి మంచి పండ్లనొసఁగునది, జవ, సత్వములను=ఉత్సాహమును బలమును, శోచనీయము=విచారింపఁదగినది, సౌభ్రాత్రము=సోదరభావము, దయనీయుఁడు=జాలి (దయ) చూపఁదగినవాఁడు.

పుట:—101. తృష్ణ=ఆశ, సావధాన చిత్తతతో=శ్రద్ధతోఁగూడిన మనస్సు కలిగియుండుటతో (మిక్కిలి శ్రద్ధతో), తనివి=తృప్తి, పరస్పర=అనుకూలముగా=ఒకదానికొకటి తగునట్లుగా, మహోదరము=కడుపులో నీరు చేరి యుబికిపోవుట యను వ్యాధి, శ్లీపదము=బోదకాలు జబ్బు. కుటిల, కుల+ఆచార, భూతమునకు=వంకరయైన కులాచారములనెడి పిశాచమునకు.

పుట:—102. దుస్సహ వైధవ్యదుఃఖములపాలు=భరింపరాని విధవత్వమువలని దుఃఖములవశము, నిరంతరము=ఎల్లప్పుడు, హేయదాస్యము=నీచమైన బానిసతనము అభ్యుదయకంటకము=అభివృద్ధికలది, దివా స్వప్న సదృశము=పగటికలతో సమానమైనది (ఎప్పటికి నెఱవేఱనిది), ప్రత్యక్షసిద్ధము=కన్నులయెదుటఁగనఁబడుచున్నది.

పుట:—103. అల్పవ్యయసాధ్యములు=తక్కువ ఖర్చుతో సాధింపఁదగినవి, దివానక్షత్రములు=పగటిచుక్కలు, విద్యా+ఆగమములోలి=చదువు నేర్చుకొనుట కొఱకు, కర్తవ్య నిర్ణయ వ్యగ్రతను=చేయఁదగు పనులను నిర్ణయించుకొనుటయం దాసక్తి కలిగియుండును, నూతన+ఉద్యోగ+అనురాగమును=క్రొత్త ప్రయత్నములయం దాసక్తియును, సహస్రముఖములన్=వేవిధములుగా.

పుట:—105. ఇరుతెగలు=రెండుపక్షములు, మిథ్యాదోష+ఆరోపణములు=అబద్ధపు నేరములు మోపుటలు, అభినందనపత్రికలు=(తమ) సంతోషమును తెలియఁజేయు లేఖలు, ఉచిత+అనుచిత వివేకము=మంచిచెడ్డల నాలోచింపఁగల బుద్ధి.

పుట:—106. తెగడుచుందురు=నిందించుచుందురు, దోష+ఏక (వృద్ధిసంధి), దృక్కులు=తప్పులను మాత్రమే కనిపెట్టుచుండువారు, లౌక్య+అధికార ధుర్యవహులు=లౌకికమైన యధికారభారమును మోయుచుండువారు. (గవర్నమెంటు ఉద్యోగులు) అకార్యము=చెడ్డపని, ప్రబుద్ధుల=గొప్ప బుద్ధిమంతులయొక్క (హేళనగా ఉపయోగింపఁబడినది.), దుర్+దూషణములు=చెడునిందలు, ఉన్మత్త ప్రలాపములు=పిచ్చివాని ప్రేలుడు మాటలు, కార్య+ఏక (వృద్ధిసంధి) సాధన పరాయత్త చిత్తముతో=పనిని సాధించుటయందు మాత్రమే యాసక్తమైన మనస్సుతో, భరణమునకై=పోషణమునకై అర్థము=ధనము.

పుట:-107. అర్థము=సగము, ధన+అభావము=డబ్బులేమి, నూతన ప్రతిష్ఠల కంటె=క్రొత్తవానిని నిర్మించుటకంటె, జీర్ణ+ఉద్ధారణము=పాడుపడిన వానిని బాగు చేయుట, అధిక+ ఆదరణీయము=ఎక్కువ యాదరింపఁదగినది. నిర్+అంతరాయముగా=అడ్డులేకుండ.

పుట:- 108. రథ్య = బాట (Road) అమంద+ఆనందము = అధికమగు సంతోషము.

పుట:- 109. సర్వ కాలజ్ఞా=అన్నికాలములను దెలియఁగలవాఁడా ! భక్త జన+అభీష్ట ప్రదాయకా = భక్తుల కోర్కెలు నొసఁగువాఁడా! అనన్యగతియై= వేఱొక దిక్కులేనివాఁడై, భవత్ + ప్రేరితములు=నీచేఁ బ్రోత్సహింపఁబడినవి, వ్యతిక్రమములు=దొసఁగులు.

పుట:- 110. అంతరాళమున =లోపల, రాగ ద్వేష+అంకుర ప్రభావము-చేత=తనవారియెడఁ బ్రేమయు, ఇతరులయెడ విరోధము గనెడు భావముల మొలకల యొక్క మహిమచేత, ఆత్మశ్లాఘనము = తన్నుఁ దాను బొగడుకొనుట, స్వాంతము నుండి=మనస్సునుండి, పరార్థము=ఇతరుల మేలుకొఱకు, ఆయుః+ శేషము=మిగిలిన యాయుర్దాయమును.

## ప్రశ్నోత్తరములు.

### 1. రాజ్యలక్ష్మమ్మ మరణము-దాని పరిణామము.

వీరేశలింగంగారిభార్య రాజ్యలక్ష్మమ్మ, ఆమె నిజమైన యర్థాంగియై భర్త కెల్లవేళలఁ దోడ్పడుచుండెను. కాని తన భర్తకంటె ముందుగ కాలము చేయవలెనని యామె కోరుకొనుచుండెను. భర్త యనంతరము బాధలు పడవలసివచ్చునని యో, సంఘవైరుధ్య మెట్టి విషమఫలితములను గూర్చునని యో ఆమె భావమై యుండ నోపును. కాని తన భార్య చాల ఆరోగ్యవంతురాలగుటచే నామె తనకంటె ముందుగఁ జనిపోదని వీరేశలింగము తలఁచెను. తానొకవేళ చనిపోవలసి వచ్చినచో నామె యాత్మహత్య చేసికొనకూడదని యాయన హెచ్చరించెను. ఆయన తన యాస్తిని హితకారిణీ సమాజమునకు వ్రాసివేసినను, తన యనంతరమున రాజ్యలక్ష్మమ్మకు సుఖజీవనము జరుగునట్లు వేయిరూపాయల రొక్కమును, నెలకు ముప్పది రూపాయలచొప్పున మాసికాదాయమును, కాపురముండుట కిల్లును నుండునట్లు దానపత్రమునం దేర్పాటులు చేసెను.

వీరేశలింగముగారేటేట వేసవిలోఁ జల్లఁదనమునకై బెంగుళూరు వెళ్ళుచుండిరి. వాడుక ప్రకారము వారు భార్యతోఁ గూడి 1910 వ సంవత్సరము బెంగుళూరు వెళ్ళి

ఆగస్టు నెల మొదటి పక్షాంతమున రాజమహేంద్రవరము తిరిగి వచ్చిరి. అప్పుడు రాజ్యలక్ష్మమ్మ సంపూర్ణారోగ్యములోనుండి, తన రక్షణలోనున్న వితంతువులను, పతిత యువతులను పాలించుచుండెను. ఆమె నిద్రకు పూర్వమును, నిద్రమేల్కొన్న పిమ్మటను జగదీశ్వర ప్రార్థన చేసికొనెడిది. మొదలకడనే మేలుకొని భర్తతో సల్లాపము గావించెడిది. 1910వ సం॥ ఆగష్టు 11 వ తేదీ రాత్రి ఆమె జుట్టుముడిలో గులాబిపువ్వు పెట్టుకొని, నోటిలో లవంగము వేసికొని పండుకొనెను. ఆరాత్రి నిద్రలో ఒంటిగంట రెండు గంటల వేళ ప్రశాంతముగ ప్రాణము విడిచెను. ఆమె మరణించినట్లు వీరేశలింగము తెల్లవారిన తరువాతఁగాని యెఱుఁగఁడాయెను, ఆమె అలసి నిద్రించెననుకొనెను. ఎంతసేపటికిని లేవకపోవఁగా మూర్ఛపోయెనో యనుకొని వైద్యుని రప్పింపఁగా వైద్యుడామె మరణించెనని చెప్పెను. వీరేశలింగము నేలఁగూలెను. పట్టణమంతటను నీవార్త ప్రాకి వేలకొలఁది స్త్రీ పురుషులు వచ్చి దుఃఖించిరి. ఈవార్త పత్రికలలో ప్రకటితమై వీరేశలింగము గారి కెన్నియో సానుభూతి లేఖలు వచ్చెను. ఈదంపతులచే పోషింపఁబడినవారు వచ్చిరి. రాజ్యలక్ష్మమ్మ వలని రక్షణ గోల్పోయిన అనాథల గోడు చెప్పతరము గాదాయె. తనకు వార్ధకమున నుపచారమును రక్షణయు గావలసిన వీరేశలింగమునకు భార్య మరణము గొప్ప అఘాతమాయెను. వీరేశలింగముగారి తోటలోనే శవదహన సంస్కారమాయెను. రాజ్యలక్ష్మమ్మగారి చీరలను వస్త్రములను, శరణాలయములలోని వారికి పంచిపెట్టిరి ఆమె యస్థికలను ప్రోగుచేసిరి. వితంతువివాహములు చేసికొన్నవారును, మిత్రులును కొన్ని యస్థికలను దీసికొనిరి. మిగిలిన యస్థికలను జాగ్రత్తపెట్టి వీరేశలింగముగారు రాజ్యలక్ష్మి నివాసమను నొక గృహము నిర్మించి దానిలో పాలరాతితో సమాధిని గట్టించి, యస్థికలనందుంచెను. తన భార్య యోగ్యతకుఁ దగిన యనాయాస మరణము గలిగెనని వీరేశలింగమనుకొనెను, అయినను గొప్పయాధారము కూలిపోయెను. భార్య మరణానంతర మాయన తనశరీర సౌకర్యములకు అన్నపానాదులకును చాల ఇబ్బందులు పడవలసి వచ్చెను.

2. రాజ్యలక్ష్మమ్మగారి పరోపకార పరాయణత్వమును నిరూపించునది.

రాజ్యలక్ష్మమ్మగారు వీరేశలింగముగారి భార్య. ఈమె భావములందును చర్యలందును వీరేశలింగముగారికి సరిపోయిన సహధర్మచారిణి. తన పండ్రెండవ యేట నీమె భర్తతోఁ గాపురమునకై యత్తవారింటికి వచ్చినది. అదిమొదలామె భర్తసేవయే జీవితపరమార్థమని యెంచి యతని కనుకూలముగా వర్తించుచు, భ్రమర

కీటన్యాయమునఁ దాను భర్తవంటిదై పోయెను. వీరేశలింగముగారు కేకార్యమునకుఁ బూనుకొన్నను నీమె వెనుకంజ వేయక తోడునీడయై యతనిని ప్రోత్సహించుచు ముందునకు నడపించుచుండెను. ఆమె మిక్కిలి శాంతస్వభావముగలిగి, కోపస్వభావుఁడగు తనభర్తయొక్క తటి నితరులను లక్ష్యపెట్టక మత్తగజమువలె సంచరింపఁ దానంకుశమయి యతనిని మరల్చి సమయము కనిపెట్టి శాంతవచనములతో స్వస్థచిత్తునిగావించుచుండెను. ఉబ్బసరోగములో బాధపడుచుండు భర్తను మాతృప్రేమమున సేవఁజేసి శరీరరక్షణము చేయుచుండెను. క్లిష్టసమస్య తేర్పడిన సందర్భములలో భర్తకామె మంత్రివలె సుపదేశములిచ్చుచు నాత్మసంరక్షణము గావించుచుండెను. ఈవిధముగా రాజ్యలక్ష్మమ్మగారు "కార్యేషుమంత్రీ, కరణేషుదాసీ, రూపేచలక్ష్మీ, క్షమయాధరిత్రీ, స్నేహేనమాతా, శయనేషురంభా, షట్కర్మయుక్తా ఖలుధర్మపత్నీ" యను నార్యుల వాక్యమునకు లక్ష్యమై వెలఁగుచుండెను.

వీరేశలింగముగారి సాహచర్యమున రాజ్యలక్ష్మమ్మగారు మానవులయెడ సమత్వబుద్ధియు సేవాబుద్ధియే గాక ఇంటిలోని పిల్లను కుక్కలను ప్రేమతో పెంచెను. చనిపోయిన రాజ్యలక్ష్మమ్మ యొడిలోని కెగిరి పిల్లి కూర్చుండెను. ప్రాణను కుక్క దూరము పంపివేయఁబడియు మరల రాజ్యలక్ష్మమ్మ కడకు జేరుకొనెను. ఈకుక్క పామున్న వైపునకు రాజ్యలక్ష్మమ్మ పోకుంట వారించెను. వితంతువులు దూరదేశములనుండి రాఁగా తనపనులైన కట్టిపెట్టివచ్చి వారి యన్నపానాదుల విషయము విచారించి యేర్పాటులు చేసెడిది. అనాథబాలికలపట్ల నామె యొక్క జాలిజూపి విసుగులేక సేవచేసెడిది. పూర్వ దురభ్యాసములచే నొక్కొక్కప్పుడు తప్పులుచేయువారిని శాంతముగ మందలించి వారు సిగ్గుపడి సన్మార్గమునకు మరలునట్లు చేసెడిది. పతితయువతీ రక్షణశాల నిర్మాణమునకును నిర్వహణమునకును రాజ్యలక్ష్మమ్మయే బాధ్యతవహించెను. దుర్వృత్తినుండి యీమె కొందఱు రక్షింపగలిగెను. ఒకబ్రాహ్మణవితంతు వొకబిడ్డనుగని విడిచిపోగా రాజ్యలక్ష్మమ్మ యాశిశువునకు తల్లిచేయు సమస్తసేవలును చేసి పెంచెను. మలమూత్రము లెత్తుట కేవగించుకొనలేదు. ప్రజల యుపయోగమునకై యామె పెక్కునూతులు త్రవ్వించెను. ఒకస్త్రీని జారత్వశంకచే నామెవిటుఁడు చెంపఁబగులగొట్టగా నట్టివారి నుద్ధరింపలేమాయని రాజ్యలక్ష్మమ్మ భర్తకు చెప్పెను. వీధిలోఁ బడిపోయిన మాలవాని నెవరును ముట్టకపోగా నీమె తుదకొక యువకుని సహాయమున దన యరుగుమీఁదికిఁజేర్చి వాని కుపచారములుచేసి పంపెను. ఇట్లీమె సర్వప్రాణి దయాపరత్వమును మాటలచే గాక చర్యలవలన జూపెను.

ఆమె భర్త సంఘ విద్రోహము చేయుచుండెననియు, జాతినిని వారింపు మనియుఁ దన వ్యతిరేకతను బ్రకటించుమనియు పెక్కండ్రు బంధుగు లీమెను బల వంతపెట్టిరి. బెదరించిరి, కాని యీమె యచంచలయై తన భర్త చేయునదెల్లను యోగ్యమేయని వాదించి బంధువుల నోళ్లు కట్టించెను. ఆస్తినంతను హితకారిణీ సభకు వీరేశలింగము దానము చేసి వేయుచున్నాడనియు నందుచే నామె ముప్పుగుడు చుట కష్టమనియు, గొంత యాస్తి తనకుంచునట్లు చూచుకొమ్మనియు, సనాతన ధర్మ విరుద్ధముగా నాయన తలపెట్టిన పనులు మాన్పించుమనియు పలుతెరఁగులు నామెకు బంధువులు చెప్పినను రాజ్యలక్ష్మమ్మ తన నిశ్చయమును సడలింపలేదు. స్త్రీ సంఘోద్ధరణము విషయమున భర్త యనుమానములు పోఁగొట్టి యాయనను బ్రోత్స హించెడిది. తోటను బాగుచేయించుటలోను నూతులు త్రవ్వించి యానూతులు తమకేగాక జామిపేటవారికిని చుట్టుపట్టుల ప్రజలకును నుపయోగపడునట్లు చేయుట లోను నామె పరసేవాబుద్ధిని జూపెను. వీరేశలింగము నమ్మిన యేకేశ్వరోపాసన మును ఆడంబరము కొఱకుఁగాక దృఢవిశ్వాసముతో తాఁ జేయుచు, స్త్రీలకొఱకుఁ బ్రత్యేక ప్రార్థనామందిరము నేర్పాటు చేయించి స్త్రీల నటకుఁ గొనిపోయెడిది. ఆమె కొన్ని కీర్తనలనుగూడ రచించెను.

రాజ్యలక్ష్మమ్మగారికి పుట్టినింటివారిచ్చిన భూమి కొంతకలదు. ఆ భూమి నామె పుట్టింటివారికే వ్రాసి యిచ్చివేసెను, అన్నివిధములను భర్తను, దైవమును, నమ్మిన తన జీవితచింత యామె పెట్టుకొనలేదు. అనాథబాలికలకును, పతిత స్త్రీల కును అక్షరాభ్యాసపు టేర్పాటులు గావించి తానే వారికి చదువు చెప్పెడిది. కుంటి వారు, గ్రుడ్డివారు, వృద్ధులు మున్నగునసహాయులకు అన్నదానము చేయుటలో నీమె శ్రద్ధవహించెను. సోమరితనమన్నచో నామె కంటగించుకొనెను. ఊరక మాటల కాలక్షేపమునకు వచ్చువారిని మందలించి వారి యలసత్వమును బోఁగొట్టెడిది. ఇట్టి యుత్తమురాలగు నీమె కనాయాసమరణము కలిగినందుకు వీరేశలింగము సంతోషించి మంచివారికి మరణమే సాక్షియని పెద్దలన్నమాటలు స్మరించెను.

### ౭. భార్యామరణానంతరము వీరేశలింగము జీవితమెట్లు నడచెను.

రాజ్యలక్ష్మమ్మగారు పతిసేవయే ప్రథమ కర్తవ్యముగా నెంచుకొని వీరేశ లింగముగారికి వలయు సమస్త సౌకర్యములు స్వయముగాఁ గనిపెట్టి చేయుచుండెడి వారు. ఆమె మరణించినంతనే పంతులుగారికి వంటచేసి పెట్టువారు లేరు, పులవర్తి సుబ్బారావుగారి యింట నెట్లో కొంతకాలము కాలక్షేపము చేసిరి. సుబ్బారావు గారు యోగ్యుఁడే. ఒక్కొక్కప్పుడాయనయే వండిపెట్టుచు వీరేశలింగము వ్యాధిగ్ర స్తుఁడైనప్పుడు జావ మొ॥ చేసి యుపచారములు చేసెను. కాని సుబ్బారావుగారి

భార్య కీపని యిష్టములేక పలుపాట్లు పెట్టెను. రాచర్ల రత్తమ్మయను నామె సేవాబుద్ధితోనే వంటచేసి పెట్టుటకుఁబూనుకొనెను. కాని యామె బంధువులకదియిష్టము లేక ఆమెతల్లి మంచముపట్టెనని శంకమీఁద నామెను గొనిపోయిరి. వీరేశలింగమునకు నాలుగు నెలలపాటు తలదువ్వువారైన లేకపోయిరి. వితంతు శరణాలయములోని స్త్రీలు తలయంటిరి. జుట్టు ఒకటే యట్టకట్టుకొనిపోవుటచే వీరేశలింగము జుట్టు తీయించివేసెను. ఇంతలో విరేచనముల వ్యాధి యీయనను చాలబాధించెను. పాత శాలాభవననిర్మాణమును సూతులసనియు పూర్తియగువరకు బ్రతికియుండిన బాగుండునని యాయన యనుకొనెను. శరణాలయములోని యొక వితంతువును వివాహమాడి తన యుపచారము కొఱకు అచ్చటనే యెవరైన నుండిపోవుట కంగీకరించుచో వాని కుద్యోగమిత్తుననియు ధనమిత్తుననియు వీరేశలింగము ప్రకటించెను. అట్టి వరుఁడొకఁడు దొరికెను. వీరేశలింగము ఆ వివాహము చేయించెను కాని యందువలన నాయన బాధలు నివారితములు కాలేదు. 1912వ సంవత్సరమున నొకనాఁడు వీరేశలింగము స్మృతి తప్పిపోయి యట్టి స్థితిలో నొక పావుగంట యుండెను. చాల దినములకు గాని యాయన యారోగ్యము చక్కఁబడలేదు. శరణాలయపు స్త్రీలాయన కుపచారములు చేసిరి. వేసవిలో నారోగ్యముకొఱకు వీరేశలింగము బెంగుళూరుపోయి యచ్చట కొన్నాళ్ళుండి వచ్చుచుండెను. నానాఁటికి బలము తగ్గుచుండుటచే నీయన సర్వకళాశాలా పరీక్షాధికారిత్వము మానుకొనవలసి వచ్చెను. తన పుస్తకముల విక్రయమువలన ధనము వచ్చుచుండెను. కాని పెక్కండ్రు రచయితలు బయలుదేరుటచే నీయన రాబడి తగ్గజొచ్చెను. అందుచే హితకారిణీ సమాజకార్యక్రమములకు ధనాభావమేర్పడి వీరేశలింగము ఆంధ్రప్రజల కొక విజ్ఞాపన పత్రము ప్రకటింపవలసి వచ్చెను.

### 4. ఆంధ్ర ప్రజలకు వీరేశలింగము గావించిన విజ్ఞాపనమేమి?

వీరేశలింగముగారు వార్ధకముచేఁ బూర్వమువలె నార్జింపలేకపోవుట చేతను హితకారిణీ సమాజ కార్యక్రమములు గొనసాగింపవలసి యున్నదిగనుక తన కార్యభారము కొంత యాంధ్రప్రజలపై మోపఁదలఁచి కొంత యౌదార్యము జూపఁ గోరు నాశచే నొక విజ్ఞాపన పత్రము నాయన ప్రకటించెను ఆ పత్రమున నాయన స్వోత్కర్షము చెప్పుకొనలేదు. చెట్టులేని దేశములో నాముదపుచెట్టే మహావృక్షమన్నట్లు విద్యాధికులంతగా దేశోన్నతికిఁ బాటుపడని కాలమునఁ దాను వ్రాసుకొంటిననియు, శక్తివంచనలేక పాటుపడుచుంటిననియు, దేశాభిమానము తప్ప ధనా[illegible]తలు తనయొద్దలేవనియు, సత్కార్యము కొనసాగించుబాధ్యత యాంధ్రులపైఁ

గలదనియు నాయన నివేదించెను. తాను నాటిన సంస్కారబీజములు రాజమహేంద్రవరమున చక్కఁగ నాటుకొని లతలు సాగుచున్నవి గాన వానికి దోహదమొసంగుట యావదాంధ్రదేశస్థుల కర్తవ్యమనెను. ఆయన పలుతెరఁగుల నాంధ్రుల నిట్లు హెచ్చరించెను.

ప్రజలు రాజకీయాది సత్వములకు యత్నించి యనుగు కృతకృత్యులైనను లాభముండదు. ప్రజాబాహుళ్యము తమ దోషములను ద్రోసిపుచ్చి సాంఘికముగా పురోగమనము చెందినఁగాని లాభములేదు. సర్వావయవములును వృద్ధిపొందినచో శరీరమునకు శోభ చేకూరును గాని యొక ప్రక్క పెరిగినచో నది వ్యాధిగాఁ దలఁపఁబడును. కావున నింటను బయటను నభివృద్ధికిఁ బూనవలెను గాన తాను దలపెట్టిన సంఘసంస్కార కార్యములను కొనసాగింపవలెను. దేశములో సార్వజనికములేఁ గాక యిప్పుడు పట్టణములందేఁ గాక పల్లెలందును సభలు చేసికొనఁగల్గుచున్నారు. స్త్రీలును చదువుకొనఁగల్గుచున్నారు. ఇదివరలో చదువుకొనవలెనన్న పుస్తకములే లేవు. ఇప్పుడు చాల పుస్తకములు ప్రకటితములగుచు గ్రంథాలయములు నెలకొని యెల్లరకు నందుబాటులోనికి వచ్చుచున్నవి, వార్తాపత్రికలు దేశమునం దలముకొనుచున్నవి. ఘోరమగు నౌక యెక్కుట, విదేశములకు విద్యార్జనమునకేగుట మొదలగు పనులు చేయువారు సంఘ బహిష్కారము నొందు దినములు పోయినవి. [illegible] ప్రాయశ్చిత్తము లక్కఱలేదు. పైరీతిని సంఘసంస్కారము జరుగుచున్నది. దీని బలపఱచుట మన చేతిలోనిపని. రాజకీయ స్వాతంత్ర్యము మన చేతిలోనిది గాదు. [illegible] నిశ్చిత ఫలము నొసఁగు సాంఘిక స్వాతంత్ర్యమునకు నడుము కట్టవలెను. ఈ పని చేయు వారిని పెక్కు కష్టము లెదుర్కొనును. ఫలించిన వృక్షమునకే రాళ్ళదెబ్బలన్నట్లు జయప్రదముగ ప్రజాసేవ చేయఁబూనువారికే విఘాతములును సంఘమువలన బాధలు రావచ్చును. అంతమాత్రముచే వెనుదీయరాదు. రాజమహేంద్రవరమున జరుగుచున్న పనికి చెన్నపురి మొదలగు స్థలములనుండి అభినందన పత్రములు వచ్చుచుండ, రాజమహేంద్రవర ప్రాంతము వారొకరినొకరాక్షేపించుచు, దోషైకదృక్కులై కూర్చుండుట తగదు. ఆక్షేపణములు చేయువారు, లంచగొండితనము, మద్యపానము వ్యభిచారము, పనిలేనితనము, తిండిపోతుతనము, మతము పేర సంఘమును దోచుకొనుట మొదలగు దురాచారములను మాన్పుటకు ప్రయత్నింపకపోవుట శోచనీయము. క్రొత్త సంస్థలు నెలకొల్పుట మాటయటుండనున్నను, స్థాపితమైయున్న హితకారిణీ సమాజము నుద్ధరించుట ధర్మముకదా. నూతన ప్రతిష్ఠకంటె జీర్ణోద్ధారణ మధికాదరణీయము కదా. కావున విశేషధనమీయలేనివారు నాలుగేసి అణాలిచ్చెడి సభ్యులుగానైనఁ జేరి సంఘమును బలపఱచుట ధర్మము. ఈ రీతిని వీరేశలింగముగారు విజ్ఞాపనము పంపెను.

5. స్వీయచరిత్ర రచనకు వీరేశలింగముగారెంతవఱకు దగి యున్నారో నిరూపించునది.

స్వీయచరిత్ర యనఁగాఁ దన జీవితవృత్తాంతమును దానే చెప్పుకొనుట. చరిత్రమనునది విశ్వజనీనమై యుండవలెను. ఎవరిచరితము లోకమున కాదర్శమై మేలు కలిగించునో వారిచరితమే సర్వజనాదరణీయ మగును. అదియే యక్షరరూపమును దాల్పనర్హ మగును. ఆదర్శజీవితమనునది సామాన్యమైనది కాదు. నూటికిఁ గోటికి నొక రిద్దరి జీవితమట్లుండును. వారు దైవభక్తి, భూతదయ, సత్యరతి, ధర్మనిష్ఠ సేవాభావము మున్నగు నుత్తమగుణములు గలిగి నిస్వార్థబుద్ధితో లోకోపకారముఁ బాటుపడుచుందురు. వారి నడవడిని బట్టి యితరులు తమవర్తనము దిద్దుకొనుటకు యత్నింతురు. ఇట్టి శ్రేయస్సంయుక్తమగు వారిచరితము మాత్రమే వ్రాయఁదగును. పరోపకారబుద్ధులు మాత్రమే తమచరితమును వ్రాసికొన సర్హులగుదురు. ఈలక్షణములనుబట్టి చూచినచోఁ దానునమ్మినసత్యములకుఁ గట్టువడి, సంఘసంస్కారాది విషయములం దధోగతిపాలైన తనజాతి నుద్ధరింపఁబూనిన వీరేశలింగముగారు స్వీయచరిత్రము రచించుకొనుట కెంతయుఁ దగియున్నవారని యీ క్రిందివిషయము లనుబట్టి నిరూపిత మగుచున్నది.

వీరేశలింగముగారు సంఘసంస్కరణము గావించి యాంధ్రజాతికి మహోపకార మొనర్చిన ధన్యజీవులు. వీరికాలమున సంఘము నేక విధముల పతితమై సంస్కరణము నపేక్షించుచుండెను. లంచగొండితనము, అవినీతి, మూఢాచారములు ప్రబల శత్రువులై సంఘమును బీడించుచుండెను. స్త్రీల దుస్థితి కడుంగడు శోచనీయమైయుండెను. బాల్యవివాహములు, నిరక్షరాస్యత మొదలగునవి స్త్రీజాతిని క్రుంగదీయుచున్నవి. వీనిని సంస్కరించు ధీరులెవ్వరును లేకుండిరి. అప్పుడు పంతులుగారు నడుముకట్టి స్త్రీజనోద్ధరణాది కార్యములకుఁ బూనుకొనిరి. బాలికలకు పాఠశాల నేర్పఱచి స్వయముగా విద్యగఱపఁబూనిరి. బాలవితంతువులను, పతితలగు యువతులను జేరఁదీసి పునర్వివాహములు గావించిరి. నాఁటిసంఘపరిస్థితుల కెదురీదుచుండిన వీరిని సజాతీయులును కులమునుండి వెలివేసిరి. అయినను వెనుదీయక పంతులుగారు బ్రహ్మసమాజ మత మవలంబించి యేకేశ్వరోపాసన గావించుచు సంఘసేవ చేయుచుండిరి.

వీరేశలింగముగారు తనయుద్యోగము వలనను, తనపుస్తకముల విక్రయము వలనను, చిరకాలము పరీక్షాధికారిగ నుండుటవలనను దగినంత ధనము సంపాదించి, యాధనమును సంఘసంస్కరణమునకు, పతిత స్త్రీజనోద్ధరణమునకును, విద్యా ప్రచారమునకును వినియోగించిరి. తాను దలపెట్టిన సేవాకార్యక్రమము స్వార్థరహితమును, ఆంధ్రజాతికి బలవర్థకమును నగుటచే నాంధ్రులలో నుదారులెల్ల ధనసహాయము చేయవలెననియు, హితకారిణీ సమాజసభ్యులుగఁ జేరవలెననియు వీరుకోరిరి. బాలవితంతు రక్షణకు వీరు నిస్వార్థబుద్ధితోఁ బెక్కేర్పాటులు గావించిరి. ప్రజోపయోగమునకై వీరు తమతోటలో నాలుగుబావులు త్రవ్వించిరి. లంచగొండితనము, మద్యపానము మున్నగు వానిని నిర్భీకముగా ఖండించుచుఁ బ్రచారముగావించిరి. మద్యపానము మహానర్థకమని భావించుటచేతనే వీరు సంవత్సరమునకు డెబ్బది రూపాయిల యాదాయ మిచ్చుచుండునట్టి తమతోఁటలోని తాటిచెట్లను గొట్టించివైచిరి. కుంటి, గ్రుడ్డి మొదలగువారి నాదరించిరి.

వీరేశలింగముగా రిట్లు తనధనము బలము సర్వస్వము ప్రజాసేవకై వినియోగించిరి. సంఘోద్ధరణ విషయమున నెన్ని యడ్డంకు లేర్పడినను లక్ష్యపెట్టక తమపట్టు సాధించుకొనెడివారు. ఇంత చేసియుఁ దాను, జేయఁగలిగిన దేమియు లేదనియు, నంతయు నీశ్వర ప్రేరణచేతనే జరుగుచున్నదనియుఁ జెప్పుచుండువారు. ఇతరులు మెచ్చినను నిందించినను దాము సత్యమని నమ్మినదానిని సాధించుటకు వెనుఁదీసెడివారుకారు. ఇట్టి యుత్తమ గుణములుగలవారగుట చేతను, వారి నడవడి లోకమున కాదర్శమయిన దగుటచేతను వీరేశలింగముగారు స్వీయచరిత్రము రచించుకొనఁ గలిగిరి. వారాగ్రంథములోఁ దమజీవిత విశేషము లున్నవున్నట్లు చెప్పుకొనిరేగాని, యసత్యములు, అభూతములు నగు కల్పనలు చేర్పలేదు. ఆత్మశ్లాఘ, పరనిందల కందుఁ జోటియ్యలేదు. కావున వీరి స్వీయచరిత్ర మాంధ్రవాఙ్మయమున కలంకారప్రాయమై యాంధ్రజాత్యాదరణముఁ బడసినది.

### 6. భ్రమరకీటన్యాయమున నామె నావలెమాఱిపోయెను. దీనిని వివరింపుఁడు.

భ్రమరము ఇతరకీటకమును గొనివచ్చి తనగూటిలోనుంచి, తాను గూటిచుట్టు ఝుమఝుమఁ గూయుచునుండును. గూటిలోని పురు గితర మెఱుఁగక, తన యెదుటనున్న

భ్రమరమునే ధ్యానించుచుఁ గొంతకాలములోఁ దానును భ్రమరముగా మాఱిపోవును. దీనినిబట్టి భ్రమరకీటన్యాయమేర్పడినది. ఒకనిసహవాసముననొకఁడు తనగుణములు వీడివానివలె మాఱిపోవు సందర్భములందీ న్యాయమువాడబడుచుండును. చూడుఁడు. బాల్యమునుండి రాజ్యలక్ష్మమ్మ వీరేశలింగముతో హత్తుకొని, యాయన చర్యలను భావములను ననుకరించి వానిని తనవిగాఁ జేసికొని భర్తకార్యక్రమమునకపార బలము చేకూర్చెను. సనాతనులును, వీరేశలింగమును సంఘశత్రువులుగా భావించినవారును రాజ్యలక్ష్మమ్మ మూలమున నామెభర్తకు హానిచేయఁగోరిరి. అట్టివారి మాటలకును బెదరింపులకును నామె లొంగలేదు. ఒక్కొక్కప్పుడు వీరియింటికి సేవకులు గూడ రాకుండ చేయఁగా రాజ్యలక్ష్మమ్మ నీళ్ళుకూడ మోసి పనులుచేసెను. ఆకాలమునాఁటి వీరేశలింగము భావములు సంఘవిరుద్ధములు. మఱియొక భార్యయైనచో నేను మఱియేడిదో, రాజ్యలక్ష్మమ్మ భ్రమరకీట న్యాయమున భర్తవంటిదాయెను. భర్తవలె నిర్భీకురాలును, అచంచల కార్యదీక్ష గలదియునాయెను. జీవితాంతమువఱకును పరసేవా నిరతయై యుండెను.



# భర్తృహరి

## చిత్రకథామంజరి

### చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు

ఆంధ్రవాఙ్మయమున వీరేశలింగకవి గద్యరచనమునకు అత్యంత ప్రోత్సాహమిచ్చినది. గద్య పద్యాత్మకములగు నాటకములును, కావ్యములును, శతకములును వెలసినను నీయుగము ప్రముఖముగ గద్యయుగమని చెప్పఁదగును. ఈయుగ ప్రవర్తకుఁడు శ్రీకందుకూరి వీరేశలింగము. వీరేశలింగముగారు మతసంస్కారము, సంఘసేవ, భాషాసేవ, వాఙ్మయ విమర్శనము మొదలగు నాశయములతో నపారమైన వచనరచన గావించిరి. తరువాతి రచయితలలోఁ బెక్కురా మార్గమునే యనుసరించి గద్యవాఙ్మయమునకుఁ బరిపుష్టిఁ గలిగించిరి. అట్టివారిలో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారొకరు. వీరంధులయ్యు నపారవాఙ్మయము సృష్టిగావించిరి. వీరు కథలు, పాఠ్యపుస్తకములు ప్రహసనములు నాటకములు చరిత్రలు నవలలు మున్నగునవి రచించి జీవితాంతము వరకును నచంచలమగు సారస్వతసేవ గావించిరి. వీరు వ్రాసిన రచనలు గ్రంథరూపమునను బత్రికారూపమునను వెలసెను. భర్తృహరిని గురించి లక్ష్మీనరసింహము గారొక వ్యాసమును "భారతి"లో బ్రకటించిరి. అది చిత్రకథామంజరి యను పుస్తకములో నాలుగు ప్రకరణముల చిన్నకథగాఁ బ్రకటింపఁబడెను. ఇందలి కథ భర్తృహరి జననము, రాజాశ్రయము, కవితాప్రశస్తి, భార్యాపరీక్ష, వైరాగ్యము నను విషయములతోఁ గూడినది.

అర్థాదులు:—

పుట:—111. గీర్వాణభాష=దేవభాష (సంస్కృతము), శిఖామణి=తలమానికము (శ్రేష్ఠము) తాండవమాడు=నాట్యముచేయు, మనః+రంజకముగా=మనస్సున కానందము కలిగించునట్లుగా, ప్రశంసనీయములు = పొగడఁ దగినవి. అనంతర. వృత్తాంతము=తరువాతి చరిత్ర,

పుట:—112, మోక్షదాయకమైన, ఏడు పుణ్యక్షేత్రములు=అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి, అవంతిక, ద్వారక—ఈ యేడును ముక్తి నొసఁగునట్టి పుణ్యక్షేత్రములు, సచివులు=మంత్రులు, దౌవారికులు=ద్వారపాలకులు, దండనాయకులు=సేనాధిపతులు, చారులు=వేగులవాండ్రు, విదూషకులు=హాస్యసంభాషణ

మంచే రాజులు నానంద పడుచు చుండునట్టి రాజమిత్రులు, పరివేష్టింపఁగా=చుట్టి యుండఁగా, జయంతుఁడు=ఇంద్రునకు శచీదేవియందుఁ బుట్టినకుమారుఁడు (అందములో గొప్పవాఁడు) అభిముఖుఁడై=ఎదురు ముఖముగలవాఁడు, మేని, చెలువము=శరీరముయొక్క యందము, సౌకుమార్యము=మృదుత్వము, లావణ్యము=ముఖవర్చస్సు తారుణ్యము=పడుచుఁదనము, తనివి+చనక=తృప్తి పొందక, మార, సమానుఁడవు=మన్మథునితో సాటియైన వాఁడవు, వాలకము=వేషము.

పుట:—113. శ్రవణంబులకున్=చెవులకు, అనవుడున్=అని పలుకఁగా, భూసుర, కుమారుఁడా=బ్రాహ్మణబాలుఁడు, వానికెక్కిన=ప్రసిద్ధి చెందిన, చరితార్థుఁడను=నెఱవేఱిన ప్రయోజనము గలవాఁడను (కృతార్థుఁడను). ఏకాకిని=ఒంటరివాఁడను, కుశ+అగ్రబుద్ధి=దర్భకొనకంటె మిక్కిలి తీక్ష్ణమైన (సూక్ష్మమైన) బుద్ధి గలవాఁడు, అఖిలశాస్త్రములు=తర్కము, వ్యాకరణము, అలంకారము, మీమాంస, ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము, అధిగమించితిని=దాఁటితిని (కడముట్టఁ జదివితిని) కవిజన, కల్పకా=కవులకు, గోరిన కోర్కెలిచ్చెడు కల్పవృక్షము, పారిజాతము=కల్పవృక్షమువంటిదే యగు ఒకానొక దేవతా వృక్షము, శ్రితజన, చింతామణి=ఆశ్రయించిన వారి కోర్కెల నిచ్చెడు దేవలోకరత్న విశేషము, వెల్లువలు=ప్రవాహములు, దైన్య, హీనము=దీనత్వములేనిది, అంచయు=దగ్గఱను.

పుట:—114. అవ్వారిగా=సమృద్ధిగా, వీనుల విందుగా=చెవుల కింపుగా, మోహ, పరవశ=వలపునకు లోఁబడి యొడలెఱుఁగనిది, వేద+అధ్యయన, తత్పరుఁడను=వేదములు చదువుటయందాసక్తి కలవాఁడను, కోవిదుఁడను=పండితుఁడను, నైష్ఠికుఁడను=మతకర్మలందు నియమ జీవనము గలవాఁడను.

పుట:—115. విన్నవోయిన=వెలవెలపోయిన (నిశ్చేష్టమైన), ములుకులు=బాణములు, విహ్వల, చిత్తయై=స్వాధీనము తప్పిన మనస్సుగలదై, జలకము+ఆడక=స్నానము చేయక, ఒల్లక=ఇష్టపడక, శోషిల్లిన=వాడిపోయిన, తగచి=ఆలోచించి, కంచెయే చేను మేసి నప్పుడు=పశువులు చొచ్చి చేను మేయకుండ రక్షించుటకై పొలముచుట్టు వేయఁబడిన వెలుగే చేను మేసినప్పుడు, నిరుపమాన, నిష్ఠా, గరిష్ఠుఁడను=సాటిలేని నియమపాలనచేత గొప్పవాఁడను, పరిణయము=పెండ్లి, పరువు=లక్ష్యము, శిరః+ఛ్ఛేదము=తల నఱకుట, ధర్మ పథంబును=న్యాయమార్గమును త్రికరణ, శుద్ధిగా=మనస్సు, వాక్కు, కాయమును నిర్మలమైయుండునట్లుగా

పుట:—116. పరాయణత్వమునకు=ఆసక్తి కలిగియుండుటకు, విమల+అంతః కరణమునకు=నిర్మలమైన మనస్సునకు, విస్మితుఁడై=ఆశ్చర్యపడినవాఁడై,

మనః+రథము=కోరిక, వ్యవస్థ=శాస్త్రమున నిరూపింపఁబడిన నియమమును, ఉభయ, తారకము=ఇద్దఱను (నిన్ను, నన్నును) తరింపజేయునది. పాణిగ్రహము చేయుము=పెండ్లియాడుము, కోశ+అధ్యక్షుఁడు=రాజధనమును రక్షించు నధికారి, తృతీయ, కళత్రము=మూఁడవభార్య, చతుర్థ, పత్ని=నాల్గవభార్య, బహుపత్నీ కత్వముచే=పెక్కుమంది భార్యలు కలిగియుండుటచే.

పుట 117:— పడంతులు = స్త్రీలు, సకల లోకవంద్యులు=లోకులందఱి చేతను నమస్కరింపఁ దగినవారు, మాతామహుని, అనంతరమున=తాత (తల్లి తండ్రి) గారి తరువాత, విశ్వంభరా, భారము=భూమియొక్క బరువును (రాజ్య పాలనమును), కీర్తి, కాయము=కీర్తియనెడు శరీరము, లావణ్య, తారుణ్య విలాసములచేతను = చక్కదనముచేతను, పడుచుఁదనముచేతను, శృంగారచేష్టల చేతను, మెట్టిన, ఇంటికి = అడుగుపెట్టిన యింటికి (అత్తవారింటికి). లలామ=శ్రేష్ఠురాలు, గాఢము+ఐన, వలపు = దృఢమైనప్రేమ.

పుట:—118. అగ్రజన్ముఁడు=ముందు పుట్టినవాఁడు (పెద్దవాఁడు) సమయ+ఉచిత (గుణసంధి), బుద్ధి, కుశలతను = సమయమునకుఁదగినట్టి బుద్ధియొక్క నేర్పునను, ప్రకృతి, జన, రంజనము = రాజ్యములోని ప్రజల నానందపఱచుట, చరితార్థము = సఫలము, సుఖ+ఆసీనుఁడై=హాయిగాఁ గూర్చుండినవాఁడై, మందమలయ+అనిలుఁడు = మెల్లగా వీచుచున్న మలయవాయువు, పొడుపుకొండ=ఉదయాద్రి (తూర్పుకొండ) రావము=శబ్దము.

పుట:—119. బాష్పములు=కన్నీళ్ళు, అంగన=స్త్రీ, విస్మయ గర్భితము = లోన ఆశ్చర్యముగలది, గృహకృత్య. నిర్వహణమునందు = ఇంటిపనులు నెరవేర్చుకొనుటయందు, వాలకమును=వేషమును, అగాధము+ఐన=లోఁతైన.

పుట:—120. పరంపరలు+ఐ=వరుసలు వరుసలై, పొడమి=కలిగి, అతిగంభీర మైన = మిక్కిలి లోఁతయిన, మనస్+సాగరమందు=మనస్సనెడి సముద్రమునందు, మకరము=మొసలి, తిమింగలము=పెద్దజాతికిఁ జెందిన భయంకరమగు నొకచేఁప, ఉన్మత్తునివలె = పిచ్చివానివలె, సాధ్వీ=పతివ్రత, ఉత్తమ, వంశ, సంజాతలు = మంచికులమునఁ బుట్టినవారు, చిచ్చు+ఉఱికి = నిప్పులో దుమికి, సత్+ఆచారము=పెద్దల సంప్రదాయము, యుక్త+అయుక్త విచక్షణఁజ్ఞానము=మంచిచెడ్డలు గూర్చి యాలోచింపఁగలబుద్ధి.

పుట:—121. నిర్+అంకుశమై= అడ్డులేనిదై, విశృంఖలము = కట్టులేనిది, ఆరయువలయును=పరీక్షింపవలెను, విచార, గ్రస్తుఁడై=విచారముచేత మ్రింగఁబడిన

వాఁడై, బొంది=శరీరము, అక్కజము+పడి=ఆశ్చర్యపడి, పరాయత్తము=ఇతరమునకు లోబడినది (స్వాధీనము తప్పినది), అపచారము=తప్పు.

పుట:—122. విన్నదనమునకు=దుఃఖమునకు, అనవుడున్=అని పలుకఁగా, సన్నాహము=ప్రయత్నము, తెరలు=అడ్డువలలు, దీపములు=మృగములను బత్తులను ఆకర్షించుటకై వేటగాఁడు పెంచునట్టి (సజాతీయములగు) మృగపక్ష్యాదులు, ఉరులు-ఉచ్చులు = మృగపక్ష్యాదులను బంధించు వలత్రాళ్ళు, సకల, కళ్యాణ, లక్షణ, లక్షితంబులు=అన్ని శుభలక్షణములచే గుర్తింపఁబడియున్నవి, ఆయత్తము = సిద్ధము, మృగయా, క్రీడకు=వేటయనెడు ఆటకు, అశ్వ + ఆరూఢుఁడై = గుఱ్ఱమెక్కినవాఁడై, సపరివారముగా=సేవకులతోఁగూడ, జీవిత+ఈశ్వరుఁడు (గుణసంధి) = ప్రాణనాథుఁడు (భర్త), దుస్+ సహము=భరింపరానిది, వేదనన్ = బాధను, భర్తృ, విగ్రహము=భర్తయొక్క రూపమును, దోయి=జత, దృష్టిపథము=చూపునకందుమార్గము, శయన+అగారము=పడకటిల్లు, మనః+వ్యాధులకు=మనస్సునకుఁ బట్టిన జబ్బులకు (విచారములకు), విషాదము=విచారము, శేషము=కొంచెము, మందగింపలేదు=తగ్గలేదు.

పుట:—123. మనోరథములు=కోరికలు, జగత్+మాత = లోకములకుఁ దల్లి, సమారాధనము=పూజ, అంతఃకరణముతో=మనస్సుతో, మనః + వేదన = మనస్సునందలి బాధ, జగత్+జననీ=లోకమాతా! కుతూహలము=వేడుక, సావధానవై=శ్రద్ధతోఁ గూడినదానవై, ఆకర్ణింపుము = వినుము, సన్నలనే = సంజ్ఞలందే, బిట్టు+అలుక=ఎక్కువకోపము విచార+ఆక్రాంత, చిత్తులై = విచారముచే నాక్రమింపఁబడిన మనస్సుగలవారై.

పుట:—124. అలుక=కోపము, అంగన=స్త్రీ, సకల, భూత, హృదయ, వర్తిని=సమస్తజీవులయొక్క మనస్సులందుండుదానవు, పూజా+అగారము=పూజాగృహము, గద్గదము+ఐన = తొట్రుపడుచున్నదైన.

పుట:—125. ఉత్తరీయమునన్ = పైమీఁది వస్త్రముతో, భీకర+అటవులకు=భయంకరమైన యడవులకు, అనియునట్లు = పగులునట్లు, పెల్లు = పెద్దగా, అమానుషశక్తి=మానవుల కుండనంతటి బలము, ఆక్రందనము=ఏడుపు, సముచిత+ఉపచారములు=తగిన సేవలు, స్పృహ = తెలివి, ఈ, పరమసాధ్వి, బలవత్+మరణమునకున్ = మిక్కిలి పతివ్రతయైన యీమెయొక్క బలవంతపు చావునకు, ఖేదము+పడుచు=దుఃఖపడుచు.

పుట:—126. విడసిన=బసచేసిన, సంభ్రమము=వేగిరపాటు, కదురన్ = వ్యాపింపఁగా, ప్రాయశ్చిత్తము=చేసినపాపమును దొలఁగించుటకై చేయుకర్మము,

శిరసావహించి=తలతోఁబూని, శోధించినవారు=పరీక్షించినవారు, శైత్య+ఉపచారములు=చల్లదనము కలిగించునట్టి సేవలు కర్ణ, కఠోరము = చెవులకు (విని) కఠినమైనది, శ్రవణ, గోచరము=చెవులఁబడినది.

పుట:—127. సంజీవని = చచ్చినవారిని బ్రతికించునది, మాయురశ్వము = ప్రేమనుసు గుఱ్ఱము, హారువము, అశ్వము=గుఱ్ఱము; తఱటుచేసి=కొరడాతోఁగొట్టి, కశాఘాతములు =కొరడాదెబ్బలతో.

పుట:—128. వ్యాఘ్రము = పెద్దపులి, పటుత్వము=బింకము, ఆపాద, మస్తకము =పాదములు మొదలు తలవఱకు(శరీరమంతయు) అమానుష,వర్తనము=మనుష్యుల కతీతమైన నడవడి, మూఢమతియై=బుద్ధి తక్కువవాఁడై, ఆహుతి = అగ్నియందు వేల్చిన వస్తువు.

పుట:—129. దారువు+ఓ=కఱ్ఱయో, శిలయో = రాయో, మగనాలు = భర్తగలస్త్రీ, చిచ్చు+ఉఱుకుట=అగ్గిలో దుముకుట, భార్యా, సహగమన, సంప్రదాయము = భార్య చనిపోయినంతనే భర్తయు నామెతోపాటు చనిపోవు నాచారము (చనిపోయిన భర్తను స్త్రీ యనుగమించు పద్ధతి ప్రసిద్ధమైయున్నది. అట్లే చనిపోయిన భార్యను పురుషుఁ డనుగమించు పద్ధతి క్రొత్తగాఁ దానేర్పఱచునట్లు భర్తృహరి చెప్పుచున్నాడు). బాష్పజలము చే=కన్నీటిచేత, శోక+అగ్నిన్ =దుఃఖమనెడు నగ్గిని, తునియలు=ముక్కలు, వాపోవు = విచారించు.

పుట:—130. యతి+ఈశ్వరులు (స॥ దీ॥ సంధి)=మునీంద్రులు, ఆశ్రమ ధర్మ విరుద్ధముగా—ఇట ఆశ్రమ మనఁగా సన్యాసాశ్రమమని యర్థము—సన్యాసాశ్రమము గైకొన్నవారికి భౌతికవిషయము లందాసక్తి యుండరాదు. తత్సంబంధములగు లాభనష్టములవలన సంతోష విషాదము లందరాదు. దీనికి భిన్నముగా వర్తించుట ఆశ్రమ ధర్మవిరుద్ధమగును.

పుట:—131. కళత్రము=భార్య, శ్రవణ, గోచరములు=చెవులఁబడినవి, పటాపంచలై=దూరమై (నశించి) మనః+గగనమున=హృదయమనెడు ఆకాశమున, శోక+అంధకారము=విచారమనెడు చీఁకటి, విచ్చుకొనంగ్గ+అరయ్యెను=చెల్లాచెదరయ్యెను.

## ప్రశ్నోత్తరములు

### 1. భర్తృహరి జన్మవృత్తాంతమును వివరింపుము.

గోదావరీనదీతీరమున మధురయను పుణ్యనగర మొకటికలదు. దానిని శ్వంగారశేఖరుఁ డనురాజు పాలించుచుండెను. అతఁ డొకనాఁడు మంత్రి సామంతాదు

లతో సభదీర్చియుండ, మన్మథునివలె మోహనాకారుఁడగు నొకబ్రాహ్మణుఁడు వచ్చి యతని యెదుట నిలిచెను. రాజా నూతన పురుషుని గాంచి, లోకాతీతమగు అతని రూపసంపద కాశ్చర్యపడి, యాతని వృత్తాంతము తెలియనడిగెను. బ్రాహ్మణు డాతనికిఁ దనపేరును జెప్పి, తన సమస్తశాస్త్రపాండిత్యమును దెల్పి రాజాశ్రయ మును గోరెను. రాజందుల కంగీకరింపఁ జంద్రగుప్తు డాస్థానపండితుఁడుగఁ గుదిరి సుఖజీవనము గడుపుచుండెను.

ఒకనాఁడొక ముసలిది చంద్రగుప్తుని కడకుఁబోయి శృంగారశేఖరమహారాజుగారి సేనాపతియగు వీరవర్మకూతురు మదనరేఖ చంద్రగుప్తుని రూపురేఖలు చూచి వలచి కామాంధయై తన్నాతఁడు పెండ్లాడకున్నఁ బ్రాణములు వీడ సిద్ధముగా నున్నదని దెల్పెను. నైష్ఠికుఁడగు తాను శూద్రస్త్రీని పెండ్లాడుట పాడిగా దని చంద్రగుప్తుడు ముసలిదానిని బంపివేసెను. మదనరేఖ దీనయై కృశించి మన్మథ వేదన కాహుతి కానుండెను. ఈవార్త మదనరేఖ చెలికత్తె లామె తండ్రి వీరవర్మ కెఱిఁగించిరి. వీరవర్మ తన రాజగు శృంగార శేఖరునికి దన కూఁతు నవస్థ తెల్పెను. అంతట రాజు చంద్రగుప్తుని రావించి, బ్రాహ్మణుఁడు ఆచార నిష్ఠలు దెల్పి తిరస్కరించినను పెక్కురీతుల నొప్పించి, యొకయుపాయము మున్నదని జెప్పి బ్రాహ్మణుఁడు మొదట బ్రాహ్మణకన్యను, తరువాత క్షత్రియకన్యను, తదుపరి వైశ్యకన్యను, నటుమీఁదట శూద్రకన్యను వివాహమాడవచ్చునని తెల్పి పురోహితుఁడగు విష్ణుశర్మ కూఁతును, పెండ్లాడి, పిమ్మట తన కూఁతురగు రాగమంజరిని, అటుపైని, తన కోశాధ్యక్షుఁడగు ధనగుప్తుని పుత్రిని, పిమ్మట వీరవర్మ పుత్రి మదనరేఖను పెండ్లాడుమని కోరెను. చంద్రగుప్తుడు రాజు ప్రార్థనను మన్నించి నలుగురు భార్యలను పెండ్లాడెను.

చంద్రగుప్తునికి బ్రాహ్మణ భార్యవలన వరరుచియు, క్షత్రియ భార్యవలన విక్రమార్కుఁడును, వైశ్యభార్యవలన భట్టియు, శూద్రస్త్రీవలన భర్తృహరియుఁ బుట్టిరి. భర్తృహరి విక్రమార్కునికి సేనాపతియై, మేటిపండితుఁడై సుభాషిత రత్నావళిని రచించి దిగంత విశ్రాంత కీర్తి నార్జించెను.

**౪. భర్తృహరి తనభార్య నేల యనుమానించెను? దాని పరిణామ మేమి?**

భర్తృహరి భానుమతియను నామెను వివాహమాడెను. భానుమతి మహా పతివ్రత, భర్తృహరి మహా మేధావంతుఁడు, అట్టివారికి విధిబలమున మాటమాత్రముచేత

విభేదము పొడచూపి, భానుమతి యకస్మాన్మరణమునకును భర్తృహరి సన్న్యసించుటకును గారణమాయెను.

విక్రమార్కుఁడు వరరుచి, భట్టి, భర్తృహరుల తోడ్పాటుచే ప్రజారంజకముగ రాజ్యము చేయుచుండెను. భర్తృహరి యొకనాఁడు భానుమతీ సహితుఁడై తన మేడపైఁ గూర్చుండియుండెను. ఇంతలో నొక జనసమూహము భేరీరావములతో నామార్గమున వచ్చెను. ఆ మహాకోలాహలమును జూచి భానుమతి యదియేమి యని భర్త నడిగెను. ఒకఁడు మరణింప మహాపతివ్రతయగు నాతని భార్య సహగమనము చేయుటకు స్మశానమున కేగుయుత్సవమది యని భర్తృహరి చెప్పెను. భానుమతి చిఱునవ్వు నవ్వి, భర్త మృతినొందినచో సహగమనము చేయుటకై భార్య శవముతోఁగూడ వెళ్ళవలయునా? అనెను. ఈమాట భర్తృహరికి వేఱుగ నర్థము స్ఫురింపజేసెను. అతఁడు తన భార్య పతివ్రత కాదనియు, తన యనంతర మామె సహగమనము చేయదనియు ననుకొనెను. భానుమతి భావ మది కాదు. భర్త మరణవార్త వినఁగానే భార్య ప్రాణములు వీడుట పతివ్రతా లక్షణముగాని, నడచి వెళ్ళునంతటి వ్యవధానముండదని యామె తలంపు. భార్యాభర్తలీవిషయముపై నిఁక మాటలాడుకొనలేదు.

భర్తృహరి నాఁటియుండియు విచారగ్రస్తుఁడై యుండెను. భర్త దిగులు గని పెట్టి భానుమతి యాతని ననేకరీతుల నోదార్పఁజూచి తనయందేదైన తప్పున్నచో క్షమించుమని వేడెను. కాని భర్తృహరి తన భార్య భావమును బరీక్షింప నెంచెను. "కాలక్రమమున నా విచారమునకుఁ గారణము నీవే యెఱుఁగఁగలవు" అని మాత్రము చెప్పి యాతఁడు భార్యతోఁ జెప్పక వేటకుఁ వెడలిపోయెను. భర్త విముఖతకు భానుమతి మిక్కిలి వగచెను. ఆమె పలురీతుల దేవతారాధన లారంభించెను. తన భర్త సురక్షితాగమనమును వేడెను. ఆమె తన మనమున పెక్కు యోచనలు చేసి తానానాఁడు స్త్రీ సహగమనమునకు నడచిపోవలెనా యన్న మాటలు భర్త యపార్థము చేసికొనెనేమో యనుకొనెను. ఇంతలో నొక సేవకుఁడు వచ్చి భయంకరమైన పెద్దపులి భర్తృహరిని తుదముట్టించెనని చెప్పెను. ఆమాట చెవిని బడినదే తడవుగ భానుమతి నేలఁగూలి ప్రాణములు వీడెను. అది మూర్ఛకాదు. నిజమైన మరణమని యాసేవకుఁ డెఱిఁగి పలుగు పలుగునఁబోయి 'మీయబద్ధపు మరణవార్త చెప్పుటచే నాక్షణముననే ప్రాణము వీడిన మీభార్య మరణవార్త దెలుప వచ్చితి'నని జరిగిన సంగతి తెలిపెను. వడిచి కూర్చుండియాతడ తెచ్చిపెట్టుకున్న భర్తృహరి వెంటనే గుఱ్ఱముపైఁబడి స్మశానభూమికరుగుఁ. తేరు నప్పటి బంధువులు దహనముతోఁ భానుమతి శవమునటకుఁ దెచ్చిరి. భర్తృహరి

యుడి మోచి మూర్ఛిల్లెను. స్మృతివచ్చి యాతఁడు మిక్కిలి విలపించి, భార్యదేహము దహనము చేయుచున్న చితిలోఁ బడఁబోయెను. బంధువులాతని వారించిరి. పాతివ్రత్య విశేషము తెలియుటలో నిట్లతఁడు తన భార్యను గోల్పోయెను. అతనికి మనస్సు మనస్సులోలేదు.

భర్తృహారికి వైరాగ్యము గరపదలంచి యొక సన్యాసి యొక మఱిచెట్టు క్రింద, గూర్చుండి తన చక్కని కమండలమును ముక్కలుగాఁ గొట్టి, యా ముక్కలన్నియు నొకచోటఁ గూర్చి తన ప్రియ కమండలమును గూర్చి యేడువఁ దొడఁగెను. అందఱు నది వింతఁగాఁ దోచెను. భర్తృహారిని బంధువులటకుఁ గొనిపోయిరి. ఆ సన్యాసిని గూర్చి పలువురు పలురీతుల తలపోయఁ దొడఁగిరి. కొందఱతఁడు జ్ఞానియనుకొనిరి "మీచేతిలోఁ బగులగొట్టుకొన్న కమండలముకొఱ కేడ్వఁదగునా" యని భర్తృహరి సన్యాసితో ననెను. అంతట సన్యాసి "నీ భార్యను చేతులారఁ జంపుకొని యేల యేడ్చెదవు. నా కమండల మెట్టి ఘటమో, నీ భార్యయు నట్టి ఘటమే. నా కమండలమదుకుట యెట్టియసాధ్యమో నీభార్యను బ్రతికించుటయు నట్టి యసాధ్యము" అనుచు భర్తృహారికి జ్ఞానోపదేశము చేసెను. భర్తృహారికి జ్ఞానోదయమాయెను. అతఁడు సన్యాసి యాయెను.

3. వాగ్భేదమెట్టి యాపద తెచ్చెనో భర్తృహారికథను బట్టి తెల్పుఁడు?

4. శేముషీమంతుడగు భర్తృహారి యెట్టి ప్రమాదమునకు గురియాయెను? లేక (విమర్శారహితమైనతొందరపాటు ఎట్టిఫలితముల నొసఁగును)

5. భర్తృహారికి వేదాంత జ్ఞానోదయ మెట్లాయెను?

పైమూఁడు ప్రశ్నల సమాధానమునకు రెండవప్రశ్న తా॥ విషయమును జూచునది.

6. ఈక్రిందివాక్యములకు సందర్భ సహితవ్యాఖ్యవ్రాయుఁడు.

1. బంగరు పళ్లెరమునకు గోడచేర్పు.

బంగరుపళ్లెమెంత విలువగలదైనను ఆ పళ్లెమును గోడకు చేర్చవలసి యుండును. గోడ అల్పమైనది, అయినను బంగరుపళ్లెరముకు నది యాధారమగుచున్నది. అట్లే యెంతొక్కువక్కువ్వాడు తక్కువవాఁడైనను గొప్పవానికి దోడ్పడి యా గొప్ప వాని మహిమను బ్రకాశింపఁ జేయును. చంద్రగుప్తుఁడను బ్రాహ్మణుఁడు తన

విద్యాధిక్యతను శాస్త్రపటిమను, కవితాశక్తిని దెల్పి, రాజాశ్రయము లేనిదే తన శక్తులు ప్రకటితములు గావు గాన రాజునండను జేరఁదలఁచి వచ్చితినని శృంగారశేఖరరాజును వేడెను. ఇట కవిరాజు నల్పత్వమును సూచించె ననుకొనరాదు. గోడ దాపులేనిదే బంగరుపళ్ళెము ప్రకాశింపనట్లు రాజాశ్రయములేనిదే తన శక్తులు ప్రకటితము గావని చెప్పుకొని ఆశ్రయము గోరెను. సరసుఁడగు ఱేఁడు కవి కోరికను మన్నించి వాని నాస్థాన కవిగాఁ జేసెను. దారిద్ర్యము సాధారణముగా కవి పండితులను వెన్నాడుచుండుననియు, రాజాశ్రయము గలవారిని దారిద్ర్యము వీడిపోయి రాజాశ్రయము లేనివారి నాదారిద్ర్యము పట్టుకొనుననియుఁ లక్ష్మీనరసింహముగారు వ్రాసిరి. రాజును జేరుటచే చంద్రగుప్తునికి దారిద్ర్యమనునది తొలఁగిపోయి యాతఁడు సుఖజీవనుఁడాయెను.

2. కంచెయే చేను మేసినప్పుడు, తల్లియే విషము పెట్టినపుడు.

చేనికి రక్షణగా కంచె వేసికొందురు. ఆకంచె, వెలుపలి మృగాదులను చేనిలోనికి రానీయక చేని పంటను గాపాడును. ఒకవేళ కంచె విపరీతముగా బెరిగిపోయి, చేనిలో పంట పెరుగకుండ చేసి వేసినచో చేను నాశనమైపోవును. అట్టియెడ రక్షకుఁడు భక్షకుఁడాయె నందురు. ఈ మాటలు చంద్రగుప్తుఁడు శృంగారశేఖర మహారాజుతో ననెను. నైష్ఠికుఁడును, బ్రాహ్మణుడును, మహాపండితుఁడును నగు చంద్రగుప్తుని, శూద్ర కన్యను పెండ్లాడుమని రాజన్నప్పుడు చంద్రగుప్తుఁ డిట్లనెను. వర్ణాశ్రమ ధర్మరక్షణమునకు రాజు నెన్నుకొందురు. దేశమునందు ధర్మభంగము గలుగకుండఁ గాపాడుట రాజుయొక్క ప్రథమకర్తవ్యము. అట్టి పని చేసి బలహీనులను రక్షింపవలసిన రాజే బ్రాహ్మణుఁడు శూద్ర కన్యను వివాహమాడవలెనని చెప్పుట ధర్మవిరుద్ధమనియు, ప్రాణత్యాగమైన చేయుదుగాని ధర్మహాని కంగీకరింపననియు చంద్రగుప్తుఁడు రాజుతో నీ మాట లనెను.

తల్లికంటె బిడ్డకు గొప్పరక్షణ యుండలేదు. తల్లి తన ప్రాణమునైన అపదకు గురిచేసి తన బిడ్డను గాపాడును. అట్టితల్లియే తనబిడ్డకు విషము పెట్టు పరిస్థితి గలిగినచో నిక రక్షణ మెక్కడిది? ఈయుపమాన వాక్యమునుగూడ నదేసందర్భమున చంద్రగుప్తుఁ డనెను.

3. మనోవ్యాధులకు మాటలుమందులగునా?

భర్త చనిపోగా భార్య సహగమనము చేయుటకు నడచివెళ్ళవలెనా అని భానుమతి యన్నమాటలను భర్తృహరి యథార్థముగా గ్రహించి యామె సాధ్వి కాదనుకొని యామెను బరీక్షింపవలె ననుకొనెను. ఒకనాఁడతఁడు వేటకు [illegible]

చేరెను. ఆనివఱ కెప్పుడును భార్యతోఁ జెప్పక వెడలెడివాఁడుగాఁడు. అప్పుడు భార్యపైఁ గ్రోధమూని యుంటచే నామెతోఁ జెప్పకయే భర్తృహరి వేఁటకుఁ బోఁగా భానుమతి మిక్కిలి విచారించెను. దుస్సహవేదనను బొందెను. తనపడకటింటిని జేరి తన యవస్థనుగూర్చి యేడ్వఁ దొడఁగెను. ఆమె నోదార్చుటకుఁ బరిచారికలు తియ్యని మాటలెన్నో చెప్పి యామెను శాంతపఱచుటకు పెక్కుయత్నములు చేసిరి. అవి యెల్లను వ్యర్థమాయెను. దేహధారులకు శారీరక వ్యాధులును మనోవ్యాధులును నుండును. శారీరక వ్యాధులు మందులచేఁ జాలమట్టుకుఁ గుదురవచ్చును మానసికవ్యాధులట్టివిగావు. ఒకవేళ స్నేహితులమాటలు మానసికవ్యాధులను దగ్గింపఁ గలవేమో. ఇట చెలికత్తెల మాటలచే భానుమతి మనోవ్యాధి శాంతింపక పోఁగా గ్రంథకర్త యీమాటలనెను.

4. వడిచి కూర్చుండి మహాపద దెచ్చుకొంటిని.

ఇదియొక జాతీయపునుడికారము. తగినంత కారణము లేకుండ ఊరక ఆపదలు మీఁదికి దెచ్చుకొన్నప్పు డిట్లందురు. వడిచి కూర్చుండి యనఁగా సుఖముగా నన్నముదిని ఊరక గూర్చుండుట. భర్తృహరి సుఖముగ మేడమీఁద భార్యతో గూడి కూర్చుండి, సహగమనపు టుత్సవ వర్ణన సందర్భమున భార్యయన్నమాటలపార్థముగాఁగొని, యామెను బరీక్షింపఁ దలఁచి తాను వేఁటకుఁ బోయి వేటలో తాను మరణించినట్లు భార్యకు వర్తమానము చేసెను. ఈమాట వినఁగానే భర్తృవియోగము క్షణమైన సహింపని భానుమతి ప్రాణములు వీడెను. తన యబద్ధపు మరణవార్త భార్యకు బంపి భార్యప్రాణము లాతఁడు పోఁగొట్టుకొనెను. ఈ సందర్భమున భర్తృహరి యిట్లనుకొని పశ్చాత్తప్తుఁ డాయెను.

——

# కాలస్వరూపుఁడు

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

## సాక్షి

**కవిజీవితాదులు :—**

ఆంగ్ల సారస్వత సంపర్కము ఆధునికాంధ్ర వాఙ్మయమును నన్ని రంగముల మీఁదను చెఱిగిపోని ముద్రలను వేసినది. ఆంగ్లభాషాప్రభావముచే నీ వాఙ్మయమున వచన రచనమునకు హద్దులేని వ్యాప్తి కలిగినది. నవలలు, నాటికలు, ఖండకావ్యములు, మొదలైనవేర్పడినవి. భావప్రధానమగు కవితారీతి యుద్భవిల్లెను. పలురీతుల వార్తాపత్రికలు, సంచికలు మొదలైనవి వ్యాపించెను. ఆంధ్రదేశమున నీ నూతనసాహిత్య శకమునకు కందుకూరి వీరేశలింగముగారు ప్రవర్తకులనఁదగును. పానుగంటి లక్ష్మీనరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహము, కూచినరసింహము మొదలగువారు వీరేశలింగయుగమునకు ప్రోద్బలము నిచ్చిరి. ఈముగ్గురిని కలిపి ఏకవర్గముగాఁ జేసి సింహత్రయ మనుచుండిరి. వీరిలో వీరేశలింగముగారు బ్రహ్మసమాజ మతమును ప్రత్యక్షముగ నవలంబించి సంఘసంస్కరణము మతసంస్కరణమునకు తమ సారస్వతసేవను ప్రబలముగా చేసిరి. చిలకమర్తివారు వీరేశలింగముగారి శిష్యులై ప్రచారము సాగించిరి. ఇంచుమించుగ నదేకాలమువారైన పానుగంటి లక్ష్మీనరసింహముగారు సనాతన ధర్మపరులు. ఇంట దేవతార్చనములు సాగించినవారు, సంఘమునందు ప్రచలితములైయున్న మూఢాచారములను, విరుద్ధభావములను వేషభాషల చర్యలను లలితముగను హాస్యపూర్వకముగను నాక్షేపించి ప్రజాసేవచేయుఁబూనిరి. వీరేశలింగముగారు వివేకవర్థనీ పత్రికను తమ ప్రచారమునకు సాధనముగాఁ జేసికొన్నట్లు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమ సాక్ష్యుపన్యాసములను, తమ సంఘసేవాగమనమునకు రథముగాఁ జేసికొనిరి. వీరి కాంగ్లమున గొప్పపాండిత్యము గలదు. ఆంధ్రమున పెక్కునాటకములు ప్రహసనములు వ్రాసిరి. ఆంగ్లమున స్పెక్టేటరు (చూచువాఁడు, సాక్షి) టాట్లరు మొదలగు పత్రికలు సంఘసంస్కరణమునకుఁ వాడఁబడెను. ఆపత్రికలకు బహుళ ప్రచారము గల్గెను. వీరేశలింగముగారి వివేకవర్థని, పానుగంటివారి సాక్షి యుపన్యాసములను పై యాంగ్లపత్రికలవంటివే. ఇవి వార్తాపత్రికలు గావు. కేవల భాషాపత్రికలును కావు. సాక్షియుపన్యాసములు ఆంధ్రపత్రికయందుఁ బ్రకటింపఁ

బడుచు, క్రమముగఁ బుస్తకరూపము ధరించి వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారిచే ఆఱుసంపుటములుగ గ్రంథరూపమున బ్రకటింపఁబడెను. ఆంధ్రదేశమున సాక్షి సంపుటములులేని గ్రంథాలయములు లేవనవచ్చును. పాఠశాలా గ్రంథాలయములును సాక్షి సంపుటములను దాచుకొన్నవి. ఈయుపన్యాసములు, జంఘాలశాస్త్రియను పేరివాఁడు చేసినట్లు సాక్షి కన్నులారఁ జూచిన విషయములను విన్నవిషయము లను లోకమునకుఁ బ్రకటించినట్లును గల్పింపఁబడినది. సాక్షిసంఘమను నొక సంఘము కల్పింపఁబడినది. దీనిలో కాలాచార్యుఁడు, జంఘాలశాస్త్రి, సాక్షి, వాణీదాసు, బొఱ్ఱయ్యసెట్టి యను నైదుగురు సభ్యులు కల్పింపఁబడిరి. ఈయుపన్యాసములు మాటుగా జేసికొని, ఆంధ్రదేశమందును, నితరదేశభాగమందును, సంఘము మతము, భాష, ప్రజలవేషములు, ఆచారవ్యవహారములు, భావములు, జీవితపద్ధతులు మొదలగు పెక్కువిషయములందు వ్యాపించియున్న మంచివిషయములను బ్రసంసించి, చెడ్డవిషయములని వారికిఁ దోచినవానిని లలిత హాస్యమున నాక్షేపించి, ప్రజల మనస్సులను చెయిపెట్టి కలచినట్లు కదిపివేసిరి. వేలకొలది ప్రజలు సాక్షి ఉపన్యాసములకొఱకు వడిగాపులుపడియున్న దినములుగలవు. ఆంధ్రపత్రికలో 1918 ప్రాంతమునుండి పదునైదు సంవత్సరములపాటు ఎడనెడ నీ యుపన్యాసములు ప్రకటింపబడుచుండెను. ఈ యుపన్యాసముల మూలమున ప్రజలకెంతయో యానందమును విజ్ఞానమును సంస్కారణాభిలాషయు, సేవాబుద్ధియు చేకూరెను. ఈరచనలు పండితపామరరంజకములు. వీనిలో వేదశాస్త్రములందలి మఱుగులును, పురాణములు, కావ్యములు ప్రబంధములు మొదలగువానిలోని విషయములును, మత ధర్మసంప్రదాయములును సందర్భానుసారముగ నుద్ఘాటింపఁబడినవి. పానుగంటివారి మేధస్సు నకుఁగల బహుముఖ ప్రజ్ఞలకెల్లరును నద్భుతపడిరి. వీరు విదు రామాయణ నాటకములు, సారంగధర, ప్రచండచాణక్యము, కోకిల, నర్మదాపురుకుత్సీయము మొదలగు నాటకములను వ్రాసిరి. వీరి రచనలు ధర్మబోధకములును నీతిబోధకములును నైనను చప్పిడి మాటలతోఁ జెప్పక సరసమైన హాస్యముతో నిండి తొణుకుచుండును. ఊరక నవ్వించుటకుఁగాక సత్యమును బయటపెట్టుటకు వీరు హాస్యమును వాడిరి. వీనిని విన్నవారును చదివినవారును తమయందున్న లోపము లెత్తి చూపబడినపుడు లోలోన నాత్మపరీక్ష చేసికొని తమ్ముదాము సంస్కరించుకొనఁ జూతురు గాని సాక్షిసంఘముపై శత్రుభావముతో విఱుచుకొనిపడరు. దీనికిఁ గారణమీ యుపన్యాసములందలి హాస్యమే కారణము. ఈ హాస్యమునకు లలితమైన భాష తోడ్పడెను. ఎక్కడను కటువుగను కఠోరముగను, బాధాజనకముగను గనఁబడదు. కొన్నియెడల వీరచనలలోని హాస్యము సామాన్యుల బుద్ధి కందదు. పండితులుగూడ

యోచించినఁగాని రచయితయొక్క హృదయము దొరకదు. పూర్తియర్థము గ్రహించుటకు సంప్రదాయముల జ్ఞానమును భాషాపటిమయును విజ్ఞానము నవసరములు. ఉపన్యాసములు గంగాప్రవాహమువలె అడ్డులేని గమనము గలవి. ఇందలి పదములు మధురములు, అపూర్వమైన భావనములను రేకెత్తించునవి. అపారమైన జ్ఞానమును వెదజల్లునవి. మొత్తముమీఁద కొంతవిద్యార్హతయు విజ్ఞానార్హతయుఁ గలవారికే యీ యుపన్యాసము అర్థములగును. నవనాగరికత లక్షణము లెఱిఁగి పాఠశాలలందును కళాశాలలందును విద్యనార్జించి, ఆంధ్రసంస్కృత సాహిత్యము లెఱిఁగిన యువకులకును పెద్దలకును నీ వ్రాత లుద్దేశింపఁబడినవి. లక్ష్మీనరసింహారావుగారు గొప్ప అనుభవజ్ఞులు. వీరు యాదవోలు లక్ష్మీనరసాపురము, పిఠాపురము జమీందారీలలో దివానుగను సలహాదారుగను పనిచేసిరి. చివరకు పిఠాపురమువాసులై గొప్పసన్మానముల నొందిరి.

ఉపన్యాస సారాంశము:—

ఈ యుపన్యాసమున జంఘాలశాస్త్రి తన యనుభవములను వివరించెను. లక్ష్మీనరసింహారావుగారే జంఘాలశాస్త్రియని యూహింపవచ్చును. సాక్షి ఈ యుపన్యాసమును విని లోకమునకుఁ దెల్పెను. ఇందు మొదటి మూఁడుపుటలలో జంఘాలశాస్త్రి అంతర్వేది లక్ష్మీనృసింహస్వామి తీర్థములో తాను ప్రత్యక్షముగా జూచిన విషయమును దెల్పెను. తీర్థదృశ్యముల నన్నిటిని దెల్పలేదు. తీర్థములకు ఉంకెలరాట్నములవాండ్రు, కాశీపటములు అద్దములలో చూపువారు మొదలగువారు వత్తురు. ఆ సందర్భములందు ప్రజలు పూర్వము తాము చూచిన విషయములనే మరల చూడఁగోరుదురు. తెలిసినవారును చదువుకొన్నవారునుగూడ ఇతరులు చెప్పిన ప్రకటనవాక్యములకు దాసులైపోయి, కాశీపటములు చూచుట, ఉంకెలరాట్నము లెక్కుట మొదలగు పనులు చేయుదురు. పటములు చూపువాఁడు ప్రాతపటములు గావు క్రొత్తవి అనిచెప్పి, పాతడబ్బుకాదు, (4 దమ్మిడీలు) క్రొత్తడబ్బే కదయ్యా అనిచెప్పి, ఐదుగురున్నారు ఆఱవవాఁడవు కావయ్యాయని బలాత్కరించి, భ్రమగొల్పి, జంఘాలశాస్త్రిని పటదర్శనమునకు లోనుగావించెను. ఇట జంఘాలశాస్త్రి కల్పితుఁడే. తీర్థములందు ప్రజలిట్లు ప్రవర్తింతురనియు, శబ్దముయొక్క బలమిట్టిదనియు, తీర్థములు మొదట మంచియుద్దేశములతో నిర్మింపఁబడినను, నందుచాల అనర్థవిషయములు గలవనియుఁ దెల్పదలఁచి సాక్షి యీ యుపన్యాసమునుచాటెను.

ఈమూఁడు పుటలలో కన్నులారఁ జూచిన తిరునాళ్ళ అనర్థములు వర్ణింపఁబడెను. ప్రజలు గొఱ్ఱెలవంటివారు. ఇతరులు చెప్పిన మాటలకు లొంగిపోయి, మతధర్మములను నమ్ముదురనియు, బుద్ధుఁడు, శంకరాచార్యులు, రామానుజాచార్యులు

మొదలగు మతకర్తలు తమ లోకాతీత ప్రజ్ఞావిశేషములచే మతములను స్థాపింపఁగా వారి తరువాతి కాలమున నామతములు భ్రష్టములై పోయెననియు, కాలప్రవాహమిట్లు పవిత్రముగాఁ బుట్టి యపవిత్రమైపోవుననియుఁ దెలుపఁ జంఘాలశాస్త్రికి నిద్రయందు స్వప్నము కల్పించెను. నిద్రలో కాలపురుషుఁడు జంఘాలశాస్త్రి తలను కొంచెము త్రిప్పివేసి, యాతనికి సింహావలోకన శక్తి నిచ్చెను. బుద్ధుని కాలమునుండి మధ్వాచార్యుల యంతము వఱకును కాలమున జరిగిన మతపు పరిస్థితుల నతనికిఁ జూపెను. దీని బట్టి మనము మన దృష్టి యొకమాఱు వెనుకకు మఱలించి చూచిన మతములయొక్క గతి మనకు దెలియునని వ్యాసకర్త యుద్దేశము. ఈపూర్వచరిత్రా పర్యవేక్షణమున లక్ష్మీనరసింహారావుగారు శంకరాచార్యులకుఁ గొంత క్రౌర్యము సంఘటించెను. కూరనాథుఁడను రామానుజ శిష్యునికిఁగల గురుభక్తిని నపారత్యాగముగ వర్ణించెను. బౌద్ధమతము, శాంకరమతము, రామానుజ మతములయొక్క పతనకాలములయందలి యనాచారము అను చమత్కారముగ నాక్షేపించెను. వ్యాసకర్త నిష్పాక్షికుఁడై వస్తుస్థితిని యథార్థముగ వర్ణింపవలెను. వీరును చాలవఱకట్లే చేయ నెంచిరి. మధ్వమతమును గూర్చి వీరంతగ వ్రాయలేదు. అదియును ధ్వస్తమాయెనని వ్రాసిరి. ఇట్టి యుపన్యాసమున మొదటి మూఁడు పుటలును ఒకభాగము. మిగిలిన స్వప్నకల్పన రెండవభాగము.

ముఖ్యమైన కొన్ని వాక్యముల యర్థవివరణము:—

ప్రతిమ క్రొత్తదగుటచే కాశీ కూడ క్రొత్తదని పటములు చూపువాఁడు నమ్మింపఁజూచుట. క్రొత్తయింటను మనుజున కెంత వింత వేడుక, ఎంతటి విశ్వాసము అనవరత=ఎడతెగని, అభ్యాసముచే క్రొత్త రోతపుట్టించును. ఈవాక్యమును బట్టి, ఈ యుపన్యాసపూర్వభాగమందలి, ప్రాఁత మతములు రోఁతలగుట యూహింపఁదగును. ఆషాఢమాసప్రారంభమున, అంబరము=ఆకాశము, అంబుదము=మేఘము, అక్షిపర్వము=కన్నులపండుగను. ప్రకృతి=సృష్టి స్వరూపము, క్రొత్తరూపము ధరించుచుండుటచే నెప్పటికప్పుడాకర్షకమగుచున్నది. మనము పరప్రేరితులమై యనేక కార్యములు చేయుచుందుము అనుటకు జంఘాలశాస్త్రి, పటములు చూపువానికి లొంగిపోవుట నిదర్శనము. సంతత=ఎడతెగని, సంప్రేరణము=పురికొల్పుట, ప్రభువులుగాని వనితలుగాని వారలతో విశేషించి సంభాషింపరాదు=ఎంతటి ప్రభువులైనను, పవిత్రశీలలైన స్త్రీలైనను నితరులతో చాల సంభాషించినచో వారు మెత్తబడిపోయి యితరుల భావములకు లొంగిపోక తప్పదు. మాటకంత బలముకలదు. శబ్దము శబ్దబ్రహ్మమనుదురు. అబలాసంభాషణము=స్త్రీలతో మాటలాడుట, అవరోధము=అడ్డంకులు. అస్పష్టసంభవ మొందిన

ప్రతిమ=ప్రతిమలు చలించి పోకుండునట్లు వాని కెనిమిది దిక్కులను బంధనము అను ఆదిక్కులందు దేవతలను స్థాపింతురు. పరివారదేవతలెందఱో యుండి మూల దేవత చలింపకుండ చేయుదురు. అట్టి దేవతగూడ భక్తుని స్తోత్రశబ్దమునకుఁ గదలి దిగునని భావము. నిర్నిద్రదీక్ష=నిద్రలేక మాంద్యము లేనిపట్టుదల నిరుపద్రవ=చెడిపోవని, నీరంధ్ర=సందు లేని దట్టమైన, మిన్ను=ఆకాశము, రహిని=ఉత్సాహముతో, రోదసి=భూమ్యాకాశమాధ్యప్రదేశము, కుహరము=రంధ్రము (గుహవంటిది), సీసా బిరడా త్రిప్పినట్లు, జంఘాలశాస్త్రి తలను కాలపురుషుఁడు వెనుకకుఁ ద్రిప్పివేసెను. సహింపరాని యాపదలోగూడ నేదియో యొక సంతుష్టి=జంఘాలశాస్త్రి తల త్రిప్పివేయఁ బడుట పెద్ద ఆపద, తలఊడిపోకుండ నిల్చియున్నందునకు తృప్తి. విస్ఫులింగములు=నిప్పుకణములు, ఉల్కలు=తోకచుక్కలు, ఆకాశము పెద్దకాగితముచుట్టవలె ఎదురుగానుండుట కాలస్వరూపుఁడు జంఘాలశాస్త్రిని తనచేతిలోఁ బెట్టుకొని, తన స్వరూపములో సంతర్గతములైయున్న బుద్ధచరిత్ర మొదలగు వానిని జూడుమని ఆదేశించెను.

స్వప్నములో జంఘాలుడు చూచిన విషయములు:—

బుద్ధుఁడు జ్ఞానముద్రతో పద్మాసనమున నున్నట్లు ప్రతిమలలోఁ గనఁబడును. బుద్ధునిమతము అవైదికము, ఆస్తి అనఁగా వేదప్రమాణ మంగీకరించుట అని కొంద అందురు, దేవుఁడున్నాడని యొప్పుకొనుట ఆస్తిక్యమని కొందఱందురు. సృష్టిస్థితిలయకారణుఁడు = (ఇక్కడనుండి భగవంతుని లక్షణములు వర్ణింపఁబడెను) లోకమును బుట్టించుట, దానిని నిలిచి పాలించుట నాశము చేయుటలకు కారణమైనవాఁడు నియామకుఁడు=ఆజ్ఞాపించువాఁడు, సత్, చిత్, ఆనంద, లక్షణములు భగవంతునివి. సత్ అనఁగా శాశ్వతముగా ఉండెడి లక్షణము, చిత్ జ్ఞానశక్తి, కారణ బంధశూన్యుఁడు=భగవంతుని పుట్టుకకు కారణమనెడి బంధములేదు. కారణమున్నచో కార్యము కలిగి అది యెప్పటికైన నశింపవలసి వచ్చును. భగవంతుఁడు నాశరహితుఁడు పాపనాశనావసర............=లోకమున పాపము పెరిగిపోయినపుడు, ఆయవసరమున తగినట్లు, భూలోకమున అవతారమును కల్పించుకొని అవతారము లెత్తినవాఁడు. గుణసమంజసుఁడు=శుభగుణములచే మిక్కిలి యోగ్యుఁడైనవాఁడు. ఇన్ని విశేషణములతో చెప్పినను నవి భగవంతుఁ డిట్లుండవచ్చునని సూచనలేగాని యవి యాతని స్వరూపలక్షణము దెల్పఁజాలవు. ఏలయన భగవంతుఁడు నిర్గుణుఁడు, వాక్కులకును మనస్సులకును గోచరింపనివాఁడు. ఐనను భక్తులు తమనిష్ఠ నిలుచుటకొఱకు ఎవరి శక్తికొలఁది వారు దేవుఁడిట్లుండవచ్చునని కల్పించుకొనిరి, అందుచే నొకరుచెప్పిన రూపు మెంకరికి నచ్చక, ఎవరి భగవంతుని వారు చెప్పుకొనఁ దొడఁగిరి.

ఆతనికి నాపై నిష్ఠురమునిరొక్కఁడు...మూఁడు మూళ్ళ అక్రింద నఱుకగునని మఱియొకఁడునై=ఇవి భగవంతుని రూపవిషయమున నేకవాక్యము పదరక మనుష్యులు వాదులాడుకొను విధములు వివిధభావములచే దైవరూపమును గుఱించి యావేశములు పెరిగి, తాము భావించిన రూపమే సత్యమని మానవు లెంచుటచే కలహములు, హత్యలు రక్తపాతములు గృహదహనములు మతయుద్ధములు మొదలైనవి జరుగుచున్నవి. మతము పేరిట ఛాందసాచారములు బలులిచ్చుట త్రాగుబోతుదనము, మాంసభక్షణము, పాపాచరణమును చెలరేగి ప్రజలు భ్రష్టులైరి. మానవులలో నున్న అక్షణములు భగవంతుని కారోపించి, దేవునికి భోగము హాండ్రను చేర్చుట మొ॥ పనులుచేసిరి. బ్రహ్మదేశము=బర్మా, శ్రీమహావిష్ణువు వటపత్రశాయియై యుండుటను జంఘాలశాస్త్రి యిట్లు హాస్యముగాఁ దెల్పెను. పాలసముద్రముపైఁ బండికొన్నచో జిడ్డంటుకొనును, మంచము వేసిన దించుకొని పోవును. కావున పండుకొనుటకు మఱ్ఱాకును ఆదిశేషుఁడును కావలసి వచ్చెను. పాపము దిక్కుమాలినవాఁడు=భగవంతుని పుట్టుకకు కారణములేదు. అతఁడొక ఆధారముమీఁద నిలువఁడు. అతఁడే సర్వమునకును నాధారము. ఆది మధ్యాంతములు లేనివాఁడు. విష్ణువు బొడ్డునందలి కమలమునుండి బ్రహ్మబుట్టి లోకసృష్టి గావించెను. మీసాలరాయలనఁగా మగవాండ్రున్నను సొగసు కాదుగనుక ఆడుది కావలసివచ్చి లక్ష్మీదేవిని కుదుర్చుకొన్నాఁడని హాస్యరచన. ఆమెకుఁ గోపములు ఈయన బతిమాలుటలు=సత్యభామ పారిజాతమును గూర్చి కోపించుట. కృష్ణుఁడు పారిజాతవృక్షమును స్వర్గమునుండి తెచ్చుట మొదలగు పారిజాతాపహరణ వృత్తాంతము సూచింపఁబడెను. వేదండములు=ఏనుఁగులు. పక్షులు = కృష్ణుఁడు గరుడపక్షిపై నెక్కెను. కట్టుకొనుటకు పచ్చపట్టుబట్టలు అనఁగా విష్ణువు పీతాంబరము ధరించును. స్వర్గములో నుండవలసిన ముప్పదిమూఁడుకోట్ల ముగురు దేవతలను విగ్రహరూపమున దేవాలయములందు నిల్పిరి. పల్యంకిక=పల్లకి, పదేపదే పరమాన్నములు = విష్ణ్వాలయములలో దినమునకుఁ బెక్కుమార్లు ఆరగింపులు జరుగుచుండును. కొందఱు తమయిండ్లలోనే దేవుని దేవతార్చ మందిరమున నిల్పికొందురు. దేవతార్చన పేటికయందు నర్మదానదినుండి సంపాదించిన సాలగ్రామ శిలలు నిల్పుకొనిరి. ఈ పూజాశిలలలో నర్మదబాణములు రామబాణములు, మొదలైనవి కొన్ని విధములు. ఇండ్లలోనివారు ఎవరిదేవతలను వారు నిల్పుకొనుచుందురు. ఎవరిమట్టుకువారు వారు కొల్చిన దేవుఁడు గొప్పయని భావింతురు. ఇట్లు చేయుట దేవుని నిజతత్త్వము తెలియక పోవుటచేతనే దేవుని కొకరు శాకప్రియత్వమును, నొకరు మాంసప్రియత్వమును నంటఁగట్టుట మానవుల యభ్యాసములను బట్టియే. దుష్కృతరాశి=పాపములగుట్ట మతము పేరిట జరిగిన జంతువధలు తలచు

కొన్నచో మతముయొక్క దుర్గతి తెలియును. ఈ గుర్తి తొలఁగించుటకు బౌద్ధ మతము పుట్టెను. చీనా జపానులలోఁ గూడ వ్యాపించిన బౌద్ధము బుద్ధుని యనంతరము దుర్గతికి పాలాయెను. జనులు నీతి అహింసలు మఱచిరి. ఆగమనింద= శాస్త్రములను దూషించుట దైవాస్తిక బుద్ధితో=బుద్ధునికి స్వర్గము దేవుఁడున్నాఁ డను నమ్మకముగలవారుగూడ పాపములు చేసిరి. కాని బౌద్ధమత కారణమున దేవుఁడు లేడను భావము ప్రబలియుండుటచేఁ బ్రజలు గావించెడి పాపములకు రీతి లేదు. భైరవతరములు=ఎక్కువభయంకరములు. బౌద్ధము తాననంతరము దుర్గతిని రూపుమాపుటకు శంకరాచార్యు లుద్భవిల్లెను. వర్తులము=గుండ్రము. చుబుకము = గడ్డము. ప్రసన్నము=సంతోషముతోఁ గూడినది. సన్నిభము=సమానము. పరశురామ ప్రీతి చేయించెను=కాల్చివేసెను. నిజమైన బుద్ధబోధ శంకరునికి దొరకలేదు. బుద్ధుని యనంతర నూతని శిష్యుల మూలమున చెడిన మతమును శంకరుఁడు ఖండించి నాశము చేసెను. బౌద్ధములోని యప్రధానాంశములు ఖండింపఁబడెను. ప్రధానాంశములను శంకరుఁడు తన మతమునఁ జేర్చుకొనెను. జీవాత్మ మిథ్యాత్వము=అంతయు పరమాత్మయేగాని జీవాత్మ వేఱుగ లేదనుట. శంకరుని యనంతరము అద్వైతమతము దుర్గతినొందుట. త్వమేవ+అహమ్=నీవే నేను (ఓపరమాత్మ నీవును నేనును ఒకటే) శరీరైక్యమొందుట=రెండుశరీరములు కలియుట, అనఁగా వేదవాక్యము పేరుచెప్పి స్త్రీ పురుషులు శరీరములు కలిపి వ్యభిచారముచేయుట. అద్వైతమున నేయువాఁడు (కర్త) లేడు, చేయబడునదియు లేదు అను నిశ్చలత్వము పేరు చెప్పుకొని సన్యాసులు గంజాయి సేవలు చేయుచుండిరి. వేదాంతులు స్వపరభేదము గమనింపరాదు గాన, ఇతరుల ధనమును తమదిగాఁ జేసికొని చెఱసాల శిక్ష అనుభవింపవలసివచ్చెను. స్త్రీలగు బ్రహ్మవాదినులు ధనముకొఱకో జాతోపాసనముకొఱకో శిశువులను జంపుచుండిరి. శంకరాద్వైతము భ్రష్టమాయెను. యజ్ఞసూత్రము= జందెము, సన్యాసులు జందెము తీసిపాఱవేయవలెను. రామానుజుఁడు ఆత్మ మహాదుర్గతికా మోదయుక్తముగ నంగీకరించెను అనఁగా తాను బ్రాహ్మణుఁడై పుట్టి అగ్రవర్ణముచే నున్నతగౌరవము నొందుచుండుటకు మాఱు, తాను సామాన్యప్రజల నందఱను తరింపఁజేయుటకు అందఱకును వైష్ణవమిచ్చి, అల్పవర్ణములవారితో సమానుఁడైన తన వర్ణాధిక్యము గోల్పోయి, బుద్ధిపూర్వకముగ తన దుర్గతికి నంగీకరించెను. భవబంధతారకము=జన్మలెత్తుట యనుబంధము నుండి తరింపఁజేయునది. పరబ్రహ్మమును అజ్ఞానము ఆవరించి కప్పివేయునను (ఆచ్ఛాదనము)ట రామానుజునికి నచ్చలేదు. ముక్తికి తలకంటె హృదయము మెక్కువ తోడుపడును = తలయనఁగా మెదడుయొక్క శక్తిచే తర్కవితర్కములు చేసి వాదబలముచే నద్వైతమతము స్థాపించుటకంటె, హృదయప్రధాన

మాగా భక్తికైంకర్యములుచేసి దేవుని హృదయము కరిగించి ముక్తిని పొందుట శక్యమని రామానుజుని భావము. రామానుజుని ముఖ్యశిష్యుఁడు కూరనాథుఁడు బోధాయనుఁ డనునతఁడు విశిష్టాద్వైత సూత్రములు వచించి వానికి వృత్తి వ్రాసెనఁట. ఆ గ్రంథమునకు విశిష్టాద్వైత సూత్రవృత్తియని పేరు. అది రామానుజునికి పూర్వము చైనాదేశములోనుండెను. దానిని కూరనాథునితోఁగూడి వెళ్ళి రామానుజుఁడు చూచి, తన రామానుజమత భాష్యము వ్రాసెనందురు. క్రిమికంఠుఁడను రాజు రామానుజుని చెఱపట్టుఁడనఁగా. కూరనాథుఁడు తన గురు ప్రాణరక్షణకొఱకు తన ప్రాణము నర్పింపఁదలఁచి, తానే రామానుజుఁడనని తన్నొప్పగించుకొనెను. రామానుజు ననంతరము అతని మతము భ్రష్టమగుట— ద్వాదశ+ఊర్ధ్వపుండ్రములు=నిలువుబొట్టులు పండ్రెండు. తులసీమాలావక్షస్కులు= రొమ్ముప్రదేశమున తులసిపూసలదండలు. సాంకర్యసమామ్నాయము=సంకరమైన విషయముల సమూహము బ్రాహ్మణుఁడు మొదలు చండాలుఁడు వఱకును నందఱు అను నొక్కటే, భక్తియొక్కటే ప్రధానము అని రామానుజుని బోధ, బ్రహ్మఘ్నుఁడు=బ్రాహ్మణుని జంపినవాఁడు. గోఘ్నుఁడు=గోవును జంపినవాఁడు, గురుతల్పగముఁడు=గురువుభార్యతో వ్యభిచరించినవాఁడు, సాయింపఁగనే=సహాయము చేయఁగనే, కరాగ్రగత=చేతి చివరలందున్న, శంఖచక్రము మొదలైన విష్ణువు నాయుధముల చిహ్నములు వైష్ణవులు ధరింతురు. ఆచార్యకూట+అగారములు=వైష్ణవులయిండ్లు, వైష్ణవులయిండ్లు ఒకచోట కూడియుండును. ఆట్టి యిండ్ల వీధులకు రామానుజకూటములని పేరు, తులసిపూసలును, నామములును మతచిహ్నములనుటచే మాలమాదిగ పల్లెలవారు పెద్దపెద్ద నామములుదాల్చి బ్రాహ్మణులగు వైష్ణవ అగ్రహారములమీఁదఁ బడిరి. హృదయములో విష్ణుభక్తి యున్నదో లేదో పరీక్షించుటకు శక్యముకాదుగదా. నామములు మొదలగు గుర్తులే వైష్ణవు అను నిర్ధారణ చేయుననుటచే నందఱును వైష్ణవులేయైరి. వర్ణవృత్తిలింగములు = బ్రాహ్మణాది వర్ణములయొక్కయు వృత్తులయొక్కయు చిహ్నములు. ప్రపత్తి భక్తియోగమునకు మీఁదిది ప్రపత్తియోగము. భక్తియోగమున భక్తునికిఁ గొంత స్వాతంత్ర్యముండును. ప్రపత్తియోగమున వ్యక్తి తన ఆత్మీయతను బూర్తిగ వదలుకొని తన సమస్తభారమును భగవంతుని మీఁదబడవేసి శరణాగతి వేఁడును దాసానుదాసులకు దాస పరమాణువుగ తన్నెంచును? రామానుజ మతమున ప్రపత్తియనునది యొక ముఖ్యాంగము. దీనికొక విధానముగూడఁ గలదు. వైష్ణవులు తామెన్ని దుష్కృత్యములు చేసినను ప్రపత్తియోగము నాశ్రయించుటచే మోక్షము దొరకునని తలఁచిరి. అందుచే ననేకానర్థములు బయలుదేరెను. ప్రపన్నులు= ప్రపత్తియోగము నాశ్రయించినవారు, పదిపాయలు త్రాగినను=త్రాటియాకుపాయలతో పదిపాయల కల్లు త్రాగినను, సుందరీలోలత్వము=స్త్రీలతో వ్యభిచరించుట,

ఖర్జూరపుకాయలు=ఎండిపోయిన ఖర్జూరపుకాయలు చాల నొక్కులు పడిపోయి యుండునట్లు, సురాపానము వ్యభిచారము మున్నగువానికిఁ బాల్పడినవారు దేహదార్ఢ్యములేక వరుగులవలె నెండిపోవుటనుగాంచి మధ్వాచార్యు డాక్షేపించెను. సాత్త్వికాహారము=సత్త్వగుణము, తమోగుణము-రజోగుణము అను మూఁడు గుణములు గలవు. ఆహారవస్తువులలో నీ గుణములను బోషించునవిగలవు. ఈమూఁడు గుణములలో సత్త్వగుణ ముత్తమము ఇది సౌమ్యమును శాంతమును ధర్మయుక్తమును. ఈ లక్షణమును బోషించుటకు ఆహారపదార్థములలో ఉప్పు, పులుసు, కారములు విడిచివేయవలెను. మదమును గలిగించు క్రొవ్వులు, నేతులు, మాంసములును మానవలెను, ఇట్టివానిని విడిచిన యాహారము సాత్త్వికాహారము సాత్త్వికాహారముచే భక్తిజ్ఞానధ్యానములు కుదురును. అహంకారము క్రోధము లోభము మొదలైనవి నశించును. కాలస్వరూపుఁడు జంఘాలశాస్త్రికి స్వప్నమున వైదికమతము, బౌద్ధము, శాంకరమతము, రామానుజమతము, మాధ్వమతముల యుత్పత్తిస్థితి కాలములను జూపెను. కాలస్వరూపుఁడే విరాట్పురుషుఁడు, ఆకారము ధరించిన భగవంతుడు.

## ప్రశ్నోత్తరములు.

1. క్రొత్తయింత ప్రాత రోఁత– దీనిని సాక్షిగబట్టి సమర్థింపుఁడు

జంఘాలశాస్త్రి నరసింహస్వామి యాలయములోనుండి వచ్చుచుండఁగా కాశీపటముల చూపువాఁడు, 'కాశీపటములు చూపింతును రావయ్యా' యని పిలిచెను. నేనిదివఱకు కాశీ చూచితినని జంఘాలశాస్త్రి యనఁగా "వెనుకటి కాశీ కాదు ఇప్పుడుక్రొత్త బొమ్మలువచ్చినవి. రావయ్యా" యనెను. ఆమాటనుబట్టి, జంఘాలుఁడు క్రొత్తదానిపట్ల ఆసక్తి పడవలసివచ్చెను. లోకములో ప్రాతదెంత గొప్పదైనను వెగటు పుట్టించును, క్రొత్తది నిజముగా గొప్పది కాకున్నను దాని క్రొత్తదనముచేతనే ఆకర్షణగొల్పును. చిరకాల పరిచయముచే ప్రాతదానియం దలుసుదనము పుట్టును. మేఘము లెప్పుడును నెఱిఁగినవైనను ఆషాఢమాసపు క్రొత్తమేఘములు చూచి మానవు లానందింతురు. క్రొత్తకోయిలఁకూఁత, క్రొత్తయావకాయరుచి, క్రొత్తపెండ్లికూతురు సొగసు, తళుకుబెళుకులును వర్ణింపఁదరమా? ఇట్లనుకొనుచు జంఘాలశాస్త్రి, పటములవాఁడు పిలుచుటయేమి తాను పోవుటయేమి యని యాలోచింపక, క్రొత్తదానియందలి మోజుచే పటములవాని వెంటఁబడెను. మనుష్యులయందీ స్వభావము బలముగ నుండును. ఈవ్యాసములో వ్యాసకర్త తరువాత చెప్పఁదలఁచిన ప్రాతమతముల నాశము క్రొత్తమతముల పుట్టుక, అని మరల భ్రష్టములగుట అను విషయముతో ముడిపెట్టదలఁచినట్లున్నది.

2. అతిపరిచయముచే బౌద్ధాది ధర్మములపట్ల మనుజుల కేవగింపు కలిగెను. కాశీపటములవృత్తాంతమునకు తరువాతి వృత్తాంతముతో సంబంధమేమి ?

క్రొత్తదనముచే క్రొత్తమతములు మనుష్యుల మనస్సులను గొంతకాల మాకర్షించును. జంఘాలశాస్త్రి తన యుపన్యాసములలో ననేక విషయములను విమర్శించును. ఆయన చేయు విమర్శనలు చాల ఘాటుగ నుండును. ఈ యుపన్యాసములలో విమర్శింపఁబడని విషయమే లేదనవచ్చును. ఒక విషయమును విమర్శింపఁబూని యాయన యారంభించునుపక్రమణము వింతగాఁ దోచును. ఈ యుపక్రమణమునకు ఉపన్యాస ప్రధానాంశమునకును సంబంధము కనఁబడదు, కాని నిశితముగఁ జూచినచో నతుకుదల కుదురును. కాశీపటములవాని మాటలకు జంఘాలశాస్త్రి లొంగిపోయెను. క్రొత్తపటములను నాకర్షణముచేతనో, వాని మాటల ప్రేరణముచేతనో అతఁడు లొంగిపోయెను. పండ్లపొడి యమ్మువాని ప్రకటన మాటలకు మనుష్యులు మురిసి వానిని కొనుట యను విషయమునెత్తి శబ్దమున కెంతయో బలమున్నదనియు, మానవులనాలోచితముగ నితరుల మాటలకు లొంగిపోయి పనులు చేయుచుందురని తెలిపెను. జంఘాలశాస్త్రి తెలివిగలవాఁడైనను నొక కొండవీటి పోటువాని మాటలకు వశుఁడై పోయెను. కాశీపటముల నద్దములో జూచుట కితరులతోఁ దానును గుంపులోఁ బడెను. అటుతరువాత విసిగి పటములు చూచుట మాని యాతఁడు నిద్రావశుఁడై స్వప్నమును గాంచెను. కలలో కాలస్వరూపుఁడు ఆదికాలము నుండియు పుట్టివర్ధిల్లి భ్రష్టములైన మతముల గతి నాతనికిఁ జూపెను. ఈ వ్యాసమునందలి మొదటిభాగము, తరువాతి మతప్రవర్తనముతో నెట్లుముడిపడునో బాగుగయోచించినఁగాని తెలియదు. తరువాతగొప్పమతములు పుట్టి, నశించునట్లుగనే తీర్థములు మొదలగు మతవిషయములు కూడ చాలాఘాతి పోయినవనియు, కాశీపటములవాండ్రు, రంకులరాట్నములవాండ్రును తైర్థికులను నమ్మింతురనియు, ఆలోచనలేకుండ తైర్థికు లితరుల మాటలకు వశులై వినోదప్రియులగుదురనియు జూపి, తీర్థములుకూడ మతములలో భాగములేగాన నవియు గొంత సాంకర్యము చెందెనని యుపన్యాసకుని భావము. ఈ క్రొత్తవిషయముల మోజుచేతను, మతకర్తలు శబ్దబ్రహ్మము విషయమునఁ జూపిన యధికారబలము చేతను మతములు పుట్టి కాలప్రవాహమున మ్రగ్గె నను విషయమున కుపన్యాసకుఁడు పతితుల మనస్సులను సిద్ధముచేసెను. ఇట్లు పూర్వాపరభాగములకు సంబంధము గల్పింపఁబడినది,

## 3. జంఘాల శాస్త్రి స్వప్నకల్పనా ప్రయోజనమేమి?

ఉపన్యాస మూలమున ప్రజలకు విజ్ఞానము చేకూర్పవలెను. ఈ విజ్ఞాన ప్రదానము చక్కని భాషలోనైనచో పామరులే గాక పండితులును ప్రసన్నులగుదురు. కాన నీ యుపన్యాసములు చక్కని గ్రాంథిక భాషలో సాగినవి. చక్కని భాషయు విజ్ఞానమును మాత్రముండిన చాలదు. కేవల నీతిబోధకు జనులు చెవి యొగ్గరు. తగినంత మోతాదులో హాస్యమును వినోద విషయకల్పనమును నున్నచో ప్రజ లందలి యపూర్వకల్పనమును మెచ్చి తమ యాసక్తిని నిల్పుకొందురు. ఈ నూత్న కల్పనలేనిచో నాటి యుపన్యాసము లింతగా బ్రజల నాకర్షింపజాలి యుండవు. బౌద్ధమునకు బూర్వము హిందూమతము యొక్క స్థితియు, నాటి యాచార వ్యవహారములును, పిమ్మట బౌద్ధమతోత్పత్తియు తద్వినాశమును, తదుపరి శాంకరమత ముత్పత్తి రామానుజ మతము పుట్టుటకు కారణము లేర్పడుచుట, వైష్ణవము పిమ్మట మధ్వమతము పుట్టుట మొదలగు విషయముల నీ యుపన్యాసమున జంఘాల శాస్త్రి పరామర్శింపదలచెను. ఇందుకొరకు సింహావలోకన శక్తి గల్పించవలెను. మానవునికి బ్రత్యక్షముగ సింహావలోకనశక్తియుండదు. అందుచే జంఘాల శాస్త్రి నిద్రచెందినట్లును. నిద్రలో కలగాంచినట్లును కలలో కాలస్వరూపుడగు విరాట్పురుషుడు జంఘాల శాస్త్రిని తన యురచేతిలో బెట్టుకొని సీసా బిరడా త్రిప్పినట్లు వాని తలను వెనుకకు ద్రిప్పెను. దీనిచే ఎదుటికి జూడవలసిన ముఖము వెనుకకు జూడదొడగెను. ఇది అసహజమైనను స్వప్నముగనుక అసహజముగ దోపదు. దీనివలన నుపన్యాసకుడు కొంత హాస్యము కూడ గల్పించెను. ఏవైపున నున్న నేమి తల యిప్పటికిట్లు నిలిచి యున్నది. సహింపరాని యాపదలో కూడ సెనెకా యొక్క సంతుష్టికవచమును సరిపెట్టుకొని స్వాప్నికుడు చూడదొడగెను. ఆకాశము క్రిందికి దిగినట్లును, పెద్ద కాగితపుచుట్టవలె మొగమున కెదురుగనున్నట్లును, కాలస్వరూపుడు జంఘాల శాస్త్రి మొగము నా యాకాశపు గొట్టములోనికి ద్రోచినట్లును గల్పించెను. ఈ పట్టి కల్పన క్షణికముగ వింతను మాత్రము పుట్టించును. ఇది సత్యదూరము. ఐనను తరువాత వర్ణింపదలచిన మతముల పుట్టుక నాశముల కాధారముగా కుదిరినది. కాశీపటముల వాడు అద్దముల మూలమున వింతపటములు చూపినట్లు కాలస్వరూపుడు మింటి గొట్టము మూలమున గతించిన కాలమును జూపెను. ఇట్టి స్వప్నకల్పన తరువాతి విషయమున కతుకుగా కుదిరినది. ఇచ్చటనుండి మతముల విషయము ప్రారంభమగును.

## 4. బౌద్ధ మతమును బుట్టించిన పరిస్థితు లెవ్వి. బౌద్ధ మెట్లు వ్యాపించి పరిణమించెను?

వైదిక మతము సృష్ట్యాదినుండియు సకలంకముగ తరతరములపాటు వ్యాపించెను. సుక్రియాపహితుడగు భగవంతుని, సామాన్య నేత్రములచే చూచుట

గాని, మనస్సుచే నూహించుటగాని, వాక్కులచేఁ జెప్పుటగాని శక్యముకాదు. ఐనను ధ్యానము నిల్పుటకొఱకును భగవంతుఁ డున్నాఁడని నిరూపించుట కొఱకును నాతనిని సృష్టిస్థితి లయకారణుఁడు, సచ్చిదానంద స్వరూపుఁడు, కారణ బంధశూన్యుఁడు, పాపనాశనావసర విరచిత భూలోకావతారుఁడు మొదలగు విశేషణములతో నెవరి బుద్ధికిఁ దోఁచినట్లు వారు వర్ణించుకొనిరి. ఈ వర్ణనలు కొందఱకు నచ్చినవి. కొందఱకు వెగటుగఁ దోఁచినవి. కొందఱు దేవుని స్వాధీన పఱచుకొనగలమనియు, కొందఱు తాము చేసెడి యన్నిపనులకును గారకుఁడాతఁడే యనియు తాము భోగమువాంఛతో చరించినను నాబుద్ధి పుట్టించినవాఁడు భగవంతుఁడే యనియు నెంచఁదొడఁగిరి. దీనితో వీరావేశములు ఛాందసత్వములు, బూడిద పూఁతలు, త్రాగుబోతుతనములు, మాంసభక్షణములును మతము పేరిట నతివ్యాప్తి చెందెను. యావద్భారతమునను దురాచారములు తాండవించెను. జంతుబలులు, నరహత్యలు, రక్తపాతములును హద్దులేకుండ సాగెను. భక్తులు తమకు దోఁచిన రీతిగ భగవంతుని రూపము నూహించి యాతని విగ్రహములకు వస్త్రధారణము, అలంకారరచనము, ఆ విగ్రహములకు అర్చనలు, ఆరగింపులు, వింత వింత వంటకములతో భోగములు మొదలైనవి చేయ మొదలిడిరి. ఈ సందర్భమున విష్ణువు రూపము నూహించుచు నుపన్యాసకుఁడు సరసమైన హాస్యకల్పన గావించెను. జిడ్డుతోడి పాలసముద్రమునఁ బండుకొనలేక మహాత్మను ఆదిశేషుని నాశ్రయించెననియు, మీసాలరాయుళ్ళక్కఱలేదని లక్ష్మీదేవిని ప్రక్కను జేర్చుకొనెననియు, సత్యభామకుఁ గోపము రాఁగానామెను బ్రతిమాలెననియు నెన్నియోరీతులహాస్యము గావించెను. వైష్ణవాలయములందలి చిత్రాన్నములు, క్షీరాన్నములు చిట్టిగారెలు మొ॥ పేర్కొనెను. దీనికితోడు ఇంటింట దేవతార్చనగళులు, సాలగ్రామములు, నర్మదబాణములు, ఒక యింటిలో నొక్కొక్కరి కొక్కొక్కదేవత, ఒకరిదేవత కంటె నింకొకదేవత హెచ్చను పోరాటములును వ్యాపించెను. హద్దుమీఱిన మధ్యపానములు, బలులు రక్తపాతములును సాగెను. బ్రాహ్మణాధిక్యము యజ్ఞయాగాదుల ప్రాచుర్యమును నతిశయించెను. ఈ స్థితిలో అహింసాప్రధానమై బ్రాహ్మణాధిక్యము లేక, సర్వవర్ణసమత్వమును జెప్పు బౌద్ధమునకుఁ జక్కని యవకాశ మేర్పడెను. సామాన్య ప్రజల భావలో నీతియుక్తమైన స్వేచ్ఛను సమత్వమును బుద్ధుఁడు బోధింపఁగా వేలకొలఁది ప్రజలు బౌద్ధము నవలంబించిరి. సన్యాసులును సన్యాసినులును నేర్పడిరి. చీనా జపానులందుగూడ బౌద్ధము వ్యాపించెను. బుద్ధుని నిర్యాణానంతరము అతని బోధన తత్త్వము మారెను. పద్మాసనమునను న్న బుద్ధుని విగ్రహములు నెలకొల్పి ప్రజలాతని దేవునిగాఁ దలంచఁ జొచ్చిరి. బుద్ధుని వేఱువేఱు శిష్యులు వేఱువేఱు ప్రవచనములు చేసిరి. అహింస [illegible] స్థితి నశించెను. నాస్తికములు ప్రబలెను. బుద్ధుఁడు దేవుని పేరెత్త

లేదు, వేదములను త్రోసివేసెను. భక్తిని బహిష్కరించెను గాన ప్రజలు ఆగమములు నిందించుచు, క్రమక్రమముగ నీతిబాహ్యులైరి. పతితులైరి. దేవుఁడు లేడనుటచేఁ జెలరేగిన పాపములు వేలు. దేవుఁడున్నాడని నమ్మిన కాలములో చేయఁబడిన పాపముల నితివేలు. బుద్ధుని శిష్యులలో యోగాచార్యులు, సౌత్రాంతికుఁడు, వైభాషికుఁడు, మాధ్యమికుఁడును వేలువేలు సిద్ధాంతములను ప్రచారము చేయుటచే బౌద్ధమున అనైక్య మేర్పడెను. అవ్యవస్థితమై, నాస్తికమైన యిట్టి బౌద్ధమతమును ఖండించి పాఱద్రోలుటకు శ్రీశంకరాచార్య లుద్భవించిరి. ఈయన యపార మేధాశాలి. వీడని పట్టుదలతో నీయన మతఖండన మారంభించి, అద్వైత మతమును స్థాపించి, ఇతరమత భావముల నన్నింటిని, అందు తీవ్రముగా బౌద్ధమును ఖండించెను. బుద్ధుఁడు బోధించిన మూలబౌద్ధములోని విషయము లీయన తన యద్వైతమున జేర్చుకొనెను. శంకరుఁడు రాజుల సహాయము గ్రహించి, బౌద్ధుల నినుపగానుగలలో నాడించి, బౌద్ధగ్రంథములను మంట పెట్టించెను. అందుచే హిందూదేశమున బౌద్ధము నశించి చైనా జపానులలో నిలువవలసివచ్చెను.

## 5. మతవిషయమున శంకరాచార్యులు గావించిన దేది? అది యెట్లు పరిణమించెను?

కాలము తనకుఁ దగిన యవతార పురుషులను బుట్టించుకొనునట్లు శంకరుల యుద్భవమునకుఁ గారణమును గల్పించెను. బౌద్ధ నాస్తికత్వముచేఁ బ్రబలిన పాపములను మూలచ్ఛేదము చేయుటకు శంకరుఁ డితర మత భావములతోఁ బాటుఁ బౌద్ధమును దీవ్రముగ ఖండించెను. బౌద్ధులను రాజులచే గ్రూరముగ జంపించి బౌద్ధగ్రంథములను మంట పెట్టించెను. బౌద్ధములోని మూలాంశముల నించుక మార్పుతోఁ దన ద్వైతమున జేర్చుకొనెను. బుద్ధుఁడు బోధించిన పునర్జన్మమును, జీవాత్మ యబద్ధమను విషయమును శంకరుఁడు గ్రహించెను. బుద్ధుఁడు భక్తిని పూర్తిగఁ ద్రోచివేయఁ నా శంకరుఁడు భక్తికి ప్రాధాన్యమిచ్చెను. బుద్ధుఁడు జ్ఞానమే ప్రధానమన్నట్లు శంకరుఁడును జ్ఞానమువలననే మోక్షమని బోధించెను. శంకరుఁడు బోధించిన జగన్మిథ్యాత్వమును బుద్ధశిష్యుఁ [illegible] చెప్పెను. ఇట్లు బౌద్ధధర్మములను గొన్నింటిని గ్రహించి, దేవుఁడున్నాడని సాధించి శంకరుఁడు వేదప్రామాణ్యమును బునరుద్ధరించెను. కొందఱు శంకరుని యద్వైతమును ప్రచ్ఛన్న బౌద్ధమనిరి. జీవాత్మయే పరమాత్మ యనుటచే కొలిచెడి భక్తుఁడు లేఁడు. కొలువఁబడి భగవంతుఁడు లేఁడు. 'తత్త్వమసి' అను మంత్రార్థ మెఱుఁగు జ్ఞానమే అద్వైతసిద్ధిసాధనమనియు నిజమైన మోక్షమనియు శంకరుఁడు బోధించిన విషయములను బట్టి అందఱును జ్ఞాను[illegible], [illegible]

ములయొక్కయు వేషములు వేయఁదొడఁగిరి, జ్ఞానము బలపడునను వంకమీఁది గంజాయి త్రాగుట ప్రబలమాయెను. నిజమైన జ్ఞానులకంటె కపటులు హెచ్చిరి. స్వపరభేదములేదనుటచేఁ గొందఱు ఇతరుల ధనములను హరించుట, నీవే నేనను వేదాంతవాక్యమునుబట్టి స్త్రీ పురుష శరీరములు కలిపి వ్యభిచరించుట, ననర్థములు శంకరమతములోఁ బ్రవేశించెను. జందెములు పాఱవేసి సన్న్యాసులైనను ఆశాపాశము పోలేదు. కపట సన్న్యాసులుగూడ గౌరవముపొందుచుండుటచే పెక్కండ్రు సన్న్యాసి వేషములు వేసి లోకమును వంచించి శాంకరమతమును కలుషితము గావించిరి. ప్రత్యక్షముగాఁ గనబడుచున్న జగత్తు మిథ్య (చట్టిని) యనుటయు జీవుఁడు ఆపరమాత్మయేయైనను నాతని నజ్ఞానము ఆవరణముగా కప్పివేయుననియు చెప్పెడి యద్వైతమతబోధ సామాన్యుల కవగతము కాలేదు. శంకరుని మాయావాదము తర్కశాస్త్ర జ్ఞానముతో బుద్ధిబలముతోను నిలుచునదికాని పూర్తిగ ప్రజల కర్థమగునదికాదు. ఈవిషయములు రామానుజాచార్య నంతటివానికి నచ్చలేదు. శంకరమతమున భక్తికప్రాధాన్యముగాన, రామానుజాచార్య ఉద్భవిల్లి భక్తిప్రధానమగు విశిష్టాద్వైతము స్థాపించు నవసరము కలిగెను. శాంకరమతము గొప్పదైనను ననుచరులు దానిని గూలద్రోసిరి. మాయికులు, కపటులును హెచ్చిరి. ధనాపహరణములు, శిశుహత్యలును వ్యభిచారములును ప్రబలి మతమున కప్రతిష్ఠ కలిగెను. ఇట్లు ప్రజలు భ్రష్టులగుటచే రామానుజమతమునకు బ్రజలు, దృష్టులు మరల వలసిన యవకాశము కల్గెను.

### 6 రామానుజ మతముయొక్క ప్రధానాంశమేమి? అది యెట్టి పరిణామములు కలిగించెను.

శంకరాచార్యుల యద్వైతము నిజముగఁ బ్రజలకు బోధపడకుండెను. కపట సన్న్యాసులు, గంజాయి త్రాగువారు, దొంగలు, వ్యభిచారులు బలిసిరి. ఇట్టిస్థితిలో జనసామాన్యమునకు సులభమార్గము బోధించుటకు రామానుజాచార్యు లుద్భవిల్లిరి. ఈయన చల్లని చూపులవాఁడు. పండు తమలపాకుల వర్ణమువాఁడు. పరబ్రహ్మము అజ్ఞానము ఆచ్ఛాదించునదియు, మాయా మూలకముగా జగత్తు కనిపించుననియు, కండ్లకు కనిపించు లోకము అబద్ధమనియు బోధించు అద్వైతము ప్రజలకు బోధపడదని యీతఁ డెంచెను. అద్వైతము తర్కశాస్త్ర బలముమీఁద పెద్దలయొక్క శక్తిచే స్థాపింపఁబడును. దానికంటె హృదయమునకు సన్నిహితముగాఁ దోఁచు భక్తియే ప్రధానమనియు భక్తివలన జ్ఞానము గలుగుననియు, జ్ఞానము భక్తి కంగ [illegible] వర్ణమువాఁడైనను నేవృత్తి నవలంబించువాఁడైనను

దృఢమైన భక్తిగలవాఁడైనచో నాతఁడు తరించునని రామానుజుఁడు బోధించెను. బ్రహ్మము మొదట జ్ఞానరూపమై సూక్ష్మరూపమున నుండెను. అదితరువాత నామ రూప విభాగమునొంది స్థూలరూపము నొందెను. ఈ రెండు విశిష్టములైన బ్రహ్మముల అద్వైతము అనగా నేకత్వము విశిష్టాద్వైతమనియు, ఈ విశిష్టాద్వైత జ్ఞాన సిద్ధికి భక్తి సాధనమనియు రామానుజుఁడు చెప్పెను. రామానుజుఁడు బోధించిన భక్తి యాతని ముఖ్యశిష్యుఁడును, సహచరుఁడును నగు కూరనాథుఁడు తన గురువు నెడ భక్తిరూపమున నిరూపించెను. రామానుజుఁడు కూరనాథునితోఁ గూడి చైనా దేశమున కేగెను. బోధాయనుఁడు రచించిన విశిష్టాద్వైత సూత్రములను వీరక్కడ గ్రహించిరి. ఆసూత్రములకు రామానుజుఁడు భాష్యము వ్రాసెను. రామానుజమతము ప్రజలలో వేగముగ వ్యాపించెను. క్రిమికంఠుఁడను రాజు రామానుజుని జంపగోరి యాతనిని బట్టుటకు భటులను బంపఁగా కూరనాథుఁడు తానే రామానుజుఁడనని రాజభటుల కొప్పగించుకొనెను. అతని కనుల నూడదీయుఁడని రాజాజ్ఞాపింప కూరనాథుఁడు తన గోళ్ళతోనే కన్నులూడదీసికొనెను. ఇట్టి గురుభక్తి యపూర్వము, రామానుజుని యనంతర మతని బోధల కపార్థములు కలిగెను. హృదయములో భక్తి యున్నదో లేదో తెలిసికొనుటెట్లు ? భక్తి చిహ్నములగు తిరుమణ్ణపు బొట్లు, తులసి మాలలు మొదలగునవి ధరించు వారెల్లరును వర్ణభేదమును వృత్తి భేదమును లేక వైష్ణవులను పేరునఁ బరగిరి. బ్రాహ్మణులు మొదలు ఛండాలుర వరకును తుదకు తురకలునుగూడ నామములు ధరించి వైష్ణవులుగా చెల్లుబడియగుటను వర్ణసాంకర్య మేర్పడెను, బ్రాహ్మణుని చంపుట, గోహత్య, గురుభార్యా గమనము మొదలగు పాతకములు చేసినవారుగూడ, భగవంతునికి శరణాగతి తెల్పుకొనఁగనే వైష్ణవులుగ చెల్లుబడి నొందిరి. బాహ్య చిహ్నములు వైష్ణవమును స్థాపించునవనుటచే తుదకు మాలలు మాదిగలు, చచ్చుటవాండ్రునుగూడ వైష్ణవులైరి. భక్తికి ప్రాధాన్యము చెప్పుటచే కర్మలును జ్ఞానమును నశించెను. స్నానసంధ్యాదులు మానెను భక్తికంటె గొప్పది ప్రపత్తి యోగమని విశిష్టాద్వైతము బోధించును. ఈ ప్రపత్తిలో మానవుఁడు తన వ్యక్తిత్వము నణచుకొని సంపూర్ణముగ భగవంతుని శరణాగతి వేడి భగవంతుని చిత్తమునకుఁ దన్నొప్పగించుకొనును. ఈ ప్రపత్తియోగమను వినుటచే నెన్నియో పాపములు చెలరేగెను. కర్మలు నిర్లక్ష్యము చేయుట స్వేచ్ఛగ సంచరించుట, త్రాగుడుకు దాసులగుట మొదలగు దుస్థితి గలిగెను. తుదకు రామానుజ మతమనఁగా త్రాగుడుమతమని పేరువోసెను. నిజతత్త్వము నెఱిఁగినవారు కొలఁదిగ నుండ, కపటులు అలసులును హెచ్చిరి. మత మిట్లు చెడఁగా, దీనిని మరల సంస్కరించి ప్రజల నుద్ధరింపవలసి వచ్చెను. ఇందుకొఱకు శ్రీమధ్వాచార్యులు జన్మించి, కర్మజ్ఞానభక్తులకు సమాన ప్రాధాన్యముగల ద్వైత మతమును బోధించెను. శరీరదార్ఢ్యము కలిగినఁగాని జ్ఞానదార్ఢ్యము గలుగదని [illegible]

నియమయుక్త జీవనము గడుపవలెననియు, త్రాగుడు వ్యభిచారము మొదలగువానిని దరిజేరనీయరాదనియు సాత్త్వికాహారము భుజింపవలెననియు బోధించెను. ఈయన మతము ద్వైతము. ఇదే మాధ్వమత మనఁ బరఁగును.

7. కాలస్వరూపుఁడు జంఘాలశాస్త్రికిఁ జూపిన మత పరిణామ మెట్టిది ?

కాలస్వరూపుఁడను పేరును బట్టి కాలము నొక దేవతగా భావింపవచ్చుననియు, ఆ దేవత యెల్లప్పుడును పరివర్తనము నొందుచు నతిదీర్ఘరూపమున నుండుననియుఁ దెలియుచున్నది. జంఘాలశాస్త్రి స్వప్నములోఁ జూచిన కాలస్వరూపుఁడు ఎన్నియో తాళ్ళ యెత్తువాఁడు నిజముగా నాతని యెత్తు చెప్పుట కసాధ్యము కాని యాతఁడు జంఘాలశాస్త్రి నరచేత బెట్టుకొని శాస్త్రితలను ద్రిప్పెను గాన నాతఁడు చాలయెత్తు గలవాఁడని చెప్పవలసి వచ్చెను. కాలస్వరూపుఁడు మఱ్ఱిచెట్టుక్రింద పద్మాసనమున నున్న బుద్ధుని జూపెను. బుద్ధునికిఁ బూర్వము హిందూమతము ఎట్లు బహుదేవతాకమై, మతకలహములకుఁ గారణమైఁ బలులు, రక్తపాతములు, హత్యలు, త్రాగుడు మొదలగువాని కాకరమై, సామాన్య ప్రజలకు స్వాతంత్ర్యముగాని యుద్ధరణోపాయముగాని లేక లోకజీవితము దుఃఖమయముగా నుండెనో తెల్పి, విష్ణుదేవతార్చనాదులందలి వింతచర్యలను దెల్పి బౌద్ధమతోత్పత్తికి హేతువులు చూపెను. పిమ్మట బౌద్ధము మహోన్నతి చెంది దేశదేశాంతరములందు వ్యాపించి తుదకు బుద్ధునియనంతర మాతని శిష్యుల మూలమునను ననుచరుల మూలమునను హింసారూపమును, నీతిబాహ్యమును, నాస్తికమును నైనరీతిని జూపెను. బౌద్ధమును మటుమాయము గావించుటకుఁ బుట్టిన శంకరుని రూపమును చూపెను. అతని తలకంతకును నుగురే ప్రధానమై ముఖము పట్టుదలను భయంకరత్వమును జూపునదిగా నున్నట్లు వర్ణించి శంకరుఁడతి క్రౌర్యముతో బౌద్ధులను జంపించి, వారి గ్రంథములను దగులబెట్టెనని తెల్పెను. తరువాత శంకరుని యద్వైతవాదమును బట్టి కపట సన్న్యాసులును, గంజాయి త్రాగువారును, మద్యపానులు, ధనహర్తలును వ్యభిచారులును పుట్టిరనియు మతము భ్రష్టమాయెనని తెల్పెను. పిమ్మట రామానుజుఁడు పుట్టి, భక్తిమార్గమును ప్రజలెల్లరకును వర్ణవృత్తి భేదములేకుండఁ దెల్పి బ్రాహ్మణులు మొదలు చండాలురవఱకు నందఱను నామధారులను వైష్ణవులుగను చేసెను. వర్ణసాంకర్యము, కర్మలనాశమును మితిమీఱెను. రామానుజమతము త్రాగుడు మతముగా రూపొందెనని చూపెను. పిమ్మట మహాదేవా బలుఁడగు మధ్వాచార్యుఁడు పుట్టి, కర్మల నాచరింపవలెననియు త్రాగుడువ్యభిచారము మొదలగువానిని దరిఁజేరనీయరాదనియు, సాత్త్వికాహారము భుజించుచు ప్రాణాయామాదులు చేయుచు సత్కర్మలు చేయవలెననియు బోధించెనని తెల్పెను. మదళ

పూర్వమువలెనే మాధ్వమతమునందుగూడ దోషములు పుట్టినని చూపెను. జంఘాలశాస్త్రికి స్వప్నమున కాలస్వరూపుఁడు చూపిన యీ చిత్రమునందంతటను కాలపరివర్తన స్వభావము చూపట్టుచున్నది. ప్రాతరోత క్రొత్తవింతయను ధర్మమునుబట్టి ప్రాతమతములు చెడి క్రొత్తవానికిఁ ద్రోవనిచ్చెను. ఇతరులు చెప్పిన మాటలు విని పరప్రేరణములోనై పోయెడి స్వభావమునుబట్టికూడ ప్రజలు మొదట బుద్ధశంకరాది మతకర్తల బోధలనుబట్టి యావేశపూరితులై యామతములలోఁ జేరి, కొలఁది కాలములో భ్రష్టులు కాఁదొడఁగిరి. ఉపన్యాసాదిలోఁ స్వప్నమునకుఁ బూర్వము జంఘాలశాస్త్రి స్వభావములోఁ జూపట్టిన విషయములు ప్రజాస్వభావమునందును జూపట్టెను. ఇట్లు భారతదేశపు మతముల స్థితి యీ యుపన్యాసమునుబట్టి లోకమునకు వెల్లడించెను.

### 8. సాక్షి యుపన్యాసము లందలి హాస్యమెట్టిది? దానిప్రయోజనమేమి?

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమ యపారవిజ్ఞానమును, లోకానుభవమునుబట్టి తనకాలపు జనసంఘమునందలిలోపముల నెత్తిచూపి పరిహసించి తన్మూలమున సంఘసంస్కరణమును సంఘసేవయుఁ గావింప జొచ్చెను. ఇకార్యమునకు వీరు సాక్షి యుపన్యాసములు పత్రికలలోఁ బ్రకటింపఁదొడఁగెను: సాక్షిసంఘమను నొక సంఘమును కల్పించి దానిలో కాలాచార్యుఁడు, జంఘాలశాస్త్రి, సాక్షి, వాణీదాసు, బొఱ్ఱయ్యసెట్టి యను వారిని సభ్యులుగఁ గల్పించెను. వీరొక్కొక్కపనికిఁ గల్పింపఁబడిరి, వాణిదాసు కవిత్వవిషయములకొఱకు, కాలాచార్యుఁడు కాలమందలి ప్రముఖవిషయముల కొఱకు జంఘాలశాస్త్రి తన యుపన్యాసములచే ప్రజాసంఘమునందలి యాచారాదు లనుభావములను విమర్శించుటకు, బొఱ్ఱయ్యసెట్టి వింత ప్రశ్నలడుగుటకు, సాక్షి యీయుపన్యాసములను లోకమునకుఁ బ్రకటించి విజ్ఞానము వెదజల్లుటకు, పిఠాపురమునం దా దినములలోఁ గల కొందఱు ప్రత్యక్ష వ్యక్తులబట్టియే యీపేర్లు పుట్టెనందురు. ఈ పేరులును వీని కల్పనయు హాస్యప్రధానములే. లక్ష్మీనరసింహారావుగారు నీతిని ధర్మములను భారతీయాచారముల విశిష్టతను దెలుపఁ దలఁచిన వారయ్యు కేవల ధార్మికోపన్యాసములు చేయలేదు. అట్లు చేసిన యెడల నీయుపన్యాసముల కింత ప్రచారము కలుగదు. వీరి విమర్శనలు తీవ్రముగ నుండును. శాస్త్ర ప్రమాణమును బట్టియే యుండును. కాని హాస్యము వీరి వ్రాతలకు జీవగఱ్ఱ. మాటి మాటికిని హాస్యము గుప్పించుటచే విమర్శన ఘాటుగనున్నను. కొందఱు తమ తప్పులు విమర్శింపఁబడినవని గుర్తించుకొన్నను, హాస్య రచనము పఠితల మనస్సుల నాకర్షించును. ఈ యుపన్యాసములు ప్రజల మనస్సులను లాగుకొని పోవును. [illegible]

శతాబ్ది పూర్వార్ధమున కం. వీరేశలింగముగారు చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు, పానుగంటివారును హాస్యప్రధాన రచనల నెన్నింటినో చేసిరి. పానుగంటి వారు పెక్కు నాటకములను గాక కంఠాభరణము, వృద్ధవివాహము మొదలగు ప్రహసనములు రచించిరి. సాక్షి యుపన్యాసములు ప్రహసనములు గాకున్నను హాస్యప్రధానములగు వైజ్ఞానికోపన్యాసము. హాస్యమునుగూర్చి యొకరిట్లనిరి. వీరేశ లింగముగారి హాస్యము ముండ్లు గ్రుచ్చుకొన్నట్లుండును, చిలకమర్తి వారి హాస్యము కిచకిచలు పెట్టినట్లుండును. అచ్చట నవ్వించుటే ప్రధానము. విషయముయొక్క సత్యాసత్యములతో నిమిత్తములేదు. పానుగంటివారి హాస్యము శస్త్రపుగదిలో శస్త్రచికిత్సవలె నుండును. సత్యము శాస్త్రము ధర్మము అను వానినిబట్టి దోషము కోసివేయఁబడు చున్నట్లుండును.

'కాలస్వరూపుఁడు' లో కాశీపటములవాని మాటలు హాస్యప్రధానములు వానికి జంఘాలశాస్త్రి లొంగిపోవుట నవ్వు పుట్టించును. తెల్లవారు వఱకును పండ్లుండునో లేదోయను సందేహము చేత ఆందోళనముతో పండ్లపొడివాని కేకలు విని మనుష్యులు పండ్లపొడి కొందురని జంఘాలశాస్త్రి హాస్యము చేసెను. శబ్ద బ్రహ్మబలముచే అలసుముండు దిగ్బంధనమైన ప్రతిమగూడ దిగి వచ్చునసెను. స్వప్నములోఁ దన తల కాలస్వరూపునిచే వెనుకకుం ద్రిప్పివేయఁబడగా ఏవైపున నున్న నేమి తల యిప్పటి కిట్లు నిలిచియున్నదనుకొని సంతసించుట హాస్యము. దైవమునకు గడుపునిండఁ గల్లుపోసినయెడల దెలకపిండి తిన్నకుక్కవలె నాగుమ్మములో గాపుపడియుండునని యొకఁడనుకొనెనట. భగవంతుఁడు ఎల్లకాలమును గూర్చుండిన నడుమునొప్పి పట్టునని పండుకొనవలసి వచ్చెనఁట. భూమిపైఁ బండుకొన్న నొడలు లొత్తుకొని పోవునుగావున పాలసముద్రముమీఁదఁ బండుకొన్నచో జిడ్డంటుకొనును గావున మఱ్ఱియాకులు నాశ్రయించెనట. భగవంతుఁడు దిక్కుమాలినవాఁడట. మీసాలరాయళ్లుండిన లాభములేదుగాన లక్ష్మీదేవిని ప్రక్కను జేర్చుకొనెనఁట. సన్యాసులకు గంజాయిచే దగ్గులు, రోగినులకు గర్భముచేఁ గక్కులు... మొదలైన వాక్యములు కడుపు కోసినట్లు పరిహాసము చేయును. ఇట్టి వాక్యములు సందర్భానుసారముగఁ బొదుగఁబడి హాస్యరసపూరితములై నవ్వుపుట్టించుటేగాక సత్యమును ప్రత్యక్షీకరించును. ఈ హాస్యపువాక్యములందు లోతైన యర్థ మిమిడియుండును. త్వమేవాహమ్మను శ్రుతిని నాచరణముగా ననుభవములోనికిఁ దెచ్చుటకై శరీరైక్యమొందుట యను వాక్యములో వేదాంతులమని పేరుపెట్టుకొన్నవారు వ్యభిచరించుట దెల్పఁబడెను. ఇట్టి యుపన్యాసములందలి హాస్యము చక్కని భాషలోఁ బొదుగఁబడి సత్యసమ్మతమై భావగర్భితమై యుండును. ఈ హాస్యపుతోడుగీ న్యాసములకు మనోహరత్వమును గలిగించెను.

9. ఈ క్రింది వాక్యములను సందర్భసహితముగ వ్యాఖ్యానింపుఁడు.

ఈ వాక్యముల సందర్భములను మూలమునందును అర్థవివరణమునందును చూడుము.

1. క్రొత్తయందు మనుజులకెంత వింత! (క్రొత్త కాశీపటములని పటములమ్మఁ డన్నపిమ్మట జంఘాలశాస్త్రి యిట్లనెను)
2. ఈ మెత్తదనము మనుష్యప్రకృతిలో నేయున్నది. (పరప్రేరితుల మైయెన్నియో పనులు చేయుదుము – పెద్దపాడివాని యుపాయములకు లొంగిపోవుట)
3. శబ్దమునకంత శక్తియున్నది. (నిశ్చల మనస్కులతోఁ బలికిన దేవాలయములోని ప్రతిమ దిగుట)
4. సహింపరాని యాపదలోఁగూడ నేదియో యొక సంతుష్టి. (వెనుకకుఁద్రిప్పి వేయబడినను తల యిప్పటికి నిల్చినది కదా యని జంఘాలశాస్త్రి యనెను)
5. ఎండలు మీసాలకావులున్న నొక్కగాజుల చేయి సుఖమిచ్చునా. (విష్ణురూపనిర్మాణ వర్ణములో, లక్ష్మీదేవి యమరుట)
6. నాస్తికబుద్ధితోఁ జేసిన పాపముల దారివేలు. (బౌద్ధమువలనఁ గలిగిన పాపములు)

, అద్వైతమునకు ప్రచ్ఛన్న బౌద్ధమతమను పేరు వచ్చినది.

బుద్ధుఁడు దేవుని, వేదములను, భక్తిని ద్రోసివేసెను. జ్ఞానము ముక్తికి సాధనమని తెల్పినట్లే శంకరుఁడును దెల్పెను. బౌద్ధములోని పునర్జన్మము, భక్తిని త్రోసివేయుట, జ్ఞానమే నిర్వాణసాధనమనుట, ప్రపంచము మిథ్య(శూన్యము) యనుట మొదలగు విషయములు కొద్ది మార్పులతో శంకరుని యద్వైతమునఁ బ్రవేశించెను. జీవాత్మయే పరమాత్మయనుటచే కొలువబడెడు భగవంతుఁడు లేడు, కొల్చెడు భక్తుఁడును లేడు. మాయామూలకమైన యజ్ఞానమును తొలగించుకొనగానే జీవుఁడు తానే పరమాత్మయగును. అందుచే అద్వైతమతము నాక్షేపించువారు అద్వైతమును ప్రచ్ఛన్న బౌద్ధమందురు. కాని నిజముగ నద్వైతము ప్రచ్ఛన్నముగనైన బౌద్ధము కాఁజాలదు. బౌద్ధము వేదప్రామాణ్యము నొప్పదు. అద్వైతమునకు వేదమే యాధారము. అద్వైతమతజ్ఞానము జీవాత్మ పరమాత్మల యభేదము నెఱుఁగుట. బౌద్ధుల జ్ఞానము ట్టిది కాదు కావున అద్వైతము ప్రచ్ఛన్న బౌద్ధము కాదు.

1. వర్ణవృత్తి లింగము లనావశ్యకములు. (రామానుజయతీశుని నామములు, తులసిపూసలును ధరించిన వారందరును వైష్ణవులే యనుటచేఁ గలిగిన యపార్థములు.

9. ప్రపన్నులకు నియమములులేవు (రామానుజమతమునందలి ప్రపత్తియోగము చెప్పు సందర్భము.

10. ప్రభువులు గాని వనితలు గాని పరులతో విశేషించి సంభాషింపరాదు. మనుష్యప్రకృతిలో మెత్తదన మున్నది. పరప్రేరణచే లొంగిపోదుము. పండ్లపొడి ప్రకటనవానికి లొంగినట్లు మాటకు విశేష బలమున్నది. చాల సేపు మాటలాడినచో రాజులును వనితలును ఇతరుల మాటలకు వశులుగాక తప్పదు. అందుచే వారు లోకువై నిందకుఁగూడ పాల్పడుదురు. కాన రాజదర్శనమును, వనితా సంభాషణమును కష్టసాధ్యముగా నుండవలెను.



# లలిత కళలు - స్వదేశమతము

## భారతదేశము - నాగరికత

శ్రీ కల్లూరి చంద్రమౌళి

కవిజీవితాదులు :—

ఆంధ్రదేశమునఁ బ్రసిద్ధి వడసిన ముఖ్యనాయకులలో కల్లూరి చంద్రమౌళిగారొకరు. సంయుక్త చెన్నరాష్ట్ర ప్రభుత్వమునందును, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ప్రభుత్వమునందును వీరమాత్యులుగానుండి దేశమునకు భావకను చేసినసేవ యెల్ల రెఱిగినదే. చంద్రమౌళిగారు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయములో ఉన్నత విద్యాభ్యాస మొనర్చి దేశసేవాపరాయణులై చిరకాలమునుండి దేశాభ్యుదయకర కార్యములందుఁ బ్రవర్తించుచున్నారు. తమ ఉన్నతాశయములను వీరు కేవలము మాటలతోఁగాక చేతలలో నిరూపించు నుత్సాహవంతులు. ప్రాక్పశ్చిమదేశము లందలి నాగరికతలుకూడ బాగుగా వీరవగాహనము చేసికొనిరి. నాగరికత అనఁగా కేవలము వేషభాషలు గావనియు, లలితకళలయందలి యిమిడియున్నదనియు, మనభారతదేశములో నట్టి లలితకళలు యుగయుగముల నుండియుఁ బెంపొందినవనియు, పాశ్చాత్య నాగరికతా ప్రభావమున నవి నానాఁటికి క్షీణదశ నందినవనియు, ఐనను వాని ప్రాభవము అంతరాంతముగా మనకు నిలిచి యున్నదనియు, వానిని బునరుద్ధరించుట మన విధ్యుక్త ధర్మమనియుఁ దెల్పుచు చంద్రమౌళిగారు 'భారతదేశము- నాగరికత' అను సద్గ్రంథమును రచించిరి. దానిలోని యొక భాగమే 'లలితకళలు- స్వదేశమతము' అను నీ వ్యాసము.

అర్థాదులు:—

లలితకళలు:—కళలు అఱువదినాలుగు పేర్కొనఁబడినవి. వానిలో మృదువుగ నుండు మానవబుద్ధి వికాసమును ప్రదర్శించు సంగీతము, కవిత్వము, చిత్రలేఖనము, శిల్పము ననునవి లలితకళ లనఁబడుచున్నవి. కళలనఁగా భిన్నభిన్న వ్యక్తులకు వారివారి శారీరిక మానసిక గుణవిశేషములబట్టి సహజముగా నలవడునవి. ఇవి కేవలాభ్యాసమువలనవచ్చునవి గావు. సహజముగానున్న కళాశక్తుల నభ్యాసము మెఱుగుపఱచవచ్చును. ఒకని కంఠమందలి ధ్వని నాళములనుబట్టి వానికి చక్కని

సంగీతశక్తి లభింపఁగా నతఁడుదాని నభ్యాసముచేత మెఱుఁగు పఱచుకొనఁగలఁడు. దీనికి మేధశ్శక్తియు ననుసరమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. అట్లే జన్మసిద్ధముగా నొకఁడు కవి యగును. అభ్యాసమువలన గవియైన వాఁడు జన్మసిద్ధకవియొక్క యుత్తమస్థానము నందుకొనఁ జాలఁడు. పైరీతిగనే చిత్రలేఖనము శిల్పమును కొందఱు చేతి(ప్రేళ్ళ) కండరనిర్మాణమునకు వారిబుద్ధిశక్తియు కల్పనాశక్తియుఁ దోడ్పడఁగా వారు చిత్రకారులును శిల్పులును నగుదురు.

నిబిడీకృతము=దట్టముగా చేయఁబడినది. (సంపూర్ణమైనది) స్తూపము. గుండ్రముగను ఎత్తుగనుచుండి లోపల విశాలముగ నుండెడి బౌద్ధుల కట్టడము. పుష్పలతాపత్ర=పూలు, తీగలు, ఆకులు అవ్యక్తనాదముతో = పైకి వినబడని శబ్దధ్వనితో (మూకగనేయుండి భావములను దెలుపుచు).

శ్రీరంగము-ఇది దక్షిణదేశమున తిరుచిరపల్లికి దగ్గఱగానున్నది. ఇట గొప్ప వైష్ణవ దేవాలయమున్నది. ఇట నున్న దేవుఁడు శ్రీరంగనాథస్వామి సప్తప్రాకారముల మధ్యగా స్వామి ఆలయమున్నది. దేవాలయ శిల్పమత్యద్భుతము. మధుర-ఇట మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయమున్నది. మధురగోపురము మిక్కిలి యున్నతముగనుండి వింతశిల్పములతో నొప్పును. ఆవరణములలో సహస్ర స్తంభమండపము సప్తరాగములు ధ్వనించు స్తంభములు గలవు. గోడలమీదను మిద్దె అడుగు భాగముననను రామాయణభారతకథా చర్యలును చిత్రరూపమున లిఖింపఁ బడినవి. వెల్లకిలపరుండి చిత్రకారులు మిద్దెయడుగు భాగమున నీ చిత్రములనెట్లు లిఖించిరో యూహింపఁజాలము. రాతిపై చెక్కిన శిల్పవిశేషములు మిక్కిలి సొంపుగొల్పును.

అమరావతి=ఇది కృష్ణానదీతీరమున నున్నది. ఇది పంచారామ క్షేత్రములనెడి శివక్షేత్రములలో నొకటి. ఇది ప్రాచీనాంధ్ర రాజ్యమునకు రాజధాని, ఇచ్చటి శివాలయ శిల్పము ద్రాక్షారామము, భీమవరము (సామర్లకోట దగ్గఱనున్నది) క్షీరారామము (పాలకొల్లు) లందలి దేవాలయ శిల్పమువంటిది. ఈయాలయములను పల్లవులును చాళుక్యులును నిర్మించిరని చారిత్రికులు చెప్పుచున్నారు. నాగార్జునకొండ-ఇది కృష్ణానదీతీరమున అమరావతికి పడమరగానున్నది. ఇట నాగార్జునుఁడను బౌద్ధగురువు బహుశాస్త్రములను బోధించి, గొప్పకట్టడములను గట్టించి శిల్పములను నెలకొల్పి ఆంధ్రబౌద్ధుల వైజ్ఞానిక ప్రశస్తిని ఖండాంతరము లందును వ్యాపింపఁ జేసెను. ఇందలి కట్టడములన్నియు భూగర్భమునఁ బడిపోయి యీమధ్య జరిగిన త్రవ్వకములవలన బయటఁబడినవి. ఇందలి శిథిలములను మద్రాసు ఢిల్లీ మొదలగు

చోట్లనున్న మ్యూజియములకుఁ జేర్పఁబడినవి. అమరావతి సమీపమునఁ బెక్కు బౌద్ధశిథిలములు దొరికినవి. వీనిలో మిక్కిలి రమ్యమైన శిల్పఖండములను ఆంగ్లేయులు లండను మ్యూజియములోఁ జేర్చుకొనిరి.

విద్యానగరము—విద్యారణ్యస్వామిచేస్థాపింపఁబడిశ్రీకృష్ణదేవరాయలకాలమున నత్యున్నత దశనొందిన 1565 వ సంవత్సరమున అళియరామరాయల యోటమిచే (తాళికోట యుద్ధమున) నాశనమైపోయిన విజయనగరరాజ్యమునకు ముఖ్య పట్టణము. ఈ రాజ్యము మహమ్మదీయులచే భగ్నము చేయఁబడెను. పోర్చుగీసువారు మొదలగు పాశ్చాత్యులచే నద్భుతముగఁ బొగడఁబడిన ఆంధ్ర కన్నడ శిల్పనైపుణ్యము లిచ్చటనుండెను. వాని శిథిలములను జూచుటకుఁ బెక్కండ్రు విజ్ఞానయాత్రలు సాగించుచుందురు.

అజంతా, ఎల్లోరాగుహలు—ఇవి హైదరాబాదునకు సుమారు నూటయేబది మైళ్ళలోనున్న పర్వతగుహా నిర్మాణములు. ఔరంగాబాదునుండి ఈగుహాక్షేత్రములకు బస్సులమీఁదఁ బోవచ్చును. అజంతా ఎల్లోరాయను చోటులందు నల్లరాతి కొండలను దొలిచి భారతీయ శిల్పులు గుహలను నిర్మించి వానియందు రాతిలోనే దేవాలయములను పెద్దపెద్ద విగ్రహములను చెక్కిరి. కొన్ని గుహలు చాల ఎత్తైనవి. కొన్ని పొట్టివి. ఈ గుహలయందలి శిల్పనైపుణ్యమునకు మురియని వారుండరు. చిత్రములకు వేసినరంగులయొక్క రహస్యము నేటికిని రసాయన శాస్త్రవేత్తలకును వింతగొల్పుచున్నది. గుహలలో నెదురుగ చిన్న ఆలయములో విగ్రహములో నుండగా ప్రక్కలందు భక్తులు కూర్చుండి ధ్యానము చేయుటకుదగిన రాతిపీటలుండును. ఇవియన్నియు కొండలో చెక్కఁబడినవే. పైకప్పు అడుగు తట్టున రామాయణ భారతాది కథలకు సంబంధించిన చిత్రములను శిల్పులు వెల్లికిలఁబరుండి యెంతశ్రమపడి నిర్మించిరో యూహింపజాలము. ఈ గుహలందు కొన్ని బౌద్ధ జైన శిల్పములు గలవు. కొన్ని హిందూమత శిల్పములు గలవు. ఈశిల్పముల పటములు వ్రాసికొని మనదేశమందును విదేశములందును కళాకారులు మిక్కిలి మెచ్చుకొని వానిని చిత్రపటముల సంచికలందుఁ బ్రకటించుచున్నారు. ఈగుహాశిల్పములు ప్రాచీనభారతీయ శిల్పచాతుర్యమునకు నిదర్శనములు.

గ్రీకుశిల్పము — యూరపులోని గ్రీసురాజ్య ప్రాంతమున నొక విధమైన శిల్పము క్రీస్తునకు పూర్వమే వృద్ధినొందెను. ఆ శిల్పమునందు హెచ్చుభాగము శారీరకబలము, అవయవ సౌష్టవమును జూపునది.—గ్రీకు శిల్పమునందుకంటె భారతీయ శిల్పమునందు భావప్రకటనము హెచ్చుగ గోచరించును.

రస+ఉద్దీపకము=రసమును హెచ్చుగ ప్రకాశింపఁజేయునది. భావప్రేరకము = చిత్రమునూలమున మనస్సునందలి భావములనుగూడ పురికొల్పఁబడునట్లు చేయునది, ఆధ్యాత్మికతత్త్వము=జీవాత్మకును పరమాత్మకునుగల సంబంధమును దెల్పు భగవత్సంబంధమైన సత్యము,

కన్ను పొడుచుకొన్నను-ఇదియొక జాతీయము (idiom) 'ఎంత తీవ్రప్రయత్నముచేసి వెదకినను కనఁబడనిది' అని భావము. ఒక వస్తువును వెదకుచు అది కనఁబడనిచో కండ్లు పొడిచికొనుకొందునని బెదరించినను కనఁబడకుండ నుండునది కళాపతనము=కళయొక్క నాశము.

పాశ్చాత్యుల మ్యూజియములందు మూతఁ పడియున్నది:— ఆంగ్లేయులు మనదేశమును పాలించునపుడు ఇచ్చటి సౌందర్యవంతమగు శిల్పవిషయములను దమ దేశమునకుఁ గొనిపోయి తమ వస్తుప్రదర్శనశాలలందుఁ బెట్టుకొనిరి. అందుచే నవి మన కండ్లకగపడకపోవునట్లు మూతవెట్టఁబడియున్నవి. భారతదేశము స్వతంత్రమైనందున మన శిల్పవస్తువులను మనకు దిరిగి యిచ్చివేయుమని మనవారడుగుచున్నారు.

ఆంగ్లమానస వికారరూపులు:— భారతీయులు ఆంగ్లవిద్యలను నేర్చి విదేశీయాచారముల ననుకరించుచు, తమ మనస్సులనుగూడ మఱచిపోయి ఆంగ్లేయుల మనస్సుల ననుకరించుటచే మిక్కిలి చెడ్డరూపము గలవారగుచున్నారు.

ఈసడించి = అసహ్యించుకొని. సంపత్కరము = సంపదను గలిగించునది. విపణివీథి=అంగడులున్న వీథి (బజారు), సౌష్ఠవము = చక్కనిస్థితి (అందమైన రూపము), అత్మ+ఉద్దీపనము=హృదయమును వికసింపఁజేయునది. విచ్ఛిన్నత = ముక్కముక్కలుగా విడిపోవుట, దిగంబరత్వము = బట్టకట్టకుండుట, తిరిపెమెత్తుట=బిచ్చమడుగుట, మురళీ = పిల్లనగ్రోవి (ఊదుటచే సంగీతమును బుట్టించు గొట్టము) తంబురా=తీగలు మీటుటచే సంగీతధ్వనులుపుట్టించువాద్యము,పీత+అంబరములు=పసుపురంగుబట్టలు, సరిగ-చీరలు, =జలతారు చీరలు, కూపములు=నూతులు, ఉచ్ఛిష్టము = ఉత్ + శిష్టము=అనుభవింపఁగా మిగిలిపోయినది-ఎంగిలి.

ఊడిగమొనర్చు = దాస్యపుసేవచేయు; ఘోర్కులు = మూడు నాలుగు ఘనులుగలిగి యాహారవస్తువులను బొడిచి నోటిలోఁబెట్టుకొనుటకు వీలైన చెమ్చా

వంటి సాధనములు; చాంపేయన్=గొప్పవారగు విలాసపురుషులు త్రాగెడి మత్తు పదార్థము; నగ్నదృశ్యములు=శరీరముమీఁద వస్త్రములుధరింపని బొమ్మలపటములు; బంధురము = ఒప్పుచున్నది; పరపీడన = ఇతరులను బాధించుట; భస్మీపటలము = దుమ్ముగాఁ జేయఁబడినది (మిక్కిలి నాశము చేయఁబడినది).

## ప్రశ్నోత్తరములు

*1. ప్రాచీనభారతీయులు తమ నిత్యజీవితమునఁ గళను దాండవింపఁజేసిన విధమును విశదీకరించునది.

కళ ప్రతివానికి సహజలక్షణము. మానవుని సర్వకార్యములందు నది నిండి నిబిడీకృతమై యుండును. అదిలేనివాని జీవితము కాంతిలేని సూర్యగోళమువంటిది. ఈ విషయమునఁ బ్రాచీన భారతీయ జీవిత మాదర్శప్రాయమైనది. ప్రాచీన భారతీయుఁడు కళను మూర్తీభవింపఁజేసి తన నిత్యజీవితమును దేదీప్యమానముగఁ బ్రకాశింపఁజేసెను. భారతీయుల దేవాలయములు, బౌద్ధస్తూపములు, గుహాలు, శిల్పములు, చిత్రవిచిత్రములైన వర్ణములతోఁ జిత్రించిన పుష్పలతా పత్ర పశు పక్ష్యాదులు నాఁటి భారతీయుని కళావికాసమును చాటుచున్నవి. దక్షిణాదినిగల రామేశ్వర, శ్రీరంగ, మధుర దేవాలయములు, ఆంధ్రదేశమందలి యమరావతి, నాగార్జునుని కొండ మున్నగు బౌద్ధస్తూపములు, విద్యానగర దేవాలయ గోపురములు, అజంతా, యెల్లోరాగుహాలు మున్నగు క్షేత్రములు భారతీయుల కళానైపుణ్యమును వెల్లడించుచున్నవి.

“ఉత్తమ భారతీయశిల్పము ఉత్తమ గ్రీకుశిల్పముకంటెనధిక రసోద్దీపకము, సూక్ష్మతరభావప్రేరకమునై యున్నది. ఈ కళాసంప్రదాయమున నొకవిధమగు నిండుఁదనము, ఆధ్యాత్మికతత్త్వముఁ గలవు. అవి గ్రీకుల యంతరాత్మల నంటని లక్షణములు” అని ఇ. బి. హావెల్ గారును, “గుహాలు దొలిచి, కట్టడములునిర్మించి, యందుఁ జిత్ర విచిత్ర శిల్పములను నిర్మించు శక్తియందు భారతీయులు పరిపూర్ణ పండితులు, ఎవ్వరును వీరికిఁ దుల్యులుగారు” అని డాల్బర్గరోజాగారును ప్రాచీన భారతీయుల కళావిశిష్టతను బొగడిరి.

ప్రాచీన భారతీయు లిట్లు దేవాలయాది పుణ్యక్షేత్రములనేగాక, తాము నివసించు గృహములు, ఉపయోగించు పాత్రలు మున్నగువానినిగూడఁ గళావిలసి

తమ లోనర్చి తమ నిత్యజీవితమునఁ గళను దాండవింపఁజేసిరి. వారు నిర్మించిన దేవతావిగ్రహములు, నిత్యజీవితావసరములగు లోహపాత్రలు, రాతి - కొయ్య బొమ్మలు, సన్నితములగు వస్త్రములు, రత్నకంబళములు మున్నగునవి చిత్రవిచిత్రములగు నమూనాలతో, వివిధాలంకారములతోఁగూడి వారియొక్క ప్రసిద్ధ హస్తనైపుణ్యమును, నిర్మాణశక్తిని బ్రదర్శించుచు, మానసిక వికాసమును, జీవిత వికాసమును జేకూర్చుచుండును. ప్రాచీన భారతీయుల యీ కళాసంపద వారికాత్మోద్దీపన మొనర్చు శాంతి నొసఁగుచు, ఆర్థిక సాంఘికాది విషయములందు స్వాతంత్ర్యము, స్వదేశాభిమానము కలిగించినది. జాతీయాభిమానముతో వారు కళ నారాధించి పోషించిరి. తన్మూలమున వ్యాపారాభివృద్ధి, వృత్తిపోషణము జరిగి, వస్తు నిర్మాతలగు సాలీలు, కమ్మరులు, కుమ్మరులు వడ్రంగులు మొదలగువారు సుఖజీవనులై నీతిగ మెలఁగ గలిగిరి. భారతీయ గ్రామములన్నియుఁ గుటీరవస్తుసంపన్నములై కళాపూరితములై శోభిల్లినవి ప్రజలందఱు నిత్యజీవితమునకు వలయు నాహార పదార్థములతో, వస్తుసముదాయములతో నిండియుండిరి. ఇతరులను హృదయపూర్వకముగా నాహ్వానించి, యాతిథ్యమొసఁగి సత్కరించిరి.

ఇట్లు నిత్యజీవితములోఁ బెనవేసికొనిన యీకళాసంపదయే కడచిన యాఱువేల సంవత్సరములనుండి భారతీయుల యాత్మోన్నతికిఁ గారణమై, జీవిత వికాసమును బోషించి రక్షించినది. కళాపిపాసులగు ప్రాచీనభారతీయులు తమ కళయందు నూతన వికాసముఁజూపి ప్రపంచమున వ్యాపింపఁజేసిరి. బోర్నియొ, జావా, సుమిత్రా, చైనా మున్నగు ఆసియాఖండ ప్రాంతములందు భారతీయుల లలితకళాకౌశలము నేఁటికి నుట్టిపడుచున్నది. పాశ్చాత్యులు మన ప్రాచీన కళాఖండములను జూచి దిగ్భ్రాంతులై గ్లానిపోయి తమ మ్యూజియములందుంచుకొనిరి. వారు తమ వస్తూత్పత్తికి వీని నమూనా లుపయోగించుకొని వానినే మన నెత్తిని రుద్దుచున్నారు. నవీన నాగరికులు పాశ్చాత్య వ్యామోహమునఁబడి కళారహితములైనను వారి వస్తువులనే యాదరించుచుండుటచేత మన ప్రాచీన కళాసంపదయంతయు నేఁడు కొన యూపిరితో నిలిచియున్నది.

2. పాశ్చాత్య నాగరికతానుకరణముచేత భారతీయ కళానిర్మాణశక్తి నశించిన విధమును, దాని ఫలితమును వివరించునది.

మానవ జీవితమునకు వికాసము కలిగించునది కళ. అది లేనివాని జీవితము కాంతిలేని సూర్యగోళము వంటిది. ప్రాచీన భారతీయుఁ డీవిషయమును గుర్తించి

కళను మూర్తీభవింపఁజేసి తన నిత్యజీవితమును జేవిష్యమానముగఁ బ్రకాశింపఁజేసెను. ప్రాచీన దేవాలయములు, బౌద్ధస్థూపములు మున్నగునవి వారి కళావైభవమును జాటుచున్నవి. భారతీయ శిల్పము సర్వోత్తమమైనది. అది మిక్కిలి భావోద్దీపకమై సూక్ష్మతర భావములను బ్రేరేపించును, లోక విధమును నిందుడగు నాధ్యాత్మిక తత్త్వముఁ గలిగియున్నది. మానవుని జీవితవికాసము, మానసిక వికాసమును జేకూర్చి యాత్మోన్నతిని సిద్ధింపఁ జేసినది. జాతి శోభమాన మంకురింపఁజేసి కళాపోషణ కళను బ్రోత్సాహించినది. నాఁటి వారి కళాభిరుచి వస్తు నిర్మాతల కళాకౌశలమును, నిపుణశక్తిని బెంపొందించి, వృత్తి పోషణము గావించినది. వృత్తిపోషణమువలనఁ గుటీరపరిశ్రమ లభివృద్ధిఁ గాంచి, వ్యాపారాభివృద్ధియై దేశము సుభిక్షమైనది. ప్రాచీన భారతీయు లిట్లాయా వేళల సంస్థానముల నుండి కళను బోషించి రక్షించుచు, నాని కాలమునఁ దగు యార్థిక సాంఘిక సమస్యలను బరిష్కరించి జీవితమునకు నూతనశక్తిని, దేశమునకు నూతన శోభను గలిగించుచు వచ్చిరి.

కళమూలమున నొకప్పుడు ప్రపంచమున కందచందము లొసఁగి జ్యోతివలెఁ బ్రకాశించిన మనదేశము నేఁడు సర్వవిధములైన జాతి వ్యాపారమును గోల్పోయినది. పాశ్చాత్య నాగరకత కలవడిన నవనాగరికులు యంత్రనిర్మిత వస్తువుల నాదరింపఁ జొచ్చిరి. నేఁడు మనపట్టణములందు, దుకాణములందుఁ గాంచినచోఁ గళారహితములగు నున్నని భవనములు, తెల్లని గుడ్డలు, సాదైన వస్తుసముదాయమే కనఁబడును. అవి కళారహితముగా నుండుటయేగాక, కళాపతనమునుగూడ సూచించుచుండును. పాశ్చాత్య విద్యావ్యామోహితులగు మనవారు వారివస్తువులనే యభిమానించుచు, భారతీయ కళాకౌశలమును దెలుపు వస్తుసముదాయమును మోటుగ భావించి నిరాదరముతోఁ ద్రోసివైచుచున్నారు.

పాశ్చాత్యనాగరికత యంత్రవ్యాపార నాగరికత. అది పెద్ద పెద్ద యంత్రాలయములను నెలకొల్పి, కళయందలి సృష్టిశక్తిని, జీవితవికాసమును హత మొనర్చినది. మనవారు దానిని గ్రుడ్డిగ ననుకరించుచు, దమ సహజ జీవితమును గళావిహీన మొనర్చుకొనుచున్నారు. ఆంగ్లానుకరణమువలన, నావేశపూరితమయి యాహ్లాదమును జేకూర్చు నందచందముల నాకరమగు వస్తువులను నిర్మించుశక్తి వారిలో నశించినది. పైపెచ్చు వారు వంశపరంపరాగతమగు సర్వకళల నిసడించి వినాశ మొనర్చిరి. కావుననే నేఁటి దుకాణములందెల్ల భారతీయహస్తకౌశలమును దెల్పుచు నానందావేశములను బురికొల్పు

జీవితవికాస సంపత్కారము గు వస్తుజాలముగాక, కళాహీనములై తళతళ మెఱయుచుం దక్కువజాతికిం జెందిన, హెచ్చుధరయుం తాత్కాలిక జీవితమును గల పాశ్చాత్య వస్తుసంపదయే మనకు కనంబడుచుండును. బజారు నిండుగ హెచ్చు ధనము గుంజుట కాధార రూపములగు గ్లాస్గోమల్లులు, పంచరంగుల నున్నని పారా షిపాలు, బూటు పాలిషులు, దువ్వెనలు, ఫేసుపౌడరులు మొదలగు అందచంద ములులేని యనవసర వస్తుజాలమే మనకుం గనంబడును.

నీతిబద్ధమగు జీవితమున కాధారమగునవి అందచందములు, పరిశుభ్రత. వీనిని జేకూర్చునవి లలితకళలు. అట్టి లలితకళలను మనవారు పాశ్చాత్య నాగరికతా వ్యామోహముచే పూర్తిగ నాశమొనర్చిరి. మన గృహముల కప్పులకు తుత్తుయరేకులు మేడలకు నున్నని సిమ్మెంటు లాదులు, నున్నని దర్వాజాలు, ఇంటినిండ సాదా లోటాలు, కాఫీపాత్రలు, జపాను, సెల్యూలాయిడ్ బొమ్మలు, కాగితపుంబువ్వులు, గాత్రస్వరమును జెఱచు గ్రామఫోనులు, దిగంబరత్వము చూపించు ఉల్లిపొర వస్త్రములు–ఇట్లు మన ముపయోగించు వస్తుజాల మంతయు, గళారహితమై యున్నవి మఱియు వేషమున, జుట్టున, కట్టున, నడకను సర్వమునం బరుల ననుకరించుటయే కనంబడును.

ఇట్టి పరానుకరణమువలనం గళాభిరుచి మనలో నంతరించినది. దానిమూలమున నాగరిక వినాశనము, ఆత్మవిచ్ఛిన్నత సంభవించెను. కళయందలి యీ నిర్లక్ష్యత, ఈసడింపు సున్నితములగు మనరుచులను బారంద్రోలి బలసౌష్ఠవములను దగ్గమొనర్చి మనజాతినిం బరులపై నాధారపడు దుర్బలజాతిగ నొనర్చినవి. ఈ కళారహితానుకరణజీవితము మనలో దేశభక్తిశూన్యతను బ్రబలంజేసినది. జాతీయ భావము నణచివైచినది. కళావిలసితములగు మనవస్తువులపై నేవగింపు జనింపంజేసినది. దానివలన మన పరిశ్రమలు నశించినవి. వంశానుగతమగు హస్తనైపుణ్యమును, లావణ్య సౌకుమార్యమును బ్రదర్శించు మన ప్రాచీన కృతి సంపన్నులగు సాలె, కుమ్మరి, కమ్మరి, మున్నగువారు నిరుద్యోగులైరి. మనదేశపు సిరిసంపద లంతర్ధానమైనవి. తుదకు మన జన్మహక్కు కూడ నశించిపోయినది. ఇట్లు పాశ్చాత్య నాగరికతా వ్యామోహాంధకారముచేం బ్రాచీన కళావైభవ మంతరించి, మానసిక దారిద్ర్యము, భావదాస్యము మనలోం బ్రబలినవి. ఆర్థికముగను, సాంఘికముగను మన దేశ మధఃపతన మైనది.

3. కళాపోషణ నవలంబించవలసిన పద్ధతులను గూర్చి వ్యాసకర్త భారతీయులకుఁ గావించిన ప్రబోధమును విశదీకరింపుఁడు

కళలు మానవున కానందము, ఆవేశము కలిగించి మానసిక వికాసము, జీవిత వికాసమును జేకూర్చును. అవియే సూక్ష్మతర భావప్రేరకములై యతని కాత్మోన్నత్యమును సిద్ధింపఁజేయును. జాతీయ భావము, దేశాభిమానము నీ కళలమూలమున నేర్పడుచుండును. జాతియొక్క యార్థిక సాంఘిక సమస్యలను బరిష్కరించి జీవితమునకు నూతనశక్తిని, దేశమునకు నూతన శోభను నొసఁగునవి లలితకళలే. మన ప్రాచీను లీ విషయమును జక్కఁగా గుర్తించి కళ నారాధించి నిత్యజీవితమునఁ దాండవింపఁజేసికొని దానిని బోషించినారు. వారిలోని కళాభిరక్తి వలనఁ గళాకారుల నిర్మాణశక్తి హస్తకౌశలము వికసించినవి. దానివలన వృత్తిపోషణము జరిగి వ్యాపారాభివృద్ధియై దేశము కుటీర పరిశ్రమలతో నిండి సుభిక్షముగా నుండెను.

నేఁడు పాశ్చాత్య విద్యావ్యామోహితులగు నవనాగరికులు యంత్ర నాగరికత కలవడి భారతీయ కళాకౌశల కాంతులు విదచల్లు వస్తువులను మోటువానినిగ భావించి యీసడించుచున్నారు. కావున నేఁటి పట్టణములందలి దుకాణములలోఁ గళావిరహితములై యధికధనము గుంజుట కాధారమగు పాశ్చాత్య యంత్రనిర్మిత వస్తువులే మనకుఁ గనఁబడును గాని, మనహస్తకౌశల నిర్మిత సుకుమార సుందర విగ్రహములుగాని, ఆనందావేశములఁ బురికొల్పు జీవితవికాస సంపత్కరమగు వస్తు సముదాయముగాని గానరావు. ఈ యంత్రనిర్మితవస్తుజాలము నభిమానించుటచేఁ గొలఁదిమంది మాఱుబేరగాండ్రు ధనవంతులగుచున్నారుగాని, దేశమందలి వివిధ వృత్తులు నాశనమయి, ప్రజలు నిరుద్యోగులై దరిద్రులగుచున్నారు. పాశ్చాత్య సంప్రదాయ విద్యాపారంగతు లీ విషయమును గమనింపక యంత్రపరిశ్రమాభివృద్ధియే మనసంపదగ, అభివృద్ధిగ, ఐశ్వర్యముగ, భావించి కీర్తించుచున్నారు. కాని యది పొరపాటు, అర్థసంపాదనే మన కృషి కుచితఫలము కాదు. మన ఆర్థిక సాంఘిక సౌష్ఠవమును, కళాకౌశల వికాసమును, ఆధ్యాత్మికౌన్నత్యమును బడయుటే స్వాతంత్ర్యము గావలయును గాని, కేవల రాజకీయము గాదు. మనము నిర్జీవమగు యాంత్రికశక్తిని గాక ప్రాణశక్తిని వాంఛింపవలెను. అనుకరణమును గాక, సహజశక్తి ప్రకాశమును గోరవలెను. ఆత్మరహితమై కళారహితమై హృదయరహితమైన వ్యాపార నాగరికతను గాక, యాత్మోద్దీపనమును జేకూర్చు శాంతజీవితమునే కోరవలయును.

ప్రాశ్చాత్యోను కరణమున మనము మనయిండ్లను మనముపయోగించు వస్తువులను– మనజీవిత విధాన మంతను కళారహిత మొనర్చుకొంటిమి దాని మూలముగా ఆర్థిక వినాశము, ఆత్మవిచ్ఛిన్నత సంభవించినది. కళయందు మనకేర్పడిన యీ నిర్లక్ష్యతచే ఈపడింపు సున్నితములగు మన రుచులను బారద్రోలి బలస్వాభావములను దిగమొనర్చి మనజాతిని బరుల బిచ్చమువై సాధారపడు దుర్బలజాతిగ జేసినవి జీవితస్వాస్థ్యము లేని జాతి దేశమును ప్రేమింపజాలదు. కళారహితమగు పాశ్చాత్య నాగరికతను గ్రుడ్డిగా ననుకరించుటచేతనే నేడు మనలో దేశభక్తి శూన్యమయినది. కావుననే ప్రాచీనకాలమున ప్రపంచమున కందచందము లొసగి జ్యోతివలె ప్రకాశించిన దేశము నేడు దుర్బలమౌ జాతీయత్వమున కుంటుపడెడి. కాబట్టి యికనైన పాశ్చాత్యులను దిరిపె మొత్తుట మానవలెను, స్వశక్తిపై కళను బోషించి వ్యాపారమును వెంపొందించుకొని స్వాతంత్ర్యమును బొందవలెను.

కళాకౌశలము సృష్టిశక్తిని వికసింపజేసి, మనలో నిర్మాణశక్తిని, ఆచరణశక్తిని యుదయింపజేయును. కావున కళాపోషణమే క్రమజీవిత వికాసమనియు నందే వ్యాపారాభివృద్ధియు, వృత్తిపోషణము నిమిడియున్నవనియు గుర్తింపవలెను. యంత్రములమూలముగా మానవశక్తి వృథాపోవుచున్నది. తాత్కాలిక లాభమునకై అట్లు వ్యర్థపఱుపక, కళాశక్తిని వెంపొందించి మానవశక్తిని బోషింపవలెను. కళారహిత వస్తునిర్మాణ వ్యాపారము అల్పమనస్కుల నాకర్షింపజేసి వారిని బశుతుల్యులంగ నొనర్చును. కావున కళావిలసితములగు స్వదేశవస్తువులను ప్రేమించి గృహపరిశ్రమలను బోషింపవలెను. నేటికిని మన పల్లెలలో కళానైపుణ్యమును ప్రదర్శింపగల శిల్పులు పెక్కురు గలరు. వారి కవకాశ మిచ్చుచో పాశ్చాత్యులను దిగ్భ్రమచెందించు పెక్కు చతురకళావస్తువులు నిర్మింపగలరు. మనము పాశ్చాత్యుల యుచ్ఛిష్టములకు మురిసిపోయి, మన కళాకోవిదుల నోటిమట్టిగొట్టుచున్నాము. కాబట్టి మనలో సంపన్నులు వస్తువులమూల్యము ఎక్కువయును సాటిచూపక మన పక్కారంగుల కాశీపీతాంబరములు, బందరు కలంకారీ వస్త్రములు, ఢిల్లీ పాలరాతిబొమ్మలు, విశాఖపురి దంతపు బనితుట్లు, మైసూరు చందనవస్తువులనే యెక్కువమూల్య మిచ్చియైన గొనవలయును, శక్తికొలది స్వదేశవస్తువుల నాదరించి కొనుటయుండే దేశసంపద యభివృద్ధియు, స్వాతంత్ర్య వికాసమును గలవు. తాత్కాలిక జీవితమునకెలిగి చౌకగా లభించు, యంత్రనిర్మిత వస్తువులకంటె ఎక్కువకాలము మను మనవస్తువులు లాభదాయకములనియు, వంశానుగతమగు

హస్తనైపుణ్యమును, లావణ్య సౌకుమార్యములను ప్రదర్శించు మన ప్రాచీన వృత్తి సంపన్నులగు సాలె, కమ్మరి, శిల్పి మొదలగువారు నేటి యంత్రములకంటె, యంత్ర నిర్మాతలకంటె గొప్పవారనియు గుర్తింపవలెను.

మన స్వదేశీయోద్యమము కేవలము పాశ్చాత్య దృక్పథముతోఁ బునరుద్ధరింపరాదు. ఆర్థికదృష్టితోఁ బాశ్చాత్య మార్గముల ననుకరింపరాదు. మన జాతీయోద్యమము ఆర్థికమూల్యముతో పాటు ఆంతరంగిక మూల్యమును, రాజకీయ స్వతంత్రతతో పాటు రాటుదేలిన సంస్కృతిని ప్రదర్శింపవలెను. కటిక పరిశ్రమలు గావించువారు తమ యుదరపోషణకేగాక, జాతివినాశమునకును దోడ్పడుచున్నారను భావము మనలోఁ బెంపొందవలెను. యంత్రములకంటె మానవులే విలువగలవారను నాదర్శమును మఱవరాదు. ఆర్థిక నాగరికతా గమ్యస్థానము దుస్సహమగు శ్రమజీవితముగాక, శాంతియుతమగు విశ్రాంతిజీవితమే యని మఱవరాదు. యంత్రపరిశ్రమ జనులరక్తమాంసములుపీల్చి నిర్వీర్యులను గావించును. మానవుని పరిశ్రమయే దేశసంపద నభివృద్ధిచేయును. పాశ్చాత్య పద్ధతుల ననుసరించి జీవితము గడపుట జాతీయత యనిపించుకొనదు. జీవితమును సక్రమపథమున వికసింపఁజేయునదే జాతీయత, దీనిని మఱచి మన మానసిక దారిద్ర్యము, భావదాస్యములను గమనింపకున్నాము. మన దేశమును బునరుద్ధరింపవలెనన్నచోఁ, ప్రాచీనౌన్నత్యము, నేటి పతనావస్థను గుర్తించి, జాతీయభావముతో స్వదేశీ వస్త్రములు, వస్తువులు తప్ప నన్యముల నాశింపఁమను దీక్షను భారత స్త్రీ పురుషులు గైకొనవలెను. అప్పుడు మన దేశము తొంటియట్లు సిరిసంపదలతోఁ దులఁదూగుచు, తన యౌన్నత్యమును బునః ప్రతిష్ఠించుకొనఁగలుగును.

ఈ క్రింది వాక్యములు సందర్భ వివరణములకుఁ దగినవి :—

1. పాశ్చాత్య నాగరికత యంత్రవ్యాపార నాగరికతయే.
2. స్వదేశీ యుద్యమమును కేవలము పాశ్చాత్యదృక్పథముతోడనే పునరుద్ధరింపఁ గూడదు.
3. బురదచే బురదను గడుగఁ గలమా?

పాఠ్యభాగమందలి వ్యాకరణ విశేషములు:—

1. చిన్న+పోయి—ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగును. చిన్నవోయి. ఇట్లే మూర్ఛవోయెను—తొందరవెట్టెను వెం॥

2. ఈ+తెలుఁగు-త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబు గానగు. ఈ+త్తెలుఁగు-ద్విరుక్తంబగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగును. ఇత్తెలుఁగు.

3. బలవంతము+పెట్టు-పడ్వాదులు పరమగునపుడు మువర్ణమునకు లోపముగాని, పూర్ణబిందువు గాని వికల్పముగా నగును. బలవంతపెట్టు లేక బలవంతంపెట్టు ఇట్లే లోపపడక, తత్తఱపడుచుండెను. కటకటంబడి, నిరుత్సాహ పరుపక మొ॥

4. అవంగము+ముగ్గ - కర్మధారయంబులందు మువర్ణకంబునకు పు-ంపు అగును. అవంగంపు ముగ్గ, ఇట్లే గారాపు బిడ్డ, అద్దపుముక్కలు, పడుచుఁ దనంపు గర్వము మొ॥

5. చులుకన+తనము-ఉదంత స్త్రీ సమంబులకు, పు-ంపులకు, అదంత గుణవాచకంబులకును 'తనము' పరమగునపుడు నుగాగమమగును. చులుకన తనము (ద్రుత కార్యములు) చులుకఁదనము. ఇట్లేచిన్నఁదనము. మెత్తదనము మొ॥

6. కజ్జరము+కాయలు-కర్మధారయంబులందు మువర్ణకంబునకు పు-ంపు అగును. కజ్జరపు+కాయలు-సమాసములందు ఉదంత స్త్రీ సమంబులకును, పు-ంపులకును పరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగును. కజ్జరపు నుకాయలు (ద్రుత కార్యములు) కజ్జరపుఁ గాయలు ఇట్లే కాగితపుఁ బువ్వులు, దంతపుఁ బనిముట్లు, ప్రాచీనపుఁ గట్టడములు మొ॥

7. ప్రియ+ఆలు - కర్మధారయంబులందు తత్సమ శబ్దములకు 'ఆలు' శబ్దము పరమగునపు డత్వమును కత్వమును రుగాగమంబు నగును. ప్రియురాలు. ఇట్లే సహాయురాలు, మూర్ఖురాలు, శత్రురాండ్రు, మిత్రురాండ్రు స్వస్థచిత్తురాలు మొ॥

8. పల్ల+నెల, నెల+చెలులు - అన్యంబులకు పయిక మిశ్రకార్యంబులు (లోప నుగాగమములు, లోపద్విత్వములు) కొండొకచోఁ గానంబడియెడి. పన్నెల, నెచ్చెలులు, ఇట్లే నెమ్మొగము, నెమ్మేను మొ॥

9. మూఁడు+పాతికలు - సమానాధికరణంబగు ఉత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దములోని డువర్ణకంబునకు లోపంబును, మీఁది హల్లునకు ద్విత్వంబును విభాషనగు. మూ+ప్పాతికలు-ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ముప్పాతికలు-ద్విగువున లేక వచనంబు ప్రాయికంబుగానగు. ముప్పాతిక.

10. నిడు+ఊర్పు–కుఱు, చిఱు, కడు, నడు నిడు శబ్దముల ఱడలకచ్చుపరగునపుడు ద్విరుక్త టకారమగును. నిట్టూర్పు.

11. ఎదుట+ఎదుట, పగలు+పగలు– ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలి యచ్చుమీఁద వర్ణంబులకెల్ల అదంతంబగు ద్విరుక్తటకారంబగును. ఎట్టయెదుట, పట్టపగలు.

12. అంతకున్+అంతకున్ మాటికిన్ + మాటికిన్–ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగును, అంతంతకు మాటిమాటికి.

13. మిట్లు+మిట్లు–అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు, మిఱుమిట్లు.

14. అయ్యో+అయ్యో–అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడుసంధి తఱచుగా నగు. అయ్యయ్యో!

15. పూజ+ఆగారము, వస్తు+ఉత్పత్తి–అ, ఇ, ఉ, ఋ లకు సవర్ణము పరమగునపుడు సవర్ణదీర్ఘ మేకాదేశమగును. పూజాగారము, వస్తూత్పత్తి.

16. యథా+ఇచ్ఛము. లోక+ఉత్తరులు, దేవ+ఋషులు–అకారమునకు ఇ, ఉ, ఋలు పరమగునపుడు క్రమముగా ఏ, ఓ, అర్ లు ఏకాదేశమగును. యథేచ్ఛము, లోకోత్తరులు, దేవర్షులు.

17. అతి+అల్పము, ప్రతి+ఉత్తరము–ఇ, ఉ, ఋ లకు అసవర్ణమయిన యచ్చు పరమగునపుడు క్రమముగా య్, వ్, ర్, అనున వాదేశమగును. అత్యల్పము. ప్రత్యుత్తరము.

18. నాగరికత+ఔన్నత్యము – అకారమునకు ఏ, ఐలు పరమగునపుడు ఐ కారమును, ఓ, ఔలు పరమగునపుడు ఔ కారము నేకాదేశమగును. నాగరికతౌన్నత్యము.

19. జగత్ + మిథ్యాత్వము – స్పర్శములకు అనునాసికాక్షరములు పరమగునపుడు సవర్ణానునాసికములు వికల్పముగా వచ్చును. జగన్మిథ్యాత్వము.



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.